# ఉపక్రమణిక

## ఇది స్వాతంత్ర్య సమర యుగం!

ఆధునిక ప్రపంచేతిహాసంలో ఈయుగచర్యలే చరిత్రను రచిస్తున్నవి; ప్రపంచగతిని రూపిస్తున్నవి; మానవజీవిత గమనాన్ని నిర్దేశిస్తున్నవి.

'స్వాతంత్ర్యం' ఈనాటి ప్రపంచ మానవ సమస్య! 'స్వేచ్ఛ' - ఈనాటి పరాధీన దేశాల మహితాకాంక్ష! 'విప్లవం' ఈనాటి అస్వతంత్ర్యదేశాల పాలిట ఆశానినాదం! 'సంఘర్షణ' ఈనాటి రాజకీయవ్యవస్థాధర్మం! ఒక్కమాటలో - ఈనాటి ప్రజా సమస్య: 'శాంతి - స్వాతంత్ర్యం - ప్రగతి' —

ఈ పవిత్రాశయాల సముపార్జనకు, సంస్థాపనకు సర్వ ప్రపంచము సంక్షుభిత మవుతున్నది. నేడు నాల్గు చెఱగులా మానవుడు ఈనాడు వీటికోఱకే జీవన్మరణములమధ్య తపస్సుచేస్తూవున్నాడు.

స్వాతంత్ర్య సంపాదనకై పోరాడటం బానిసజనుని ప్రాథమికహక్కు! దీనిపరిణామమే సంఘర్షణ; ప్రపంచమంతటా ఏదో ఒక రూపాన నడుస్తున్నది. పాలకదేశంపై పాలితదేశం తిరగబడుతున్నది. సామ్రాజ్య ప్రభుత్వంపై సామ్రాజ్యస్థమైనప్రజ ధ్వజమెత్తుతున్నది. సామ్రాజ్యవాదాన్ని స్వాతంత్ర్యవాదం ఢీకొంటున్నది. స్వాతంత్ర్య విదూరుడు స్వాతంత్ర్యహారునితో సమరతలాన తలబడుతున్నాత్ర్య

ఆకలిదప్పులకంటె మానవుడు నేడు స్వాతంత్ర్యానికే అధికమైన విలువ నిస్తున్నాడు. ఆకలిదప్పులను మాత్రమేకాదు— దానితోపాటు స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకొరకుకూడా నేడు 'ప్రాచ్య

ఖండం' ప్రపంచదేశాలు అన్నిటికంటె పలుభంగులుగా పల్లటిస్తు న్నది. పాశ్చాత్యసామ్రాజ్యవాదపు ఇనుపగుప్పెటనుండి బయట పడటానికి ప్రాచ్యదేశాలు పెక్కువిధాలుగా పెనగులాడుతున్నవి.

స్వేచ్ఛాస్వాతంత్ర్యాలతో, విజ్ఞాన వికాసాలతో, కళా విభూతులతో తులతూగి సర్వప్రపంచానికి జ్ఞానభిక్షను పెట్టి, ఒకనాడు ఆచార్యస్థానమలంకరించిన భారతభూమి — పదంపడి ప్రాచ్యఖం డము — ఈనాడు విధివశాన పరాధీనమై, పరప్రభుత్వాల పరిపా లనలలో పలుబాములు పడుతున్నవి...!

అమృతతుల్యమగు ఆదికాలమది — విజ్ఞాన భానుడు ప్రాచ్యఖండాన ప్రభవించినాడు; కోటి సూర్య ప్రభలతో ప్రాచ్యా కాశాన పరిభ్రమించినాడు. ప్రాచ్యఖండం ఒక విజ్ఞానకమలమై విప్పారింది; తన విజ్ఞానజ్యోతిని దశదిశలా వెలారించింది. కాలగతిని ఆ మధ్యందిన మార్తాండుడు పశ్చిమదిశకు పయనించినాడు. అతని ప్రభావం నాటినుండి పశ్చిమఖండంపైననే ప్రధానంగా ప్రతిరూపి స్తున్నది. ప్రాచ్యఖండం నిస్తేజమైపోయినది. దీర్ఘసుషుప్తికి లోగి పోయింది. సుమారు మూడు శతాబ్దాలుగా ఆ గాఢనిద్రలో ప్రాచ్య భూమికి ఎన్ని పీడకలలు! మరెన్ని పాడుకథలు!!

బ్రాహ్మ, క్షాత్రశ్రీలు పండిన ప్రాచ్యఖండంలో 'వైశ్యం' అడుగుపెట్టింది. వాణిజ్యదాహంతో పాశ్చాత్య జాతులు ప్రాచ్య భూములలో ప్రవేశించారు. భూరివిభూతులను చూచి పులకాంకితు లైనారు. ఆశాప్రలోభులై - ఆ ధర్మక్షేత్రాలలో అధర్మబీజాలను నాటారు. మున్ముందుగా భారతావనిలోను, పిమ్మట ప్రాచ్యఖం డపు బంగారు భూములలోను వారికి, కాలం కలిసివచ్చి, పంట పుష్కలంగానే పండింది. వాణిజ్యవృక్షం వేళ్లుపాతుకొంటున్న కొలది - సామ్రాజ్యతృష్ణ వారికి పెరిగిపోయింది. ప్రాచ్యదేశజుల దైనికజీవితంలో "వర్తకము - వ్యాపారము" పేరిట బాగా అల్లు కొనిపోయిన వారి వ్యూహాలు స్వదేశరాజుల పాదాలకు బందాలుగా పరిణమించాయి. ఫలితంగా సింహాసనాలే కుల్లిపోయాయి. పట్ట ణాలలో కోటలుకట్టిన వారి పోటరితనం కడకు దేశాలనే స్వాహా చేసివేసింది.

పోర్చుగీస్, డచ్, ఫ్రెంచి, బ్రిటిష్ దేశజులు - తమ వాణిజ్య, సామ్రాజ్య కుతంత్రాలలో ఒకరినిమించి వేరొకరు ఘనులై ప్రాచ్యఖండాన్ని తమ తమ చదరంగక్రీడలకు కేంద్రంగా మార్చు కొన్నారు. మూడు శతాబ్దాలపాటు వారికుతంత్ర వ్యవసాయం సాగిపోయింది. ఫలితంగా - ప్రాచ్యఖండాన - ఇండోచైనాలో ఫ్రెంచివారు, ఇండోనేసియాలో డచ్ వారు, భారతావనిలో బ్రిటిష్ వారు మంచి ఫలసాయాన్నే పొందగలిగారు. సుమారు పదునారవ శతాబ్దంనుండి వారికి ప్రాచ్యభూములలో పలికితే బంగారు పలు కుతూవుంది; అష్టఐశ్వర్యాలనూ అవి అమర్చి పెడుతున్నవి.

కాని - కాలపురుషుని లోకచరిత్ర ఒకవిధంగానే గడచి పోదుకదా!

కాలం మారిపోయింది. ప్రాచ్యదిశలో వేగుచుక్క పొడి చింది. ఆసియాఖండం దీర్ఘనిద్రనుండి మేల్కొన్నది. స్వాతంత్ర్య విదూరమై, ఐశ్వర్యవియోగమై - శ్వేతజాతుల చేతిలోవున్న తన బానిసబ్రతుకును గుర్తించుకొన్నది; బానిస సంకెలను త్రెంచి, ప్రాచ్యఖండంనుండి పాశ్చాత్య జాతులకు స్వస్తిచెప్పి, ప్రాచ్యప్రజ లకు 'విమోచనము'ను ప్రసాదించడానికి నేడు సమరోత్సాహాన్ని సంతరించుకొని లేచి నిలువబడ్డది. పూర్వ ప్రాభవాన్ని పునరార్జించు కొనడానికే కాదు- భావిలో యావత్ప్రపంచానికి భవ్య భద్రతలను ప్రసాదించడానికికూడా ప్రాచ్యప్రజ సర్వత్యాగాలను చేస్తున్నది; రక్తబలిదాన మిస్తున్నది.

ప్రాచ్యఖండమంతటా ఈనాడు అశాంతి అగ్నిపర్వతం వలె భుగభుగ మంటున్నది. అన్నితావులలోను అనుక్షణ సంఘర్షణ ప్రజ్వలిస్తున్నది. ప్రాచ్యజాతులకు, పాశ్చాత్యజాతులకు మధ్య అవి రామమైన సమరం సాగుతున్నది.—

చైనాలో ప్రాచ్య, పాశ్చాత్య రాజ్యతంత్రాలు ఫిరంగి గుండ్ల మధ్య బలాబలాలను చూచుకొంటున్నవి. ఫిలిప్పయినులలో అమెరికన్ వాణిజ్య సామ్రాజ్యం అస్త్రసన్యాసం చేస్తున్నది. ఇండో చైనాలో ఫ్రెంచి సామ్రాజ్యవాదం పట్టువీడి, పొలిమేరలను పట్టు కొని వ్రేలాడుతున్నది. ఇండోనేసియాలో డచ్ సామ్రాజ్యవాదం

చావలేక పెనుగులాడుతున్నది. భారతభూమిలో బ్రిటిష్ సామ్రాజ్య హింసావాదాన్ని 'అర్ధదిగంబర సన్యాసి' అహింసాశక్తి నిర్వీర్యం చేసివేసింది. అంతేకాదు, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల 'అణు' శక్తినికూడా ధిక్కరించి నిలువగలుగునది ఈ విశాల ప్రపంచంలో ఒక్క ఈ 'అహింసా' శక్తియేననికూడా చేయెత్తి చెబుతున్నది.

సుమారు ఒక శతాబ్దిగా పెక్కు పరీక్షలకు లోనై కాకలుదేరి - ప్రాచ్యఖండపు స్వాతంత్ర్యపిపాస నేటికి అజేయమై నిలిచింది. నూరు సంవత్సరాలుగా నడిచివస్తున్న ప్రాచ్యఖండ స్వాతంత్ర్య సమరచరిత్రలో ఎన్నో విషాదకరములైన అధ్యాయాలు మరెన్నో రక్తప్లావితమైన దృశ్యాలు !! స్వాతంత్ర్యాకాంక్ష అడుగడుగునా శక్తివంతమవుతూ వచ్చింది. తత్తుల్యంగానే సమరవిధానంకూడా చేవదేరుతూ వచ్చింది. కాలం మారుతూవచ్చింది, నేడు పూర్తిగా మారిపోయింది.—

ఆంగ్ల కవిచంద్రుడు జార్జి బెర్నార్డ్ షా అన్నాడు :

"...స్వాతంత్ర్యం ఒకరు ఇచ్చునది, వేరొకరు పుచ్చుకొనునది కాదు. ఇచ్చి, పుచ్చుకొను కాలం గతించిపోయింది. ఏజాతికి ఆజాతి, ఏదేశానికి ఆదేశం స్వీయ స్వాతంత్ర్యాన్ని సంస్థాపించుకొనడమే ఇక యుగధర్మం...యింకా పద్ధెనిమిదవ శతాబ్దపు సామ్రాజ్య వాదానికి ఈనాడు తావులేదు ..." అని.

—'షా' కవివర్యుని ఈ పలుకులలోని భావం ప్రపంచ మంతటా నేడు కొంతవరకు ఆచరణరూపాన నడుస్తూవుంది.—

స్వేచ్ఛకోసం ప్రతిజాతి, స్వాతంత్ర్యంకోసం ప్రతి అస్వతంత్రజాతి తహతహ లాడుతున్నది. అందులోను ఈ ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామం వచ్చి, వెళ్ళి - ఈ తహతహపాటును మరింత తీవ్రతర మొనర్చింది.—

దీని ఫలితమే - ఒకజాతి వేరొకజాతిపై అధికారాన్ని చెలాయించు రాజనీతి ఈనాడు దుర్నీతిగా హేయపాత్ర మవుతున్నది. సామ్రాజ్యదేశాలు ప్రపంచ దృష్టిలో రోతకు, విశేషించి ప్రతీకార విధానానికి గురియవుతున్నవి. ప్రజావాంఛను మన్నించి, ప్రజానిర్ణయానికి తల ఒగ్గవలెనన్న 'వివేకం' సామ్రాజ్యదేశాలకు

కలుగకపోలేదు కాని— 'వెనుకటి గుణాల'ను ఒక్క పెట్టున విడనాడలేక అవి పెనుగులాడుతున్నవి. పూర్వపుమమకారానికి, ప్రస్తుతపు స్వార్థానికి [illegible] గి సామ్రాజ్యదేశాలు అస్వతంత్ర్య ప్రజలను ఇంకా అణచిపెట్టి, కొల్లగొట్టుకో నుద్యమిస్తున్నవి. దీని విపరూపమే - పాలక - పాలిత జాతులమధ్య సంఘర్షణగా - ప్రాచ్య, పాశ్చాత్య దేశాల నడుమ నేడు నగ్నంగా ద్యోతకమవుతున్నది.

భారతభూమిలో బ్రిటిష్ సామ్రాజ్యవాదం లోనవుతూ వున్న తీవ్రాఘాతాలకు వలెనే - ఒకనాడు భారతదేశానికి వలస భూములైన "స్వర్ణద్వీపాల"లోకూడా నేడు డచ్ సామ్రాజ్యవాదం చెంపపెట్లు తింటున్నది. 'ఇండియా' వలెనే 'ఇండోనీసియా' కూడా స్వాతంత్రజ్యోతిని ఎత్తిపట్టి ప్రపంచ దిగ్భ్రమను గొల్పుతున్నది. ఇండోనీసియా స్వాతంత్ర సమరాన్ని హర్షిస్తూ భారతదేశం జోహారు లర్పిస్తున్నది. భారతదేశమే కాదు — సర్వమానవ స్వాతంత్ర్యాభిమానులగు ప్రపంచ ప్రజలుకూడా ఇండోనీసియాకు జేజేలు చెబుతున్నారు.

'ఇండియా'కు నారసత్వం వున్న ఆ ఇండోనీసియా చరిత్రను గురించి - ఈసందర్భంలో తెలిసికొన వలెననే ఉత్సాహం జనించడం సహజం. ఇండోనీసియా నైసర్గిక స్వరూపము, చరిత్ర, ప్రజలు, రాజకీయవ్యవస్థ - మొదలైనవాటిని గురించి క్లుప్తంగా వివరించడానికి ఈ పుస్తకం ప్రయత్నిస్తుంది.

ప్రపంచ అగ్రరాజ్యాల రాజనీతికి, భావిప్రపంచవ్యవస్థా ధర్మానికి, విశేషించి మానవేతిహాసంలో ఒక మహత్తర సమస్యకు గీటురాయి కాబోతూవున్న 'ఇండోనీసియా స్వాతంత్ర్య సమరగాథ'ను విశాలహృదయులై విలోకించాలి! సర్వమానవ శాంతి సౌఖ్యాభ్యుదయాలను ఆకాంక్షించి, గురుగంభీర చిత్తులై విప్లవోన్ముఖులు కావాలి! ప్రపంచంలో అస్వాతంత్ర్య చరిత్రకు అశ్వాసాంతం చేయాలి, వెంటనే చేసితీరాలి!!

ఇదే - ఈనాటి మానవధర్మం!

# ఇండోనీసియా నైసర్గికస్వరూపం

ప్రాచ్యఖండములో ఐశ్వర్యవంతమైన దేశాలు రెండే రెండు: ఒకటి భారతభూమి, రెండు ఇండోనీసియా. నైసర్గిక స్థితికి, శీతోష్ణస్థితిగతులకు, సస్యఫలాలకు, ఖనిజసంపత్తికి తదితర సర్వ ఐశ్వర్యాలకు ఈ దేశాలు రెండున్నూ పెట్టిపుట్టినవి.

భారతభూమి దక్షిణపు కొననుండి ఆగ్నేయదిశలో ఆస్ట్రేలియా వరకు వ్యాపించివున్న సువిశాలమైన మహాసముద్రంలో - దూసిపోసిన రత్నాలవలె చెల్లాచెదురుగా వున్న ద్వీపముల సంపుటికి 'ఇండోనీసియా' అని పేరు.

భారతదేశానికి 'ఇండియా' వలెనే ఈద్వీపాలకుకూడా 'ఇండోనీసియా' అనే ఈపేరు సరియైనది కాదు. —

ఆద్వీపవాసులు వీటిని 'రత్నద్వీపాలు' అని పిలుచుకుంటారు. 'సుమత్రా' దీవిని ప్రత్యేకంగా 'స్వర్ణద్వీపం' అని వారు పిలుస్తారు. భారతీయులు కూడా ఈ ద్వీపసమూహానికి అంతకీ 'స్వర్ణద్వీపాలు' అని వ్యవహరించారు. అట్లే - పాశ్చాత్యులు వీటికి 'గోల్డెన్ ఐల్సు' (Golden Isles) అని నామకరణం చేశారు. - ఇన్ని పేర్లు వున్నా వీటికి సరియైన పేరు వేరొకటి వుంది: 'మలేసియా' మలయన్‌జాతి - అనగా బూడిదరంగు గల్గ ఒక ప్రత్యేక విశిష్టమైన జాతికి ఆవాసంగాగల ఈ ద్వీపావళికి 'మలేసియా' అను పేరే సముచితమైనదని ప్రాజ్ఞులు చెబుతున్నారు. కాని 'బాస్టిన్' (Bastian) అను ఒకజర్మన్; భూశాస్త్రజ్ఞుడు వీనికి 'ఇండోనీసియా' అనేకల్పిత నామాన్ని సృష్టించి నామకరణం చేసాడు. అందువల్ల ఈపేరే, ఈపాశ్చాత్యయుగంలో ఈ దీవులకు అన్వర్థ నామం అయిపోయింది.

భౌగోళికంగా ఇండోనీసియా చాలా విస్తృతికలది. ఆఫ్రికా పశ్చిమదిశను వున్న 'మడగాస్కర్' దీవిమొదలుకొని, లక్షదీవులు, మారిషన్ దీవులు, సింహళము, అండమాన్ దీవులు, సుమత్రా, జావా, బోర్నియో, సెలెబస్, టైమర్, న్యూగినీ, ఫిలిప్పయిను దీవులమీదగా - చైనాపడమటి కోస్తాలోవున్న ఫార్మోజా దీవివరకు - "ఇండోనీసియా" వ్యాపించి వున్నదని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు:-

కాని - నేటిభూగోళ శాస్త్రాన్ని బట్టి - మడగాస్కర్ దీవి ఆఫ్రికాకు చెందినదని - ఫార్మోజాదీవి చైనాకు పోలినదని చెప్పబడుతూవుంది. ఫిలిప్పయిన్ దీవులు ఒకప్రత్యేక నైసర్గిక స్వరూపాన్ని పెంపొందించుకున్నాయి. న్యూగినీ దీవిపైన ఆస్ట్రేలియా ఖండపు ప్రభావం అధికమైపోయింది. అందువల్ల మలయా జలసంధి మొదలుకొని - అనగా సుమత్రాదీవినుండి ఆస్ట్రేలియా వరకు గలదీవులకు మాత్రమే "ఇడోనీసియా" అనిపేరు నేడు స్థిరపడివున్నది. ప్రాయకంగా- ఇండియా ఆస్ట్రేలియాల నడుమగల ద్వీపావళి - డచ్ తూర్పుఇండియా దీవులు అని నేడు వ్యవహరింప బడుతున్నవి

ఇండోనీసియా ఒకమహాఖండమంత విస్తృతమైనది. హిందూమహాసముద్రం మొదలుకొని పసిఫిక్ మహాసముద్రంవరకు 3,300 మైళ్ళపొడుగు — ఆసియాఖండపు దక్షిణతీరం మొదలు దక్షిణంగా 1,100 మైళ్ళవెడల్పుగల విశాలసముద్రం అంతా ఇడోనీసియాకు చెందివున్నది. తటాకంలో వికసించిన తామరపూవుల్లాగ ఈవిశాలసముద్రంలో 3,000 దీవులకుపైగా విడివిడిగా అమిరివున్నాయి. ఈ దీవుల సాముదాయిక వైశాల్యం 7,33,680 చదరపు మైళ్ళు జనాభా 69,500,000 (1940)

ఇండోనీసియా 'ఉష్ణమండలం లోవుండటంవల్ల - దీని శీతోష్ణస్థితి - ఉష్ణమేఅనిచెప్పవచ్చు. కాని, సముద్రపవనాలు, పర్వతాలు మొదలైన వాటివల్ల - దీవులలో సమ శీతోష్ణస్థితి ఏర్పడుతూ వుంటుంది. వర్షాకాలం అనే ఋతువు వున్నది కాని - సంవత్సరం పొడుగునా వర్షాలు పడుతూనేవుంటాయి. వర్షఋతువులోమాత్రం 144 అంగుళాలవరకు వర్షం ఇచటకురుస్తుంది.

వీటికి 'తూర్పుఇండియాదీవులు' అనేపేరు కూడావుంది. మలయాద్వీపకల్పం నుండి సుమత్రాదీవి 'మలాకా' జలసంధివల్ల వేరుచేయబడుతూవుంది. సుమత్రకు, ఆగ్నేయదిశలోవున్న జావాకు నడుమగల సముద్రానికి 'సుండా జలసంధి' అనిపేరు. సుమత్రా దీవికి తూర్పుగా గొలుసుకట్టుగా వ్యాపించినవున్న అనేక దీవులలో జావామొదటిది. బలి, లంబక్, సంబవ, ఫ్లోరిస్, మొదలయిన దీవులు ఈవరుసలో ముఖ్యంగా పేర్కొనదగినవి—

ఈ వరుసకు కొంచెం దక్షిణంగా సంబా, తైమర్ దీవులు వున్నాయి. వీటికి ఉత్తరాన మరియొకవరుస దీవులున్నాయి. వాటిలో బోర్నియో పెద్దది. బోర్నియోకు తూర్పున 'సెలిబస్' దీవులు,వాటికి తూర్పున 'మొలుకాస్' ద్వీపసమూహములు వున్నాయి.

ఇట్లు విడి విడిగాను, గుంపులు గుంపులుగాను వున్న ఈ దీవులన్నిటిని చేర్చి - ఒక పెద్దఖండంతో పోల్చవచ్చు. ఈదీవుల విస్తృతిని గురించి ఇంకా వివరంగా చెప్పుకోవాలంటే - ఒక చిన్న సాదృశ్యం వున్నది. సుమత్రాను ఇంగ్లాండువద్ద వుంచితే - న్యూగినీదీవి టర్కీవద్ద వుంటుంది. అంటే ఇంచుమించుగా ఐరోపా దక్షిణపుటెల్ల - తూర్పుఇండియాదీవుల నిడివితో సమానమన్నమాట. ఈ సాదృశ్యాన్నిబట్టి ఈ ప్రదేశపు విస్తృతి చక్కగాను, సులభం గాను విశదం కాగలదు.

తూర్పు ఇండియాదీవుల నడుమగల సముద్రాన్ని పరిశీలించి - భూగోళశాస్త్రజ్ఞులు ఇంకొక అభిప్రాయాన్నికూడా వెలిబుచ్చుతూ వున్నారు.

బోర్నియో, సెలిబస్, సుమత్రా, జావా, బలి ద్వీపాలను ఆసియాఖండంనుండి వేరుచేసే సముద్రం అంతలోతైనది కాదు. అట్లే - న్యూగినీ, ఫ్లోరిస్, లంబక్ దీవులను ఆస్ట్రేలియానుండి వేరుచేసే సముద్రమున్నూ అంతలోతైనది కాదు. కాని - ఈ రెండు గుంపుల మధ్యను వున్న సముద్రం విపరీతమైన లోతుగలది. బలి, లంబక్ దీవుల నడుమ సముద్రం పదిహేనుమైళ్ళ వెడల్పు గలదే అయినప్పటికిని అది అగాధమైనది. అందుచేత భూగోళశాస్త్రవేత్తలు

మొదటిగుంపు దీవులు ఆసియాఖండంతోను, రెండవగుంపు దీవులు ఆస్ట్రేలియా ఖండంతోను పూర్వం కలిసివుండేవని నిర్ధస్తూవున్నారు.

'వాలస్' అనే భూగోళశాస్త్రజ్ఞుడు సుమత్రా, జావా, బలి, బోర్నియోదీవులు పూర్వమొకనాడు ఆసియాఖండంతో చేరి వుండేవని - కాలక్రమాన్ని ఆదీవులను సముద్రం ఆసియా ఖండంతో విడదీసిందని చెబుతున్నాడు.

అసలు భారతభూమితో ఈ దీవులన్నీ కలిసివుండేవని - నేడున్న బంగాళాఖాతం వెనుక లేదనికూడా మరికొందరు భూగోళ పరిశీలకులు అంటున్నారు - ఏది ఏమైనప్పటికిని - ఈ దీవులు ఆసియాఖండానికి చెందని - ఒక ప్రత్యేకమైన భౌగోళిక విశిష్టతను మాత్రం నేడు కలిగివున్నాయి. ఇదే గమనింపదగిన ముఖ్యవిషయము.

—ఇది తూర్పుఇండియా దీవుల సాముదాయిక నైసర్గిక స్వరూపం. ఇక ఆ ద్వీపసంచయంలోని పెద్దదీవుల స్వరూప విశేషాలనుగూర్చి తెలుసుకొందాము.—

**సుమత్రా :**-తూర్పు ఇండియా దీవులలో మిక్కిలిపశ్చిమాన్ని వున్నదీవి సుమత్రా. దీనిగుండా భూమధ్యరేఖ పోతూవుంది. దీనినిడివి 1060 మైళ్ళు. బాగా విస్తరించివున్నచోట దీనివెడల్పు 248 మైళ్ళు. మొత్తం విస్తీర్ణం 167,480 మైళ్ళు. సుమత్రాదీవి శీతోష్ణస్థితి కొంతవరకు నివాసయోగ్యమైనదే-కాని - ఉష్ణతాపము మాత్రం మిక్కిలిగా వుంటుంది.

సుమత్రాదీవిలో ఇంద్రగిరి, జాంబి, మూసి అనునవి మూడున్నూ ముఖ్యమైన నదులు. వీటిలో జాంబి పెద్దనది. 'ఇంద్రపుర' అనే కొండలోపుట్టి ఇది తూర్పుసముద్రంలో కలుస్తూవుంది. 'జాంబి' నగరంవద్ద ఈనది వెడల్పు 1300 అడుగులు. 'మూసి' నదీతీరాన 'పాలెంబాగ్' అను నగరంవున్నది. ఈ నగరం ఒకప్పుడు ప్రముఖనగరంగాను, ఒకరాజ్యానికి రాజధానీ నగరంగానూ విలసిల్లి వుంది. కాని ఇప్పుడు అది జీర్ణశిధిలమైవుంది. సుమత్రాదీవి చెరువులకు ప్రసిద్ధి. అట్లే అగ్నిపర్వతాలకుకూడా అది పేరుమోసింది. వుండడానికి మొత్తం 90 అగ్నిపర్వతాలు వున్నా - నేటికిన్నీ సజీవంగా వున్నవి వాటిలో 12 మాత్రమే...!

సుమత్రాదీవి ఖనిజసంపదకు పేరుపడ్డది. వెండి, రాగి, ఇచట విశేషముగా లభిస్తాయి. అగ్నిపర్వతాలచెంత గంధకం, 'నాఫ్తా' అనే మట్టితైలం, పటిక, సురేకారం లభ్యమవుతాయి. తగరము, సీసము, బొగ్గుకూడా ఇచట దొరుకుతాయి. ఈ దీవిలో 'బంగారం' పూర్వం బాగా లభ్యమయ్యేదట! అందుచేతనే దీనికి 'స్వర్ణదీవం' అని పేరువచ్చింది. చిత్రమేమంటే - 'స్వర్ణద్వీపం' అనే పేరు నేటికిని వాడుకలోవున్నా ఇచట 'స్వర్ణం' మాత్రం ఇపుడు లోపించింది...!

అడవులతో నిండారి వుండడంచేత సుమత్రాదీవి - టేకు, చందన వృక్షాలకు ప్రత్యేకఖ్యాతి గన్నది. కర్పూరవృక్షాలు, సాంబ్రాణిచెట్లు, కొబ్బరి, సగ్గుబియ్యము, పోకచెట్లుకూడా ఇచట విస్తారముగా వున్నవి. భూమి చాలా సారవంతమైనది. వరి, కాఫీ, పొగాకు, లవంగాలు, జాజికాయలు, మిరియాలు, చెరుకు, రబ్బరు, విశేషంగా ఇచట పండుతవి.

అయినప్పటికిని 'సుమత్రా' అంత భాగ్యవంతమైనదిగా చెల్లుబడటంలేదు. దీనికి ముఖ్యకారణం సుమత్రాలోని విశేష ఉష్ణస్థితి, విపరీతమైన వాతావరణ పరిస్థితిని. అందుచేతనే ఇచట జనాభా అంత ఎక్కువగాలేదు. జావా దీవికంటె ఇదినాల్గురెట్లు పెద్దది అయినా - జావా జనాభాలో ఐదోవంతు మాత్రమే ఇచట నివసిస్తున్నారు. స్వల్పమైన ఈ జనాభాకూడా ఒకజాతికి చెందినవారు కాదు. వివిధజాతుల ఆవాసమై ఉండటమే సుమత్రాకు ఒక అభ్యుదయ నిరోధకమై పోతున్నది...!

జావా :- మలయా ద్వీపకల్పంనుండి విడివడిన సుండా ద్వీప కూటంలో - అన్నిటికంటె జావాదీవి పెద్దది.

జావాద్వీపం పొడుగ్గా, సన్నంగా వుండి కొంచెం దక్షిణంగా మొగ్గుతూ తూర్పు పడమరలుగా వ్యాపించి వున్నది. దీని పొడుగు 622 మైళ్ళు. వెడల్పు 55 మొదలు 121 మైళ్ళవరకు వున్నది. దీని వైశాల్యం 50744 చదరపుమైళ్ళు. జనాభా 3,00,00,000.—

దీవికి మధ్యగా పర్వతపంక్తులు వ్యాపించి వుండటంవల్ల వాటిచుట్టూ సారవంతమైన ప్రదేశం ఏర్పడింది. జావాలో సుమారు నూరు అగ్నిపర్వతాలు వున్నాయని వాడుక వున్నదిగాని - వాటిలో నేడు కనిపిపిచేవి 46 మాత్రమే. అందు 20 నేటికిన్నీ నిప్పులు కక్కుతూనే వుంటాయి.

జావాలో చిన్నచిన్న నదులు పెక్కులున్నవి కాని - వాటిలో - సొలో, బ్రాన్‌టాస్ నదులు మాత్రమే పేర్కొన తగినవి. చిన్ననదులు ప్రయాణ సౌకర్యాలులేనివే అయినా వ్యవసాయోపయోగానికిమాత్రం బాగా అక్కరకు వస్తాయి.

ప్రపంచంలోని సారవంతమైన ప్రదేశాలలో జావా ఒకటి. సంవత్సరం పొడుగునా పచ్చని పైరులుండటం ఆ దీవికొక ప్రత్యేకాలంకారం. పశ్చిమాన్ని వున్న బటేవియా నగరం నుండి - తూర్పుకోస్తానువున్న సురబాయా రేవువరకు రైలు మీద ప్రయాణం చేస్తూవుంటే తోటలు, పంటపొలాల మధ్యగా పోతూ- మన 'కోనసీమ'వలె కన్నులపండువగా వుంటుంది.

వరి, చెరుకు, సింకోనా, కాఫీ, పొగాకు, తేయాకు, నీలిమందు-ఇచ్చటబాగా పండుతాయి. సస్యశ్యామల భరితమైనందు వలననే జావాదీవిలో జనసాంద్రత చాలహెచ్చుగా వుంటుంది. జావాఖనిజసంపద అంతగా చెప్పుకోతగినది కాదుగాని - 1863 లో పెట్రోలియమ్ కనుగొనబడినప్పటినుండి-జావాకు ఈవిధమైన ప్రసిద్ధి కూడా ఒకింత లభించింది.

'బ్రాంటన్' నదీముఖద్వారంలో వున్న 'సురబాయా' నౌకాశ్రయం - ప్రపంచప్రసిద్ధ నౌకాశ్రయాలతో సమాన ప్రాముఖ్యతను కలిగివుంది.

జావా రాజధానీనగరం 'బటేవియా'. ఇచ్చట బత్తాయి నారింజలు విశేషముగా పండుతాయి. ఆపట్టణనామమే ఆనారింజలకు పర్యాయనామమైనది. పండ్లకువలెనే జావా సుగంధద్రవ్యాలకు కూడా ప్రసిద్ధిగన్నది.

**బోర్నియో** :- 'గ్రేటర్ సుండాదీవులు' అనబడు వాటిలో బోర్నియో దీవి అన్నిటికంటె పెద్దది.

ఇది జావాకంటె ఏడెనిమిది రెట్లు పెద్దది. వైశాల్యం సుమారు 3,55,100 చదరపు మైళ్ళు. అయినా జనాభామాత్రం 30 లక్షలు. — బోర్నియోలోని నదులు పెద్దవి. ప్రయాణాలకు అనుకూలమైనవి. కాని దీవిఅంతా అరణ్యాల మయమై వుంటుంది. సగ్గుబియ్యపు (తాడి) చెట్లు ఇచ్చటి వృక్షసంతతిలో ప్రత్యేకంగా పేర్కొనదగినవి.

భూమి సారవంతమైనది. వరి, చెరుకు - మొదలైన అన్ని రకముల పంటలూ పండుతాయి. కాని, వన్యమృగాలబాధ, మొసళ్ళు మొదలైన జలజంతువుల పీడ మిక్కుటంగా వుండటంవల్ల జనులు ఇచట నివశించడానికి భయపడుతారు. వీటికితోడు 'అడవిజ్వరాలు' విశేషం. అందుచేతనే ఇచట జనాభా చాలాతక్కువ.

బోర్నియోదీవి ఖనిజములకు కూడా పేర్గన్నది. వజ్రాలు బంగారం, వెండి, సీసము, రాగి, పాదరసం, బొగ్గు, పెట్రోలియమ్ - మున్నగుఖనిజాలు ఇచట విస్తారంగా లభిస్తాయి.

బలి:— బలి ద్వీపం చిన్నదేఅయినా-వాసయోగ్యమైనది, ఐశ్వర్యవంతమైనది కావడంవల్ల దానికి పెద్దపేరు లభించింది. —

జావాకు తూర్పుగా ఈదీవివున్నది. మైలున్నర వెడల్పుగల జలసంధి-దీనిని జావానుండి వేరుపరుస్తూవుంది. బాగావిస్తరించివున్నచోట ఈదీవి పొడవు 93 మైళ్ళు. వైశాల్యం 2095 మైళ్ళు. జనాభా 946, 397. — (1926 సం॥)

బలిద్వీపంలోకూడా అగ్ని పర్వతాలు వున్నాయి. వాటిలో 4 నేటికినీ మంటలను వెదజల్లుతూనేవుంటాయి. దీవిలోతూర్పునుండి పడమటివరకు కొండ పంక్తులు వ్యాపించివున్నాయి. చిన్నచిన్న నదులు, విశేషించి చెరువులు వుండటంవల్ల వ్యవసాయం చక్కగా సాగుతూవుంది. దానికితోడు సారవంతమైన భూమికనుక - వరి, మొక్కజొన్న, పత్తి, కాఫీ, పొగాకు, చెరుకు బాగాపండుతాయి. పంటపొలాలతోను, తోటలతోను దీవి - ఏదిక్కున చూచినా నేత్రాలకు విందుకూరుస్తూవుంటుంది.

ఇక — ఫ్లోరిస్, లంబక్, సెలిబస్, టైమర్ మొదలైన దీవులుకూడా మరికొన్ని పేర్కొన దగినవి లేకపోలేదు. - కాని

సాముదాయికంగా వాటినైసర్గిక, శీతోష్ణస్థితులలో అంత వ్యత్యాసం కనబడదు. అన్నిదీవులూ ఖనిజాలకు ప్రసిద్ధిగన్నవి.

మొత్తంమీద - తూర్పుఇండియా దీలన్నిటిలోను జనపదాలు పల్లెలు విస్తారములుగాని, పట్టణాలు, నగరాలు చాలాతక్కువ. ముఖ్యమైనవాటిలో-బటేవియా, సురబాయా, సురకర్త, సమరాంగ్, బాన్డన్గ్, జొగ్గకర్త, మకాస్సార్, మేడన్ - పట్టణాలను పేర్కొన వచ్చును.

తూర్పుఇండియా దీవుల మొత్తంవైశాల్యం 733681 చదరపుమైళ్ళకు - 5,10,13,878 మందిజనులు మాత్రమే నివశిస్తూవున్నారు. ఇందులో జావాదీవి జనాభా 3,64,03,833. అంటే చదరపు మైలుకు 717 మంది నివశిస్తూవున్నారన్నమాట. మిగిలినదీవులన్నిటిలోను 14610045 మంది నివశిస్తూవున్నారంటే-చదరపుమైలుకు 21 మందిమాత్రమే నని తేలుతూవుంది. జావాలోనే విశేషజన సంఖ్య వుండటంచేత - తూర్పుఇండియా దీవులలోకల్లా దీనికే అధికమైనప్రఖ్యాతి కలిగినది. "డచ్ తూర్పు ఇండియా దీవులు" అనగానే జావా స్ఫురణకు వస్తుంది. డచ్ రాజ్య పరిపాలనను గురించి చెప్పుకోవలెనంటె - జావాప్రధాన కేంద్రంగా కనుపిస్తుంది. ఇండోనీసియన్ - జాతీయతను పేర్కొనవలెనంటె - జావాజాతీయరంగం ఒకదివ్వెవలె గోచరిస్తుంది. తూర్పుఇండియా దీవులలో 'జావా' మకుటాయమానమైనది. ఇండోనీసియా జాతీయ జీవనానికి జావా ఇరుసు, జీవగర్ర.

తూర్పు ఇండియా దీవులు - కేవలము కొన్నిచిల్లర ద్వీపకూటంమాత్రం కాదు - ఒక 'ఖండము' అనిచెప్పుకొనడంలో అతిశయోక్తిలేదు.

వైశాల్యంలో తూర్పు ఇండియాదీవులు ఐరోపా వైశాల్యంలో సగం వుంటుంది.

మదుర దీవితో కలిసిన జావా వైశాల్యం అమెరికా, సంయుక్తరాష్ట్రిలలోని న్యూయార్కు రాష్ట్రింతో సమానమైనది. అంతేకాదు - జావాను పాలిస్తూవున్న హాలెండుకు అది నాలుగున్నర రెట్లుపెద్దది.

సుమత్రాదీవి గ్రేట్ బ్రిటన్ కంటె పెద్దది. అమెరికాలోని కాలిఫోర్నియాతో సమమైనది.

బోర్నియో - ఫ్రాన్సుఅంత పెద్దది.

సెలిబస్, దానిపరిసర ద్వీపాలు కలిసి - అమెరికాలోని వాషింగ్ టన్ రాష్ట్రింకంటె పెద్దవి. ఇటలీతో సమమైనవి.

— ఈవిధంగా తూర్పుఇండియా దీవులు ఒక ఖండంతో సరిపోల్చదగి ఒక ప్రత్యేకతను కలిగివున్నాయి. నిశ్చయంగా - తూర్పు ఇండియాదీవులు - ఒక "ఉపఖండము" - ఇది అత్యుక్తి కాదు.

సువిశాలమైన మహాసముద్రంలో - సురూపమైన ద్వీపావళి - ఇండోనీసియా —

అనువైన నైసర్గిక స్వరూపముకలిగి, యోగ్యమైన వాతావరణస్థితికలిగి -పాడిపంటలకు, అష్టఐశ్వర్యములకు పెట్టిపుట్టి, ఖనిజసంపత్తికి, ప్రాచీనసంస్కృతికి నోచిపుట్టి - ఇండోనీసియా - నేడొకమహత్తర చరిత్రను రచిస్తున్నది ; మహోజ్వల భవిష్యత్తును ఆకాంక్షిస్తున్నది. మహోన్నతమైన ఉదాహరణనే ప్రపంచ పరాధీనజాతులకు చూపి - శాశ్వత స్వాతంత్ర్య జ్యోతిని - ప్రాచ్యఖండములో పాదుకొలుప నున్నది. —

# ఇండోనీసియా ప్రాచీనచరిత్ర

ప్రాక్తన ప్రాచ్యఖండ చరిత్ర మహత్తరమైనది.

ప్రాచ్యఖండ ప్రాచీన చరిత్రకు పరమేశ్వరాంశను ఆపాదిస్తూ ప్రాజ్ఞులు ప్రస్తుతిస్తూవుంటారు.

యుగయుగములనుండి ప్రాచ్యభూభాగాన ధర్మములు జన్మించి వర్ధిల్లినవి. మానవుడు కేవలమొక ధర్మస్వరూపుడై చరించాడు - ధర్మమే ఆనాటి ప్రపంచనీతిగా వర్ణిత మవుతూ వుంటుంది.

ఉదాత్తము, ఉద్వేగపూరితము, విశేషించి పరమపవిత్రము ఐన ఆనాటిచరిత్రలను - మహాకావ్యాలరూపాన పఠించి మనం ఉత్సాహసంభరితుల మవుతూ వుంటాము. పరిణత ధర్మక్షేత్రం - ప్రాచ్యక్షేత్రానజన్మించినందుకు మనం గర్విస్తూవుంటాము! - నిర్ధారణములు వలసినన్ని లేకపోయినా, నిజంవలసినంతగా తెలియక పోయినా- ఆ ప్రాక్తన చరిత్రలు మనప్రాచీన విజ్ఞాన శోభను వెల్లివిరియింప జేస్తూవుంటాయి కనుకనే - ప్రాచ్యఖండం ఒకనాడు మహోన్నతమైన ప్రాచీన జ్ఞాన శిఖరాన్ని అధిష్ఠించి వుండెనని మనకు తోచక మానదు.

ప్రాచ్యఖండపు ప్రాచీనవిభూతిలో - ఇండోనీసియాకు కూడా ఒకింత పాలున్నది. —

ప్రాచీనకాలంలో ఇండోనీసియా ఒకసర్వ స్వతంత్ర్యమైన దేశము - సంస్కృతిలో, విజ్ఞానంలో, మానవవికాసంలో ఇండోనీసియాకు ఒకప్రత్యేక ప్రాభవమున్నది. -

అసలు 'ఇండోనీసియా' కు పూర్వం 'మలేసియా' అను నామం వ్యవహరింపబడుతూ వుండటంవల్ల - అదిఒకప్రత్యేక విశి

ష్టతగల దేశమని, బహిఃప్రపంచంతో దానికి సంబంధం ఏర్పడ డానికి పూర్వమే అచట ప్రజలు వుండేడివారని ప్రశిద్ధ భూగర్భ శాస్త్ర వేత్తలు, మానవచరిత్ర పరిశోధకులు చెబుతూవున్నారు. -

ఇండోనేసియాకు, అనగా మలేసియాకు 500,000 సంవత్స రాలకు పూర్వపు చరిత్రయే వున్నదట ! 1890 సంవత్సరం నుండి జరుగుతూ వస్తూన్న పరిశోధనల ఫలితంగా - ఇండోనేసియా భూగ ర్భమునుండి బయటపడిన కొన్ని అస్థిపంజరాలను బట్టి ఇచట ఐదు లక్షల ఏండ్లకు పూర్వమే మానవులు నివశించి వున్నారని - 'ఇద్యూ బియస్' వంటి చరిత్ర పరిశోధకులు తెలుపుతూవున్నారు. - నేడు ఓషధీ ప్రక్రియలకు పనికివస్తూన్న మొక్కలలో పెక్కింటికి 'ఇం డోనేసియా' భాషలకు సంబంధించిన పేర్లువుండటంవల్ల ఆమొక్క లన్ని ఆదిలో ఇండోనేసియానుండియే ఇతర ప్రాంతాలకు వెళ్ళివు న్నవని - అట్టివాటిలో - 'కొబ్బరిచెట్టు' ప్రత్యేకంగా పేర్కొన దగినదని - ఇండోనేసియన్ చరిత్ర పరిశోధకులు చెబుతూవున్నారు.

జావాద్వీపంలో - దొరకిన శిలాయుధాలను పరీక్షించిన కొందరు ప్రముఖులు - ఈపైవాదాన్ని ధృవపరుస్తూవున్నారు. మలేసియనులు పూర్వంప్రజ్ఞాయుతులైన సముద్ర సంచారులట ! 'మంగోలియా' జాతులు యుద్ధనైపుణ్యంలో పేరుగనినట్లే - మలే సియనులకు ఈ సముద్రసంచార ప్రతిష్ట ప్రత్యేక విశిష్టమైనదట !

ఇవిగాక 'ఇండోనేసియా' ప్రాచీన ప్రాభవాన్ని తె లుపు మరికొన్ని తార్కాణాలు కూడా లేకపోలేదు. -

ఇండోనేసియా తూర్పుదిశను/కొన్ని వందల మైళ్ళ దూరం లోవున్న పశిఫిక్ మహాసముద్ర మంతటా విరియపూసి వున్న ద్వీప సంచయంలో ఇండోనేసియన్ ప్రజలు ఆనాడు తమవలసలను నెల కొల్పుకున్నారు. ఇందుకు తార్కాణంగా - ఆయాదీవులలో నేడు వున్న ఆదిమనివాసుల ఆచారవ్యవహారాలలో ఇండోనేసియన్ జాతీ ఛాయలు ఉండటం గమనింపదగిన విశేషం. ఫిలిప్పయినులు, ఫా ర్మోజా దీవులలోని ఆదిమనివాసులలో నేటికి ఈవిశేషం బాగా గోచరిస్తుంది.

ఇంతేకాదు - ఆనాడు విజ్ఞాన యశోధనులైన మలేసియనులు, రాజ్యవిస్తరణా కాంక్షతోను, విజ్ఞానవ్యాపకాభినివేశంతోను- పసిఫిక్ మహాసముద్రాన్నికూడా అధిగమించి-అమెరికాఖండ పశ్చిమ తీరాన్నిచేరి అచట తమ విజ్ఞానముద్రలను వేసివున్నారనికూడా చెప్పబడుతూవుంది.

తూర్పుదిశలోనేగాక - చైనా దక్షిణ, తూర్పుహద్దులలోకూడా మలేసియనుల ఆచార ప్రభోదాలు నేటికిని కొన్ని కంటపడుతవి.

ఇండోనీశియాకు ఇటుపశ్చిమదిశలోకూడా - మలేసియనుల ప్రాచీన సంస్కృతి పరిభ్రమించింది। సింహళము, మాల్దీవులలో తనముద్రనువేసి హిందూమహాసముద్రంగుండా ఆఫ్రికాకు తూర్పునవున్న మడగాస్కర్ ద్వీపమువరకును ప్రాకిపోయింది. మడగాస్కర్ దీవిపేరు - ఇండోనీసియన్లు పెట్టిన ప్రాచీననామం. ఆ దీవిలోని ప్రాచీనప్రజల ఆచారవ్యవహారాలు ఇండోనీసియన్ ప్రజల ఆచారవ్యవహారాలను పోలివుంటుంది. కొన్నిస్థలముల పేర్లు మాత్రమేగాక, మడగాస్కర్ ఆదిమనివాసుల భాషలోకూడా మలేసియన్ భాషాపదజాలం మిక్కుటంగా కనిపిస్తుంది.

ఇండోనీసియాలో నేటికినీ అరణ్య, పర్వతప్రదేశాలలోని ఆదిమనివాసులగు ప్రజల ఆచారవ్యవహారాలను పరికించినట్లయితే - వాటిఛాయయి అటు మడగాస్కర్ దీవిమొదలుకొని, ఇటు ఫార్మోజావరకు గల అన్నిదేశాలలోని ఆదిమ నివాసుల జీవనపద్ధతులలోను అచ్చుగ్రుద్దినట్లు కనపడతాయి.

ఇండోనీసియన్ జాతీయుడు ఒక ప్రత్యేకవర్ణ విశిష్టతకలవాడు. ఆకారంలో, రంగులో, కాయసౌష్టవంలో ఆతడు ఏ యితర జాతికిని పోలడు. మనిషి ఆజానుబాహుడు కాకపోయినా, బలిష్ఠుడు. అంత సురూపి కాకపోయినా - బూడిదవర్ణంలో ఒక ప్రత్యేక ఆకారాన్ని రూపించుకొని వుంటాడు. అందువలననే మానవజాతి పుట్టినప్పుడే మలేసియాలోకూడా మానవుడు జన్మించినాడని, ఏ ఇతర ప్రదేశమునుండి ఇచటికి మానవుడు రాలేదని చెప్పు ఒక ప్రత్యేకవాదం వుంది.

లీ

చరిత్ర పరిశీలకులు చెప్పే వాదప్రతివాదముల యందలి సత్యాసత్యములమాట ఎట్లున్నప్పటికిని - 'మలేసియా' అనునది అతి ప్రాచీన దేశమని, అందలి ప్రజలు, మలేసియనులు ప్రాచీనచరిత్ర సంపన్నులనిమాత్రం అంగీకరించాలి.

అనాది ప్రసిద్ధమైన నేటి మలేసియా - అనగా ఇండోనీసియా - ప్రాక్తన చరిత్ర - నేటికిని, ఇకముందు తరములవారికిని ఒక విజ్ఞానభాండమని చెప్పకతప్పదు. అందుకే కాజోలు - ఇండోనీసియా, ఇండియాల పేరువింటే - చరిత్రపరిశోధకులు చెవికోసుకుంటారు.

ఈ ప్రాక్తన విజ్ఞానభాండాలు నేడు కాలగర్భంలో కలిసిపోయివున్నవి. మరి అవి కాలగతావశిష్టములే అవుతాయా? లేక ఏనాటికైనా విజ్ఞానపిపాసియగు ఆధునిక పురుషునికి ప్రత్యక్షమై, పులకింప జేస్తాయా?



# భారతదేశము : స్వర్ణద్వీపాలు

— ఈ రెండు దేశాలకు నడుమవుండిన సంబంధ బాంధవ్యాలు ఎంతప్రాచీనములైనవో వూహించుటకు అలవికాదు.

ఇండొనీసియా నుండియే మొదటి మానవుడు భారత దేశానికి అరుదెంచాడని ఇండొనీసియన్ చరిత్రకారులు తెల్పుతూ వున్నట్లే — భారతభూమినుండియే ప్రప్రథమముగా మానవులు ఇండొనీసియాకు వెళ్ళివున్నట్లు భారతదేశచరిత్ర దృష్ట్యా పరిశీలించి చూచినట్లయితే - పెక్కునిదర్శనాలు లభిస్తవి.

ఈరెండు దేశాల నడుమ పౌరాణిక యుగములనుండిన్ని పరస్పరమైత్రి విలసిల్లింది. —

ప్రాచ్యఖండంలోని పెక్కుదేశాలకు మనపురాణాలలో ప్రత్యేకనామాలు వున్నాయి. వాటిలో ఇవికొన్ని:—

'మలేషియా' అని 'మలయా ఆర్చిపిలగో' అని నేడు మన ంవ్యవహరిస్తూవున్న భూభాగమంతటిని మనపూర్వులు 'సువర్ణ ద్వీపం' అని పిలిచేవారు.

నేడు 'ఇండోచైనా' లో ఒకభాగమైవున్న 'కాంబోడియా' కు కాంభోజదేశమని, 'అన్నామ్' కు 'చంపా' దేశమని మనపౌరాణికనామాలు వుండినవి.

'బర్మా'కు సువర్ణద్వీపమని, బ్రహ్మభూమి అని, ఇంద్ర ద్వీపమని పేర్లుండేవి.

మలయా, సుమత్రా, జావా, మదుర, బోర్నియో, బలి ద్వీపాలకు 'సువర్ణద్వీపము' అనేది ఒక సాముదాయిక నామంగా వుండేది.

'జావాకు' యవద్వీపమని పేరు.

మలయాలోని 'కెడా'కు 'కతాహి' అని పేరు.

నికోబార్ ద్వీపావళికి - 'నారికేళ ద్వీపాల'ని పేరు.

'బోర్నియో'కు కర్పూరద్వీపమని పౌరాణిక నామం.

— ఈ దీవులన్నీ విడివిడిగా వుండినప్పటికీ - వీటికన్నిటికి సాముదాయకంగా 'స్వర్ణద్వీపాల'నీ, 'స్వర్ణభూముల'నీ ప్రాచీన భారతీలు నామకరణం చేశారు.

ఇదిగాక 'మలేషియా' అని నేడు మనం వ్యవహరిస్తూ వున్న ఈ పేరులోని 'మలయ' శబ్దాన్ని గురించి - కొంత సమీక్షించినట్లయితే - ఈ దీవులకు భారతభూమికి గల సంబంధాలు చిత్ర విచిత్రములైనవి కొన్ని లభిస్తాయి :— ఆయా వివరాలనుబట్టి ప్రాచీనకాలంలో ఈ రెండు దేశాలు విడదీయరాని బాంధవ్యం కలిగి వుండినట్లుకూడా ద్యోతకం అవుతుంది.

"మలయం" అనేది సంస్కృత శబ్దం. "మల" అనే ద్రావిడ శబ్దంనుండి ఇది గ్రహింపబడినట్లు 'బ్రౌన్' దొర చెబుతూ వున్నాడు. సంస్కృతంలో 'మలయం' అన్నా - ద్రావిడభాషలో 'మల' అన్నా 'కొండ' అని అర్థం. ఆర్యావర్తపు కుల పర్వతాలలో 'మలయ పర్వతం' ఒకటి. ఈ పర్వతం ప్రాధాన్యంగా ఆప్రదేశానికి 'మలయదేశము' - లేక 'మాలవదేశము' అని పేరువచ్చింది. ఆదేశంలో వుండే ప్రజలకు 'మాలవదేశీయులు' అనేది సాముదాయక నామం ఐవుంది.

ఈ మాలవదేశీయులు - పూర్వం భారతదేశమంతటా వ్యాపించి వుండేవారని పౌరాణిక, చారిత్రక నిదర్శనాలు వున్నాయి.

మహాభారతంలో - మాలవ జాతీయులు భారతదేశపు పశ్చిమ, ఉత్తర, దక్షిణ ప్రదేశాలలో వుండినట్లు కొంత ప్రశంస వుంది. రామాయణ, మత్స్య పురాణాలలో వారు 'తూర్పు' జాతీయులుగా పేర్కొనబడినారు.

అలెగ్జాండరు భారతదేశానికి వచ్చినప్పుడు 'మలయ దేశీయుల'ను - పంజాబులో కలుసుకున్నాడు. రాజపుటానాలో వారు స్థిరపడి వుండినట్లు చరిత్ర చెబుతూనేవుంది.

ఉత్తరహిందూదేశంలోని 'మాలవరాష్ట్రము' దక్షిణ హిందూదేశంలోని 'మళయాళరాష్ట్రము' (మలబారు) ఈ మలయ జాతీయులకు ప్రధానకేంద్రాలు.

'పాణిని' వ్యాకరణాన్నిబట్టి చూచినట్లయితే ఈ 'మలయ' జాతీయులు ఆయుధ జీవనులుగా విదితమవుతూవుంది. అంటే - పౌరుషజాతులు కనుక వీరు భారతదేశంనుండి బయలుదేరి ఇతర దేశాలకు విస్తరించుకున్నారని చెప్పబడుతూవుంది. ఇతరదేశాలకువెళ్ళి వారు ఆయాదేశాలలో పలుతావులకు 'మలయ' శబ్దసంబంధమైన పేరులను పెట్టారు. భారతదేశానికి పశ్చిమానవున్న 'మడగాస్కర్' మొదలు - తూర్పునవున్న ఫిలిప్పయిన్ దీవులవరకు వీరు విస్తరించుకొని వలసలను ఏర్పరచుకొన్నట్లు చరిత్ర రూఢిపరుస్తూవుంది.

మలయ ద్వీపంలో మలయ, మలకాలు నామాలు వుండడము, సుమత్రాదీవిలో 'మలయా' వుండడము, 'లాయెస్' దీవికి 'మాలా' లేక 'మాలవ' అనే మారుపేరు వుండడము, 'మొలూకా' నామంతో కొన్నిదీవులు వుండడము, పశ్చిమాన్ని 'మలయ దీవులు' (Maldives) వుండడము, ఆఫ్రికాతీరానవున్న మడగాస్కర్ దీవికి పూర్వం 'మలే' అనేపేరువుండడము, - మొదలైన 'మలయ' శబ్ద సంబంధాలను చూచినట్లయితే ప్రాచ్యఖండమంతటా ఒకనాడు ఈ 'మలయ' జాతి వ్యాపించివుండినట్లు సువిదితమవుతుంది.

ఇంతేగాక - భారతదేశంలోని మలయ పర్వతప్రదేశం మంచిగంధవృక్షాలకు ప్రసిద్ధిగన్నది. అందుచేత 'మలయజము' అనగా మంచిగంధపు చెట్టు అనికూడా పేరువచ్చింది. 'మలయం' మీది మంచిగంధపు వృక్షాల శ్రేష్ఠత్వాన్ని రూపించడానికి 'మలయ చందనం' అనేపేరు వచ్చింది. మలయచందనానికి 'మలాక' అనునది ఓమారుపేరు. మలయా జలసంధిలో నేడు 'మలాకా' పేరుతో ఓరాష్ట్రము, పట్టణము, జలసంధికూడా వున్నాయి. మన మలయ పర్వతానికి మలయా దేశంలోని ప్రదేశాలకు ఈ మలయశబ్ద తార తమ్యం గుర్తింప దగినదై వున్నది.

ఇంతేకాక - వస్త్రవిశేషానికి 'మలయజసిరి' అనేవస్త్రపు వర్ణనకూడా మనలోవుంది. ఇకస్త్రపు వర్గన ఇండోనియాలోని స్త్రీ, పురుషులు ధరిస్త్రానికి సరించే వపోతుంది.

మడగాస్కర్ దీవిలోని ఆదిమనివాసుల భాషలో 'సంస్కృత' శబ్దజాలం నేటికిని కనపడుతుంది. ఆ ఆదిమనివాసులలో "తమ పూర్వులు భారతదేశంలోని 'మంగళూరు' నుండి వచ్చారని" చెప్పే పౌరాణికగాధ ఒకటివుంది.

—ఈపైని చెప్పబడినవన్నీ 'మలయ' శబ్దంతో సంబంధం కలిగివున్నాయి. ఒకజాతి, ఒకదేశం, ఒకభాష పరంగా ఈ శబ్దం అన్వర్థమై వున్నట్లు విదిత మవుతూవుంది. దీనికి సరిగా నేడు 'మలేషియా'లో ప్రముఖజాతి 'మలయాజాతి' ప్రధానభాష; 'మలయా' భాష.

ఈవివరాలను, విశేషాలను బట్టిచూచినట్లయితే భారతదేశానికి చెందిన మాలవ - మలయ జాతీయులు ప్రాచ్యఖండంలోని వివిధ ప్రదేశాలనన్నిటిని భారతదేశపు వలసలుగా చేసివున్నారని ఆయాదేశాలకు నేడు భారతభూమికి చెందిన వారసత్వం వున్నదని ఋవపడుతూవుంది. -

ఇవిగాక — భారతదేశము నుండియే కొందరు ప్రజలు ప్రాచ్యదేశాలకు వలసవెళ్ళినారని చెప్పే మరియొక వాదంకూడా వుంది. —

భారతదేశంలోనికి ఉత్తరంనుండి 'ఆర్యులు' రాక పూర్వం ఇచట ద్రావిడ సంతతివారు వుండేవారని - వారికి, (అనగా అనార్యులు) ఆర్యులకు తరచు యుద్ధాలు జరుగుతూ వుండేవని - ఆయుద్ధాలలో ఆర్యులు ద్రావిడులను ఓడించి దక్షిణానికి తరిమివేస్తూవుండేవారని భారతదేశపు ప్రాచీనచరిత్ర చెబుతూవుంటుంది. -ఆర్యుల దాడికి ఆగలేక దాక్షిణాత్యుల భారతభూమిని వీడి సముద్రాలనుదాటి - ఈనాటి మలేసియాకు పారిపోయినారని - తదుపరి వారేఆస్వర్ణద్వీపసంచయమంతట వ్యాపించినారని - కూడా మరికొందరు చరిత్రకారులువ్రాస్తున్నారు. ఈవాదనకు బలంగ వారుఇంకొక హంశాన్నికూడా ఉదహరిస్తూ వున్నారు. ఈనాడు హిందూదేశపు

మధ్యభాగాలలోని కొండ జాతులగు అనాగరికుల భాషలకున్నూ మలయాదేశజుల భాషకున్నూ చాలాదగ్గిరసామ్యం వుండటంచేత - వారిసంతతివారే వీరైవుండవచ్చునని - వారుఅంటూవుంటున్నారు.

కాగా - ఇండోనీసియాకు మొట్టమొదటగా భారతీయులే వలసవెళ్ళివున్నారని- నేడచటి ప్రజలు ఒకనాటి భారతీయుల సంతతివారే అని ఒకవాదంవుండడం కాదనరానిది. —

కాని - ఇండోనీసియా చరిత్రపరిశోధకులు చెప్పేది ఇందుకు వ్యతిరేకముగా వుంటున్నది. ఇండోనీసియా నుండియే కొందరు ప్రజలు రాజ్యవిస్తరణాకాంక్షులై భారతభూమియందు ప్రవేశించివున్నారని - ఇండోనీసియా చరిత్రకారులు చెబుతూవున్నారు. —

ఇందు యేదినిజమైనదీ ఇదిమిద్ధమని నిర్ణయించడం కష్టం -

అసలు నిజానిజాలు ఎట్లున్నప్పటికినీ - భారతదేశానికి ఇండోనీసియాకు అతి ప్రాచీన కాలంనుండి సంబంధబాంధవ్యాలు వుండినవనునది చరిత్ర ఉద్ఘాటిచస్తూవున్నది సత్యం.

అందుచేతనే - మహోదాత్తమైన విజ్ఞానము, పరంపరాగతజ్ఞానము ఈ ఇరుదేశములమధ్య ద్యోతకమవుతూవుంటుంది.

ప్రకృతి సంపూర్ణంగా వికసించి, అనంత ముఖాల తన సౌరభాలను పరపిన ఈ స్వర్ణ ద్వీప సంచయం భారతభూమికి చెల్లెలు!!

భారతదేశము - ఇండోనీసియా - అక్కా-చెల్లెళ్ళు, అమరజీవులు!! —

# స్వర్ణద్వీపాలలో ఆంధ్ర శ్రీ

భారతీయులు స్వర్ణద్వీపాలలో తమ వలసరాజ్యాలను ఎప్పుడు స్థాపించుకొన నారంభించిరో తెలుపగల నిర్దుష్టమైన చారిత్రకాధారాలు ఏవియును నేడు కానరావటంలేదు.

ఇండోనీసియన్ ప్రజలు నేటికినీ చెప్పుకొంటూ వుండే కొన్ని కథలను, గాధలనుబట్టి - ఇండోనీసియాలో భారతీయుల వలసలు మహాభారతవీరులతోనే ప్రారంభమైనట్లు కనపడుతుంది. భారతభూమిలో పౌరాణికయుగం ప్రవర్తిల్లిన పవిత్రకాలంలోనే ఇండోనీసియాకు భారతావనికి సన్నిహితత్వం సమకూరింది. భారతీయులు, ఇండోనీసియనులు ఆనాడే పూవు - తావి రీతిగా మిళితమై పోయారు.

జావా చరిత్రలో 'హిందూమహాయుగం' ఒక అపూర్వ విశేషంగా, ఒక విజ్ఞానజ్యోతిగా చెన్నొందుతున్నది. క్రీస్తుశకానికి పూర్వపుచరిత్ర ఇండోనీసియా పరంగా ఈనాడు మనకంతగా తెలియదు. కాని, క్రీస్తుశకారంభంతోనే -భారతీయులు ఇండోనీసియాలో తమవలసలను స్థాపించుకొనడం ఆరంభించినట్లు- అదిన్నీ క్రీస్తువెనుక 140 సంవత్సర ప్రాంతంలో ప్రారంభమైనట్లు తెలియజేసే ఉదంతాలు కొన్ని వున్నట్లు చరిత్ర పరిశీలకులు చెబుతూ వున్నారు.

ఒక చారిత్రకోదంతం ఈవిధంగా చెబుతూవుంది. —

" కళింగచక్రవర్తి 20,000 కుటుంబాలను ఈ స్వర్ణద్వీపాలకు వలస పంపించాడు. వారేఅచట స్థావరాల్ని" నెలకొల్పుకొని వృద్ధిలోనికి వచ్చారు. ఇదిక్రీస్తు వెనక రెండవశతాబ్దంలో అనగా 120 సంవత్సరంలో జరిగివున్నది.

క్రీస్తు వెనుక 132 సంవత్సరంలో జావారాజుఅయిన దేవవర్మ ఒకదూతను చైనాకు పంపించాడు. తన దౌత్యాన్ని గురించి చెబుతూ జావాలో నెలకొనివున్నవారు 'కళింగదేశస్థులు' గా ఆ దూత వర్ణించాడు. ఇది జావాచరిత్ర పేర్కొనేవిషయం. - కాగా పై చారిత్రక ఉదంతాన్ని జావాచరిత్రకూడా బలపరుస్తూవుంది.

ఈ రెండు హంశాలుమాత్రమే గాక - చైనా చరిత్రను బట్టిన్నీ చైనానుండి ఇతర దేశాలకు నాడు వెళ్ళుతూవుండిన యాత్రికులు వ్రాసినవాటిని బట్టిన్నీ "ఇండొనీసియాలో అప్పుడు వుండినవారు 'కళింగులు' అని వివరించే మరికొన్ని వృంత్తాంతాలు కూడా లేకపోలేదు.

దీనిని యదార్థంగాను, చారిత్రక సత్యంగానూ స్వీకరించినట్లయితే - స్వర్ణద్వీపాలకు మొట్టమొదటగా వలసవెళ్ళినవారు - ప్రాచీనాంధ్ర సంతతివారని ధృవపడుతూవుంది.

నిజానికి చరిత్రను సమీక్షించి చూచినట్లయితే - ఇందు అతిశయోక్తిగాని అయదార్థంగాని, గోచరించదు.

క్రీస్తు శకారంభంలో భారతదేశమందు ఆంధ్రుల చరిత్ర మహోజ్వలమై ఒప్పారింది. నౌకా వాణిజ్య వైభవములో, నాగరికతలో, కళాపోషణలో, విజ్ఞానశోభలో ఆంధ్రచరిత్ర భారతదేశమందు నాడు స్వర్ణయుగముగా విరాజిల్లినది.

ఆనాటి ఆంధ్రుల వాణిజ్య చరిత్ర ఒక మహాపర్వం వలెవెలుగొందింది. కళింగపట్నం మొదలు పులికోటవరకు విస్తరించివున్న విశాల ప్రాక్సముద్రం వారి నౌకా విహారాలకు ఒక సరస్సువలె వుండేది. కృష్ణా గోదావరినదీ ముఖద్వారాలనుండి క్రీస్తువెనుక 140 సంవత్సరంనాటికే తెలుగువారి వాణిజ్య నౌకలు అటు గంగానదివరకు, ఇటు సింహళము, సుమిత్రా, జావా దీవులవరకు స్వేచ్ఛగా ప్రయాణాలు చేసి వున్నట్లు చారిత్రకులు వ్రాస్తూవు

'తైలాంగులు' ఆదిలో మన తెలుగు దేశమునుండి వెడలినవారే. మలయద్వీప చరిత్రలో తరుచు ఆమ్రేడితమయ్యే 'క్లింగ్' పదానికి మన కళింగదేశంతో అవినాభావసంబంధ మున్నది.

బర్మాదేశంలో ఒకభాగానికి 'రమణ' అనే పేరు ఉంచి మనవారు వ్యవహరించినట్లు తెలుగుసారస్వతంలో కొన్ని నిదర్శనాలు ఉన్నాయి. సుమిత్రాద్వీపంలోని 'వజ్జార్' రేవు మన శ్రీనాధుని కాలమున 'పంజార్'గా మనకు పరిచితమై, మనం కర్పూరం తెచ్చుకొనే స్థానమై ఉండేది. బోర్నియోద్వీపములోని 'పంజార్ మాసేక్' నుంచి మనకు ఆదిలో 'పంపరపనస' లేక 'పంపరమాసి' అనే కాయలుకాసేచెట్లు వచ్చాయి. జావాద్వీపపు రాజధానీ నగరమైన 'బటేవియా' నుండి మనకు ఆదిలో బత్తాయిపళ్ల చెట్లు వచ్చాయి. బటేవియానుండి వచ్చినవి కనుకనే వాటికి, 'బత్తాయి నారింజలు' అనేపేరువచ్చింది. బర్మాలో 'టెరినా సెరిమ్' అనే ప్రదేశం మన గ్రంథాలలో 'తరుణాసిరి'గా పేర్కొనబడింది. అదే క్రమంగా 'ధనాసరి' అయింది. మన గోంగూర చెట్లలో ఒకటైన 'ధనాసరి గోంగూర' ఆదిలో 'తరుణాసిరి' నుండే వచ్చినదే. సంగీతానికి చక్కగా ఒదిగే మన భాషలో పెక్కు రాగాలు దేశ నామాలుగా ఉన్నాయి కాబట్టి 'ధన్యాసి' అనే రాగంపేరు 'తరుణాసిరి' పదవికారం కావచ్చునని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలవారు అంటూ ఉన్నారు.

బర్మా, స్వర్ణద్వీపాలలో మాత్రమే గాదు - ఆంధ్రుల కళావిజ్ఞానాలు ఆనాడు ఇండోచైనా, ఫార్మోజాలలోకూడా విహరించివున్నాయని చెప్పడానికి ఇటీవల మరికొన్ని నిదర్శనాలు లభించాయి. ఇండోచైనాలో 1936 సంవత్సరం నుండి జరుగుతూవున్న భూగర్భ పరిశోధనల ఫలితంగా - కాంబోడియా, లువాన్, కెవర్నియా మొదలైన పట్టణాలవద్ద లభించిన బంగారు, రాగి, నాణెములు, ఉంగరాలు, గాజులు, చెవిపోగులు, ముక్కుబులాకులు

మొదలైన శృంగార వస్తువులమీది నగిషీపని, శైలి మొదలైనవన్నీ తెల్గువారి సాంప్రదాయాలను పోలివున్నవి. కాంబోడియాలోని పురాతన కట్టడాలపైనున్న శిల్పం మన నాగార్జునకొండలోని శిల్పాన్ని పోలివుంది. వీటినన్నిటిని ఇంకా పరిశోధించినట్లయితే ప్రాచీనాంధ్రులకు ప్రాచ్యదీవుల ప్రజలకుగల మైత్రి విశద మవుతుంది.

ఇన్ని విధాలుగా ఆంధ్రులు ప్రాచ్య ఖండములో ప్రవర్తిల్లి విశేషమైన సంబంధ బాంధవ్యాలను కలుపుకొన్నారు.

ఇండోనీసియాకు ఆంధ్రులు ఆదిలో చూపిన మార్గమే ఇతరులకు రాచబాట అయింది. మొదట ఆంధ్రులు నిర్మించిన విజ్ఞాన పీఠంపైననే ఇతరులు దివ్య హర్మ్యాలను నిర్మించారు. ఆంధ్రులు ప్రప్రథమంగా సృష్టించిన విపణివీధిలోనే ఇతరులు ధన కనక వస్తు వాహనాలను ఆర్జించుకొన్నారు. ఆంధ్రులు చూపిన మార్గము ఒక భారతీయ జాతులకేకాక - అరేబియా తురుష్క జాతులకు, తదుపరి ఐరోపా క్రైస్తవ జాతులకుకూడ దివ్య మార్గమైనది.

ఆంధ్రజాతి ఇండోనీసియన్ జాతికి విజ్ఞాన సౌరభాన్ని ప్రసాదించింది. ఇండోనీసియానుండి సుగంధ ద్రవ్యాల్ని తెచ్చుకొన్నది. అసలు స్వర్ణద్వీపాలకు 'సుగంధ ద్వీపాలు' అని నామకరణం చేసినవారుకూడా ఆనాటి ఆంధ్రులే!

పసిపాపకు - తల్లికి ఎట్టి పవిత్ర సంబంధ మున్నదో ఆంధ్ర జాతికి ఇండోనీసియాకు ఆదిలో అట్టి పవిత్ర బాంధవ్య మున్నది. ఇండోనీసియాలో ఆంధ్రులు ఆనాడు మీటిన విజ్ఞాన విపంచి అనంతకాల గర్భాన అమరంగా ఆలాపిస్తూనే వున్నది.



# శ్రీ విజయసామ్రాజ్యం

భారతీయ సామ్రాజ్యాలు మహోచ్ఛ దశలోనుండిన కాలమది. మహా సామ్రాజ్యాలను ఏలుతూ శక్తి సంపన్నులు, ఐశ్వర్యవంతులు, విజ్ఞానఖనులు అయినా ఆయా భారతీయ సామ్రాజ్యాధిపతులు తమతమ, సామ్రాజ్య విస్తరణలకు, వాణిజ్యవ్యాప్తికి పరదేశాలకు తరుచు ప్రయాణాలు చేస్తూవుండేవారు. పరదేశాలను ఆక్రమించవలెననే ఉద్దేశ్యం వారి కానాడు వుండినట్లు కనపడదు గాని - ఆయాదేశాలలో భారతీయులు తమ వాణిజ్య కేంద్రాలను మాత్రం బాగుగా నిర్మించుకొంటూ వుండేవారు. భారతదేశం ఆనాడు ఒక బలీయమైన వాణిజ్య కేంద్రమై విలసిల్లింది. ఆవాణిజ్య ప్రశస్తిలో ఆంధ్రులు, అనగా, శాతకర్ణులు ప్రముఖపాత్రను వహించారు.

ఇండోనేసియాలో - సుమిత్రా, జావా, బోర్నియో, బలి, సెలిబస్ ద్వీపులందు ఆంధ్రులు మొట్టమొదటగా ప్రధానమైన వాణిజ్య కేంద్రాలను నెలకొల్పుకొని - హిందూమతవ్యాప్తికి బాగా పాటుపడ్డారు - అచట స్థిరనివాసులై, రాజ్యాధికారులై విలసిల్లారు.

ప్రసిద్ధ చైనాయాత్రికుడు ఫాహియాన్ భారతదేశం నుండి తిరిగి స్వదేశం వెడలిపోతూ పశ్చిమ జావాలో క్రీ॥ శ॥ 414 సంలో కొంచెం సంచారంచేసి-అచటి విశేషాలనుకూడా తన యాత్రా చరిత్రలో పేర్కొన్నాడు. అతడు వ్రాసినదానినిబట్టి - అప్పటికి జావాలో 'బ్రాహ్మణులు' ఉన్నట్లుగాను, 'హైందవమతం' వున్నట్లుగాను తెలుస్తూవుంది. అంటే - దీనివలన స్వర్ణద్వీపాలలో ఐదవశతాబ్ది ఆరంభంవరకు హిందూమతమే ప్రధానంగా వుండిన

దని చెప్పుకోవచ్చు. కాని - అప్పటి కప్పుడే భారతదేశంలో మాత్రం బౌద్ధమతం విశేష వ్యాప్తిలోవుంది. భారతదేశానికి స్వర్ణ దీవులకు వర్తకవ్యాపారాలు సాగుతూ వుండినవ్పటికిని - భారత దేశంలో ప్రబలంగా వుండిన బౌద్ధమతం ఈ దీవులకు ఐదవశతాబ్ది మొదటిపాదంలోకాని వ్యాపించలేదు.

కాశ్మీరరాజు అయిన 'గుణవర్మ' బౌద్ధమతాన్ని స్వర్ణ ద్వీపాలకు ప్రప్రథమంలో కొనితెచ్చాడు. గుణవర్మ - బౌద్ధ మతాన్ని స్వీకరించి - దానికి పూర్తిగా సేవచేయాలనే సంకల్పంతో తన సింహాసనాన్నికూడా పరిత్యజించాడు. బౌద్ధభిక్షువై అతడు దేశ దేశాలలో సంచారం చేశాడు. నాల్గవశతాబ్ది చివరిదశలో ఇతడు సుమిత్రా, జావా ద్వీపాలకు ఆగమించి అచట బౌద్ధమత ప్రచారం చేశాడు. ఆ ప్రచారంతో అతనికి స్వర్ణద్వీప సంచయమంతటా బ్రహ్మాండమైన ప్రఖ్యాతి కలిగింది. ఈ ప్రఖ్యాతికి అకర్షితుడైన నాటి చైనాచక్రవర్తి గుణవర్మను తన దేశానికి ఆహ్వానించి - బౌద్ధ మతాన్ని స్వీకరించాడు.

గుణవర్మ ప్రచారం ప్రారంభమైనదాదిగా మహా యాన బౌద్ధభిక్షువులు, మత ప్రచారకులు భారతభూమినుండి తరు చుగా జావా, సుమిత్రా దీవులకు పయనిస్తూ బౌద్ధమతాన్ని అచట సుస్థిరం చేశారు. - హిందూమతము, బౌద్ధమతము ఈదీవులలో పోటాపోటీలు పడ్డవి. ఈ రెండుమతాలను అభిమానించే రాజు లున్నూ బయలుదేరారు. సంఘర్షణలు జరుగుతూ వుండినప్పటికిని రెండుమతాలు ఒకదానివెంట వేరొకటి ఈ దీవులలో అభివృద్ధి చెందుతూ వచ్చాయి. —

హిందూమతము, బౌద్ధమతము ప్రత్యేకంగా వర్ధిల్లుతూ వచ్చినవి కాని - చివరకు, ఏడవశతాబ్దం ఆరంభంలో బౌద్ధ మతమే విశేష ప్రాబల్యాన్ని ఆర్జించింది. బౌద్ధమతం అంతవరకు సుమిత్రా దీవిలోను, మలయా ద్వీపకల్పంలోను మిక్కిలి ప్రాధా

న్యతను పొందివుంది. బౌద్ధమతం ఇంతటి ప్రాముఖ్యాన్ని పొంది వుండడానికి - మలయాను పాలిస్తూవుండిన 'శైలేంద్రు'లే ముఖ్య కారణం. మలయాలో తమ అధికారాన్ని బాగా బలపరచుకొని వారు క్రీ॥ శ॥ 782 సంవత్సరంలో జావాపై దండెత్తి - అచట గల చిన్న చిన్న రాజుల నందరిని ఓడించి తమ రాజ్యాధికారాన్ని నెలకొల్పుకొన్నారు.

జావా, సుమిత్రా మొదలైన దీవులలో చెదురుగా వ్యాపించివున్న చిన్నరాజు లందరిమధ్య ఐకమత్యాన్ని కలిగించడానికి, తద్వారా ఆదీవుల ఐశ్వర్యాన్ని పెంపొందింపజేయటానికి శైలేంద్రులకు బౌద్ధమతప్రచారం మిక్కిలి ఉపయోగించింది. ఇదే సమయంలో - భారతదేశంలోని 'కంచి' పురవాసి 'ధర్మపాలుడు' ఈ దీవులకువచ్చి బౌద్ధమత ప్రచారాన్ని విశేషంగా సాగించాడు. ఇతడు దక్షిణ భారతంలో ప్రసిద్ధిచెందిన బౌద్ధభిక్షువు. నలందా, వజ్రబోధి విశ్వవిద్యాలయాలలో ఆచార్యుడుగా పనిచేశాడు. చైనాలోకూడా ఇతడు పర్యటనంచేసి అచట 'తాంత్రిక విద్యను' వ్యాప్తమొనర్చినట్లుగా చైనా చరిత్ర చెబుతూవుంది.

శైలేంద్రులు - బౌద్ధమత ప్రచారంద్వారా, సైనికశక్తి ప్రాబల్యాలద్వారా - స్వర్ణద్వీపాలు అన్నిటిలోను ఐకమత్యాన్ని నెలకొల్పి - అందరిని ఒకే ఒక సామ్రాజ్యాధికారం క్రిందకు కొని తెచ్చారు - హిందూ, బౌద్ధమతాలు చక్కగా ఐక్యమైన ఒక నూతన మతస్వరూపం అచట రూపొందింది. అట్టి సుస్వరూప మత విజ్ఞానాల వాతావరణంలో - ఒక మహాసామ్రాజ్యం ఉద్భవించింది... అదే శ్రీవిజయసామ్రాజ్యం.

ఇండోనేసియా చరిత్రలో 'శ్రీ విజయసామ్రాజ్యం' నిర్వహించినపాత్ర మహోజ్వలమైనది. ఏడవశతాబ్దం మొదలుకొని పదునాల్గవ శతాబ్దం ఆఖరువరకు 'శ్రీవిజయ' సామ్రాజ్యం అచట

చేదీప్యమానంగా వెలిగిపోయింది. 'శ్రీవిజయ' సామ్రాజ్యం స్వర్ణ ద్వీపాలలో ప్రభవించి, పుష్పించి, వికసించి వున్నదికనుకనే - స్వర్ణద్వీప సంచయానికి ఒక మహోజ్వల ప్రాచీన చరిత్ర ప్రాప్తించింది; ఆచరిత్ర అపారమైన, అపూర్వమైన కళావిజ్ఞాన, వికాసాలను ఈనాటికిని గుభాళిస్తున్నవి.—

ఇండొనీసియా పూర్వచరిత్రలో - శ్రీవిజయసామ్రాజ్యం రచించిన అధ్యాయం - ఒక మహత్తరోదంతం.— సుమారు పది శతాబ్దములకాలం ఆసామ్రాజ్యం అచట అజేయంగా రాజ్యం చేసింది. తూర్పు ఇండియా దీవులనన్నిటికి ఒక అధికారం క్రిందకు కొనివచ్చి, ప్రజల నందరను ఒకే ఒకమత, విజ్ఞానపథగాములను చేసింది ఆసామ్రాజ్యం.—

శ్రీ విజయసామ్రాజ్యం ఆదిలో ఒక్క సుమత్రాదీవిలో మాత్రమే వ్యాపించింది.— సుమారు మూడవశతాబ్దం చివరి దశలో ఈసామ్రాజ్యం ఈదీవిలో అంతరించినా - ఇంచుమించు ఐదు, ఆరు శతాబ్దాలనాటికికాని అది స్వర్ణద్వీపాలు అన్నిటియందు విస్తరించలేకపోయింది.—దీనికి ముఖ్యకారణం 'మతం'.—

ఇండొనీసియాయందు అంతటా అప్పటికి హిందూమతం బాగా వ్యాపించి మహోన్నతస్థితిలోవుంది. కాని బౌద్ధమతాన్ని వరించిన శ్రీ విజయసామ్రాజ్యం హిందూమతాన్ని ధిక్కరించి, విజయాన్ని చూరగొనలేకపోయింది. అయితే - నౌకాబలంలోను, వాణిజ్య వ్యాపారాలలోను మీనుమిగిలిన శ్రీవిజయసామ్రాజ్యం కొన్నాళ్ళకు తన ఈప్సితాన్ని ఈడేర్చుకొనగలిగింది.

శ్రీ విజయసామ్రాజ్య రాజధానీ నగరమైన 'శ్రీవిజయ' (నేటి పాలెంబాంగ్ నగరం) దక్షిణ సుమత్రాదీవిలో ఒక ప్రబలమైన వర్తక కేంద్రమై వుండేది. దానికితోడు అచట బౌద్ధమతపీఠం కూడా నెలకొన్నది. భారతీయ బౌద్ధభిక్షువులు అచటచేరి బౌద్ధ ధర్మ ప్రచారకులను తయారుచేస్తూ - ఇతరతావులకు మతప్రచారా

నికి పంపుతూ వుండేవారు. వీరి అవిరామపు కృషిఫలితంగా - మూడు శతాబ్దాల వ్యవధిలో - 'హిందూ - ఇండోనేసియా'లో విశేష భాగం 'బౌద్ధ - ఇండోనేసియా'గా మారిపోయింది.—

శ్రీ విజయసామ్రాజ్య చక్రవర్తులు మత విస్తరణోద్యమంలో కూడా ఒక వినూత్నమైన మార్గాన్ని అనుసరించారు. 'బౌద్ధమత విస్తరణ' వారి ప్రధాన లక్ష్యమైనప్పటికీ - దానిని వారు మూర్ఖంగా ప్రజలపై రుద్దలేదు. హిందూమతాన్ని చెంగనాడక, ఆదినుండి వున్న ఇండోనేసియన్ ఆచారవ్యవహారాలను కొంచెపరచక ఈ మూడింటిని మిళితంచేసి - ఒక అపూర్వమైన మత విజ్ఞానాన్ని వారు అచట రూపొందించారు.

అఖండమైన సైనిక, నౌకాబలాల్ని అండగా బెట్టుకొని వాణిజ్య కీలకాన్ని చేతపట్టుకొని, మతసామరస్యాన్ని మంత్రదండంగా వినియోగించుకొని వారు వ్యవహరించారు. అందుచేతనే - ఇండోనేసియా యందు చెదురు చెదురుగా వున్న రాజుల నందరను అచిరకాలంలో వారు జయించి శ్రీ విజయసామ్రాజ్య పతాకాన్ని ఎగురవేయగలిగారు.

ఎనిమిదవ శతాబ్దంనాటికి శ్రీవిజయ సామ్రాజ్యం ఎనిమిది దిక్కులా వ్యాపించిపోయింది.— సుమత్రానుండి - ఇటు తూర్పుగా జావాలో అర్ధభాగము, బోర్నియో, సెలిబస్, ఫిలిప్ప యినులు, ఫార్మోజాదీవిలో అర్ధభాగమువరకు శ్రీ విజయసామ్రాజ్యం వ్యాపించింది. అటు ఉత్తరాన మలయా, సయాం, ఇండోచైనా, చైనాలో 'కాంటన్' నగరానికి దక్షిణభాగము - శ్రీ విజయ సామ్రాజ్య భాగములైనవి. ఇటు పశ్చిమదిశలో శ్రీవిజయసామ్రాజ్య నౌకా బలగం వీరవిహారంచేసి, సింహళంపై రెండుపర్యాయములు దండయాత్రచేసి దానిని ఆక్రమించుకొన్నది. పిమ్మట భారతదేశపు దక్షిణభాగమునుకూడా శ్రీ విజయసామ్రాజ్యం లోబరచుకొన్నది. అనగా ఇటు సింహళం మొదలుకొని అటు ఫార్మోజావరకు

వ్యాపించి శ్రీ విజయసామ్రాజ్యం సుమారు పది శతాబ్దములపాటు - మారులేని ప్రాబల్యాన్ని చెలాయించుకొన్నది. —

సామ్రాజ్య విస్తరణలోనేగాక, రాజకీయంగాకూడా శ్రీ విజయసామ్రాజ్యం ఆదీవులకు అమోఘమైన సేవచేసింది. — 'మనుధర్మశాస్త్రా'న్ని ప్రామాణ్యంగా పెట్టుకొని, రాజకీయ, సాంఘిక వ్యవస్థలను ఆదీవులన్నిటిలోను శ్రీ విజయసామ్రాజ్య చక్రవర్తులు రూపొందించారు. —

ప్రజారాజ్యతంత్రాన్ని, ప్రజాపరిపాలనా విధానాన్ని శ్రీవిజయ సామ్రాజ్యాధిపతులు మనుసిద్ధాంతంనుండియే గ్రహించారు. రాజకీయ పరిపాలనా నిర్వహణకు వారు ముఖ్యంగా మూడు సూత్రాలను చేకొన్నారు. (1) కామందక; అనగా - రాజుపాలించవలసిన ధర్మాలను గురించి వివరించేశాస్త్రం. (2) ఇంద్రలోక; అనగా - రాజ్యాంగనీతిని వివరించేశాస్త్రం. (3) నీతిప్రియ; అనగా - శత్రువుయెడల రాజు అవలంభించవలసిన విధానాలను వివరించే శాస్త్రం, ఈ మూడింటిని శ్రీవిజయసామ్రాజ్య చక్రవర్తులు తమ దేశపరిపాలనా వ్యవస్థకు అనుగుణంగా మార్చుకొని అవలంబించారు.

దేశపరిపాలన అంతా భారతీయ పంచాయితీ పరిపాలనా పద్ధతిని పోలివుండునట్లుగా వారు మార్చివేశారు....

మనుధర్మశాస్త్రంలోని సిద్ధాంతాలను శ్రీవిజయసామ్రాజ్య చక్రవర్తులు ప్రాచ్యఖండ మంతటా సంస్థాపించారు.— ఈ సందర్భంలో పండిత జవహర్‌లాల్ నెహ్రు వ్రాసిన 'జగత్కథ'అనే గ్రంథంలోని ఒకభాగాన్ని ఇచట ఉదహరించడం ఉచితమైవుంది:

"...సుమత్రాలో ప్రారంభమైన శ్రీ విజయసామ్రాజ్యమనే రాజ్యంలో ఫార్మోజా, ఫిలిప్పయిన్ దీవులుకూడా భాగాలైవుండినవి... ఫిలిప్పయిన్ శిల్పంలో, విజ్ఞానంలో, జీవితవిధానంలో నేటికిన్ని హైందవ ముద్ర వున్నది... ఫిలిప్పయిన్ రాజధానీనగర

మైన 'మనిలా' పట్టణంలో కొత్తగాకట్టిన శాసనసభలో నాలుగు విగ్రహాలు ప్రతిష్ఠింపబడినవి. ఆ నాల్గువిగ్రహాలూ ఫిలిప్పయిన్ విజ్ఞానానికి మూలవిటులుగా చెప్పబడుతూ వున్నాయి. ఆవిగ్రహాలలో ఒకటి 'మనువు' విగ్రహం, 'మనుధర్మశాస్త్రము'ను రచించిన మన మనువు విగ్రహమది... అంటే మనుధర్మశాస్త్రం ఫిలిప్పయిను ప్రజల జీవితవిధానాన్ని దిద్దుతూ వున్నదన్నమాట! మిగిలిన మూడు విగ్రహాలలో ఒకటి చైనా వేదాంతిది. తక్కిన రెండూ ఇంగ్లీషు, స్పానిష్ మహనీయులవీని..."

ఫిలిప్పయినులలో నేడు పాశ్చాత్యజాతులు పరిపాలన చేస్తూ వున్నప్పటికీ - అచటి శాసనసభను మన 'మనువు' విగ్రహం అలంకరించివున్నదంటే - పూర్వకాలంలో - శ్రీవిజయసామ్రాజ్యం ఆగ్నేయ ప్రాచ్యఖండానికి సాంఘిక, రాజకీయ వృత్తాలలో చేసిన సేవ ఎట్టిదో స్పష్టమవుతుంది!

శ్రీ విజయసామ్రాజ్యం ఒక్క సామ్రాజ్య విధానంలో నేగాక - విద్య, విజ్ఞానాలకుకూడా ఒక దివ్యపీఠమై వెలుగొందింది.- చైనానుండి భారతదేశానికి వస్తూ చైనా యాత్రికులు 'శ్రీవిజయ' నగరంలో ఏండ్ల తరబడిగా నిలువ వుండిపోయేవారు. 'శ్రీవిజయ' నగరమువంటి బౌద్ధమత కేంద్రాలలో వుంటూ బౌద్ధధర్మ విజ్ఞానాన్ని ఆర్జించేవారు. అందు పరిపూర్ణులైన పిదప తమమత జన్మస్థానమైన భారతభూమిలో 'బుద్ధగయ' 'మహాబోధి' మొదలైన పుణ్యక్షేత్రాలను దర్శించడానికి వెడలిపోతూ వుండేవారు.

స్వర్ణద్వీపాలలోనేగాక, శ్రీ విజయసామ్రాజ్య చక్రవర్తులు భారతదేశంలోకూడా, విశేషమైన కీర్తి ప్రతిష్టలను ఆర్జించారు. 'నలందా'లోని బౌద్ధ విశ్వవిద్యాలయంలో 'శ్రీ విజయ మందిరం' అను పేరతో ఒక ప్రత్యేక ఆరామం వుండేది. ఆమందిరానికి చెందిన విద్యార్థుల పోషణకు, విద్యాభ్యాసానికి అగు వ్యయాన్ని భరించడానికి - నేటి బీహారు రాష్ట్రానికి చెందిన కొన్ని గ్రామాలనుండి వచ్చు ఆదాయం ప్రత్యేకింపబడుతూ వుండేది.

బౌద్ధమతానికి శ్రీ విజయసామ్రాజ్యం చేసిన అఖండమైన సేవకు గుర్తుగా నలందా విశ్వవిద్యాలయంలో శ్రీ విజయ మందిరం నెలకొల్పబడింది. 'గయి' పట్టణ సమీపంలో ఇటీవల దొరికిన కొన్ని శాసనాల ద్వారా ఈ విషయం తెలుస్తూవుంది.

ఇంతేకాదు - శ్రీ విజయసామ్రాజ్యం ప్రసిద్ధులైన బౌద్ధ మతాచార్యులనుకూడా సృష్టించింది. 'టిబెట్' దేశాన్ని బౌద్ధ మతంలోనికి మార్చివేసిన ప్రఖ్యాత బౌద్ధమతాచార్యుడు 'అటిసా' శ్రీ విజయ సామ్రాజ్య ప్రదానమే... సుమత్రాదీవిలో అతడు విజ్ఞాననిధి అయినాడు.

శిల్పము, చిత్రలేఖనము, మొదలైన కళలనుకూడా శ్రీ విజయసామ్రాజ్య ప్రభువులు బ్రహ్మాండంగా పెంపొందించారు. భారతదేశంనుండి విద్యావేత్తలను, ఆచార్యులను, చిత్రకారులను, శిల్పకారులను పిలిపించి వారి తోడ్పాటుతో స్వర్ణద్వీపాలయందు అనేక కళా ఖండాలను సృష్టింపజేశారు.

జావా దీవిలోని 'బోరోబుదూర్' పట్టణంలో బౌద్ధులు నిర్మించిన బౌద్ధ దేవాలయంపై నున్న చెక్కడాలను పరిశీలించినట్లయితే - సంస్కృతంలో రచింపబడివున్న గౌతమబుద్ధుని చరిత్రమంతా చిత్రరూపాన అనువదించినట్లు కనపడుతుంది. ఆ దేవాలయంలోని అంతస్థులన్ని బౌద్ధమతగాథలకు సంబంధించిన చిత్రాలతోనే నిండివుంటాయి. ఈ చెక్కడాలన్నిటిని - అనగా - ఆ చిత్రాలనన్నిటిని ఒకదానిప్రక్క మరియొకదానిని వుంచి, పేర్చితే సుమారు మూడు మైళ్ళవరకు అవి వ్యాపిస్తాయి. 'జాతక కథలు' అనగా గౌతమబుద్ధుని పూర్వ జీవితానికి సంబంధించిన గాథలన్నీ ఆ 'బోరోబుదూర్' దేవాలయ కుడ్యాలమీద చిత్రింపబడి వున్నాయి. వాటిని జాగ్రత్తగా పరిశీలించి చూచినట్లయితే ఆనాటి శిల్పకారులు ఏ యే సంస్కృత గ్రంథాలను అనుసరించి ఆ చిత్రాలను రచించారో బాగా బోధపడుతుంది.

'బోరోబుదూర్' నగరములోవలెనే 'చాందీకలాసాన్' పట్టణంలోకూడా ఇట్టి శిల్ప, చిత్రాలుగల ఆలయాలు విశేషంగా వున్నాయి.— స్వర్ణద్వీపాలలో పెక్కుచోట్ల బౌద్ధదేవాలయాలు ఆరామాలు, విహారాలు, చైత్యాలు ఆనాడు వెలిశాయి.—

శ్రీ విజయ సామ్రాజ్య చక్రవర్తులు మత విజ్ఞానాల దృష్ట్యా ఇండోనీసియన్ ప్రజానీకానికి నాడు కలిగించిన వికాసం అపారము, అనంతమూ అయినది. వారిపోషణలో, ప్రోత్సాహంలో ఇండోనీసియనులు మహోన్నతమైన విజ్ఞానాన్ని ఆర్జించారు. తమ తమ భాషలోనికి పెక్కు సంస్కృత, పాళీ గ్రంథాలను అనువదించు కొన్నారు. మహాభారతము, రామాయణము, రఘువంశము మొదలైన సంస్కృత గ్రంథాలనన్నిటిని కొంతకొంత తగ్గించి తమభాష లోనికి వారు అనువదించుకొన్నారు. మహాకవి కాళిదాసుని రచనలన్నీ పూర్వ ఇండోనీసియన్ సాహిత్యంలో అనుకృతులుగా వెలిశాయి.

నృత్య, చిత్రకళా వృత్తాలలోకూడా ఇండోనీసియనులు విశేషమైన ప్రజ్ఞా ప్రాభవాలు ఆర్జించారు. 'భరతనాట్యం' వారికి అభిమాన విద్య అయింది.—

ఇవిగాక హిందూ గణిత, జ్యోతిష శాస్త్రాలుకూడా ఇండోనీసియనులను బాగా ఆకర్షించాయి. హిందువుల మాస, వార, తిథి, నక్షత్రమానాలను వారు ఆచరణలో పెట్టుకున్నారు. అడుగులు, గజాలు మొదలైనవాటినికూడా వారు అనుకరించారు. ఇంతేగాక భారతదేశంలోని ప్రముఖ స్థలాల పేర్లనుకూడా వారు తమదేశంలోని ప్రసిద్ధ ప్రదేశాలకు పెట్టుకున్నారు. అట్టివాటిలో గోమతి, చంద్రభాగ, జయనగర, కర్నాటక - మొదలైన పదాలు నేటికిని అచట వాడుకలో వున్నాయి. సంస్కృత, నాగరలిపులను వారు స్వీకరించారు. ప్రముఖ గ్రంథాలన్నీ స్వచ్ఛమైన సంస్కృత భాషలోనే వున్నాయి.

ప్రసిద్ధ పాశ్చాత్య చరిత్ర పరిశోధకుడు జె. యస్. ఫర్నివాల్ వ్రాసిన 'నెదర్లాండ్స్ - ఇండియా' అనే గ్రంథంలో-ఇండోనీసియా ప్రాచీన చరిత్రను, అందు శ్రీ విజయ సామ్రాజ్యం నిర్వహించిన పాత్రను గురించి వ్రాస్తూ "హిందూమహాయుగ ప్రభావం లేకపోయి వుండినట్లయితే - ఇండోనీసియా ఈనాడు ప్రపంచ చరిత్రలో పేర్కొనదగినదిగా వుండదు" అని శ్లాఘించాడు. "ఇండియన్ ఇండోనీసియన్ ఆర్టు" అను గ్రంథంలో డా. వి. కె. కుమారస్వామి, భారతీయుల విజ్ఞానాల ప్రభావం ఇండోనీసియాపై ఎంత గాఢంగా ముద్రవేసినదో వివరిస్తూ :- "ఇండియా కళా విభూతులు అసలు; ఇండోనీసియా నకలు... ఇండియాకు ఇండోనీసియా కీనీడ" అని అతడు వేనోళ్ళ నుతించాడు.

శ్రీ విజయ సామ్రాజ్యం శత, సహస్ర విధాలుగా ఇండోనీసియాలో విజ్ఞాన వికాసాలను పెంపొందించింది. హైందవ మతాన్ని, బౌద్ధమతాన్ని - రెంటినీకూడా ఆ మహాసామ్రాజ్య చక్రవర్తులు కాపాడినారు. రెండు మతములయందలి ఉత్తమగుణాలను చేదిపుచ్చుకొని - చక్కగా సమన్వయించి - ఒక వినూత్న మత సాంప్రదాయాలను వారు ఇండోనీసియాలో వికసింపజేశారు.

శ్రీ విజయసామ్రాజ్యం ప్రధానాంగం వాణిజ్యం. పరిశ్రమలలో నౌకానిర్మాణం ప్రప్రధానమైనది. ఈ రెంటిని ఆధారంగా చేసుకొని శ్రీ విజయ సామ్రాజ్యం ప్రాచ్య సముద్రాధిపత్యాన్ని చిరకాలంవరకు పాలించింది. సముద్రయానము, నౌకావిహారము ఇండోనీసియనులకు ఉగ్గుపాలతో పెట్టిన విద్యగా నేటికిని వస్తున్నదంటే - దానికి శ్రీ విజయ సామ్రాజ్యం ఆనాడు నాటిన బీజమే మూలకందం.

నాల్గవ శతాబ్దమునుండీ ఉచ్ఛస్థాయిని అభివృద్ధి పొందుతూ పదునొకండవ శతాబ్దంనాటికి శ్రీ విజయ సామ్రాజ్యం మహోచ్ఛస్థానాన్ని అలంకరించింది. అదేసమయంలో ఇటు దక్షిణ

భారతదేశంలోకూడా 'చోళ సామ్రాజ్యం'కూడా ఉన్నతస్థితిలో వున్నది. శ్రీ విజయ సామ్రాజ్యం వలెనే చోళ సామ్రాజ్యంకూడా నౌకాబల ప్రసిద్ధిగన్నది.

చోళులకు శ్రీ విజయ సామ్రాజ్యానికి మధ్య అనేకమైన నౌకాయుద్ధాలు జరిగినవి కాని - చివరకు పదకొండవశతాబ్ది ఆరంభంలో శ్రీ విజయ సామ్రాజ్యమే విశేషంగా నష్టపడి పరాజయమందినది. అయితే - చోళ సామ్రాజ్యం మరియొక శతాబ్దం దాటకుండానే పతనమైపోయింది కాని, శ్రీ విజయ సామ్రాజ్యంమాత్రం మరి మూడువందల ఏండ్లవరకు నిలిచి, విశాల ప్రాక్ సముద్రాన్ని పాలించింది.—

అయినా - చోళుల చేతిలో కలిగిన ఆ మొదటి పరాజయమే - శ్రీ విజయ సామ్రాజ్య పతనానికి నాందికాక తప్ప లేదు. తదుపరి మూడు శతాబ్దములవరకు శ్రీ విజయ సామ్రాజ్యం నిల్చి వున్నప్పటికిని నిలకడగా వుండిన ఒక రాజులేడు: నిశ్చింతగా సాగిన ఒక పరిపాలన లేదు.

శ్రీ విజయ సామ్రాజ్య పతాక ప్రతిష్టతో కొన్ని వంశాలు రాజ్యాధికారాన్ని చేకొన్నాయి, అచిరకాలంలోనే అవి కూలిపోతూవచ్చాయి. చివరకు శ్రీ విజయ సామ్రాజ్యం 1377 సంవత్సరంలో శాశ్వతంగా పతనమైపోయింది.

సింహాళద్వీపంనుండి - ఫార్మోజా దీవివరకు శ్రీ విజయ సామ్రాజ్యం వ్యాపించింది; ఈనడుమగల దేశాల నన్నిటిని ఆక్రమించింది; రాజులను సామంతులను చేసుకొన్నది... కాని... ఒక భూభాగాన్నిమాత్రం శ్రీ విజయసామ్రాజ్యం లోగొనలేకపోయింది... అదే జావాదీవిలోని తూర్పు అర్ధభాగం... "మజోపహిత్ సామ్రాజ్య" భాగం... !

బౌద్ధమత స్వీకారాన్ని వ్యతిరేకించి - ఈ మహోపజిత్ సామ్రాజ్యం - శ్రీ విజయ సామ్రాజ్యాన్ని ధిక్కరించి స్వతంత్ర రాజ్యంగానే నిలువగలిగింది. 'మతం' కారణంగా ఈ రెండు సామ్రాజ్యాల నడుమ నాల్గువందల సంవత్సరాల వరకు సంఘర్షణలు జరుగుతూనే వచ్చాయి. చివరకు 1377 సంవత్సరంలో జరిగిన నౌకాయుద్ధంలో మహోపజిత్ సామ్రాజ్యబలిమికి - శ్రీ విజయ సామ్రాజ్యం తీవ్రపరాజయం పొందింది. శాశ్వతంగా పతనమైపోయింది...

ఇండోనేసియా చరిత్రలో ఒక మహోజ్వలమైన అధ్యాయాన్ని రచించిన శ్రీవిజయ సామ్రాజ్యం - అస్తమించింది. కాని ఆ సామ్రాజ్య ఫలాలుగా నిలిచిన కళ, విజ్ఞాన, విభూతుల నేటికిని ఇండోనేసియనులకు జాతీయ పెన్నిధులు...

పదునాలుగవ శతాబ్ది నాల్గవపాదంలో
శ్రీ విజయ సామ్రాజ్యం అస్తమించింది.

మహోపజిత్ సామ్రాజ్యం మధ్యందిన మార్తాండునివలె వెలుగ నారంభించింది...!



# మహోపజిత్ సామ్రాజ్యం

స్వర్ణద్వీపాలపై శైలేంద్రులు దండయాత్ర సాగించి, సుమత్రా, ద్వీపాన్ని ముందుగా జయించి, ఆక్రమించుకొన్నారు. అచిరకాలంలోనే అచట "శ్రీవిజయ - సామ్రాజ్యాన్ని" ప్రతిష్ఠించారు.— బౌద్ధమతాన్ని ప్రచారం చేయడానికిగాను కాలక్రమేణ ఇతర దీవులనుకూడా వారు ఆక్రమించారు.—

కాని - జావాలో అప్పటికే 'మహోపజిత్' వంశీయులు బలీయులై వున్నారు. హిందూమత ధర్మాలకు వారు పెట్టనికోట వలెవుంటూ - ఎన్ని ప్రతిఘాతాలు వాటిల్లినా ధిక్కరించి, మత ధర్మాన్ని రక్షించారు.—

ఆదిలో 'మహోపజిత్' వంశీయులకు ఒక్క జావాదీవి మాత్రమే రాజ్యభాగమై వుండేది. కాని - శ్రీ విజయ సామ్రాజ్యపు పరువపు విజృంభణలను 'మహోపజిత్' రాజులు నిర్జించలేక పోయారు; ఫలితంగా జావాదీవిలోని పశ్చిమభాగాన్ని వారు కోల్పోయారు. మిగిలిన అర్థభాగంలోనూ వారు రాజ్యపాలన చేస్తూ హిందూమతాన్ని కాపాడినారు. శ్రీ విజయ సామ్రాజ్యం 'మహోపజిత్' రాజ్యాన్నికూడా బౌద్ధమతంలోనికి మార్చివేయాలని పటుతర ప్రయత్నాలుచేసి, విఫలమైంది.

శ్రీ విజయ సామ్రాజ్యం క్రమానుగతిని వృద్ధిజెందుతూ వుండిన మొదటి రోజుల లో- మహోపజిత్ రాజ్యానికి దానివలన ఎన్నదగిన భీతి వాటిల్లలేదుగాని - 9 వ శతాబ్ది ఆరంభంనుండి - మహోపజిత్ రాజ్యానికి - శ్రీ విజయ సామ్రాజ్యం ఒక ప్రబల శత్రువు ఐపోయింది.—

తొమ్మిదవ శతాబ్దంనాటికి శ్రీ విజయ సామ్రాజ్యం ప్రాచ్య ఖండంలో మారులేని సామ్రాజ్య విభవాన్ని ఆర్జించింది. అంతట - తమ బౌద్ధమత ప్రచారానికి చోటులేని మహోపజిత్ రాజ్యంపై శ్రీ విజయ సామ్రాజ్యాధిపతులు, దృష్టిని సారించారు. బలవంతంగానైనా మహోపజిత్ రాజులను లొంగదీసి బౌద్ధ మతాన్ని అచట విస్తరింపజేయాలని వారు పెక్కు ప్రయత్నాలు చేయసాగారు.

దీనికితోడు - మహోపజిత్ సామ్రాజ్యం శ్రీ విజయ సామ్రాజ్యం వలెనే "వాణిజ్యం" ప్రధాన ఆలంబనం గాగల దేశం.— వాణిజ్య వృద్ధిపైననే ఆ సామ్రాజ్యాభివృద్ధి ఆధారపడి వుంది. నౌకాబలం తగినంతవుండి నప్పటికిని అది శ్రీ విజయసామ్రాజ్య నౌకాబలం ధాటికి నిలువలేకపోయింది.

మత వైరుధ్యము, వాణిజ్య విభేదము, ముప్పిరిగొనగా - ఈ రెండు సామ్రాజ్యాల మధ్య సుమారు నాలుగువందల సంవత్స రాలపాటు అవిరామంగా సంఘర్షణలు జరుగుతూ వచ్చాయి. ఈ స్పర్థల ఫలితంగా మహోపజిత్ రాజ్యం తన 'మత' ప్రత్యేక స్వరూపాన్ని కాపాడుకొనగలిగినదిగాని, వాణిజ్య వృత్తులను మాత్రం రక్షించుకొనలేకపోయింది. అందువలన మహోపజిత్ రాజ్యం మిక్కిలి దుర్బలమైన దేశంగా పరిణమించింది.

పన్నెండవ శతాబ్ది ఆరంభంనుండి శ్రీవిజయసామ్రాజ్య భానుడు అస్తాద్రికి తిరుగజొచ్చాడు. సామ్రాజ్యంలో చీలికలు ఆరంభమైనట్లే - శ్రీవిజయసామ్రాజ్యానికి - భారతదేశంతో అంత వరకు వుంటూవుండిన స్నేహసంబంధాలు కూడా నశించిపోయాయి. దానితో వాణిజ్యం దెబ్బతిన్నది. వర్తకవ్యాపారమే ప్రధాన ఐశ్వర్యసాధనంగాగల ఆవిజయసామ్రాజ్యం నీరసానికి నెలవైనది. దానికితోడు చిల్లరరాజులు బయలుదేరి సామ్రాజ్యశక్తిని దుర్బల మొనర్చివేశారు.

శ్రీ విజయ సామ్రాజ్యం ఇట్టి దుర్దశకు లొంగిపోతున్న తరుణంలో - అవకాశాల నన్నిటిని అందిపుచ్చుకొని - వినియోగా నికి తెచ్చుకొని - మహోపజిత్ రాజ్యం విజృంభించింది. మత దృష్ట్యా స్వాతంత్ర్యాన్ని నిలుపుకొన్న ఆదేశం - వ్యాపారరీత్యా విజృభించ నారంభించింది: శ్రీ విజయ సామ్రాజ్యంతో పోటీపడి నిలువకలిగింది; పెక్కు విజయాలను ఆర్జించింది. చివరకు జావా సముద్రతీరాన - నేటి మలకాజలసంధి పేరునవున్న సముద్రంలో జరిగిన నౌకాయుద్ధంలో 1377 సంవత్సర ప్రాంతాన మహోపజిత్ రాజ్యం శ్రీవిజయసామ్రాజ్యాన్ని పూర్తిగా ఓడించివేసింది.

అపూర్వమైన ఆ విజయాన్ని ఆధారంగాజేసికొని మహోప జిత్ రాజ్యం క్రమేణా తన ఎల్లలను విస్తరించుకొన నారంభించింది. అతిస్వల్పకాలంలోనే మహోపజిత్ రాజ్యం స్వర్ణదీపాలు అన్నిటి యందు వ్యాపించి "సామ్రాజ్యం" ఐపోయింది.

1380 సంవత్సరప్రాంతాన మహోపజిత్ సామ్రాజ్యాన్ని పరి పాలించిన మహారాణి 'సోహిత' కాలంలోనే ఆ సామ్రాజ్యానికి మహోచ్ఛదశ ప్రాప్తించింది. బ్రహ్మాండమైన నావికాబలాన్ని, అంతకుమించిన సైనికబలాన్ని ఆమె పెంపొందించింది. ఈ రెండు సైనికశక్తులను ఆధారంగాచేసుకొం ఆమె ఇంచుమించు ఇండోనీ సియా నంతను ఆక్రమించి మహోపజిత్ సామ్రాజ్యపతాకాన్ని వెలారించింది.

ఇండోనీసియా పూర్వపుచరిత్రనుబట్టి ఈమె పరిపాలనలో రాజ్యాంగచక్రం అపూర్వంగా పరిభ్రమించినట్లు తెలుస్తూవుంది.

పరిపాలన అంతా 'కేంద్రీకరణ' సిద్ధాంతంపై ఆధారపడి నడిచింది. పన్నువిధానము, సుంకములపద్ధతి, భూమిశిస్తువిధానము నిర్దుష్టంగా వుండినవి. రాజ్యాంగవిధానం అంతా ముఖ్యమైన ఆరు శాఖలచే నిర్వహింపబడేది; (1) వలసదేశాలశాఖ, (2) వాణిజ్యశాఖ, (3) ప్రజారోగ్యశాఖ, (4) గృహశాఖ, (5) యుద్ధశాఖ, (6) న్యాయ

శాఖ వివిధ న్యాయస్థానాలు గాక, కేంద్ర న్యాయస్థానంకూడా ఒకటి ప్రత్యేకంగావుండేది. అచట ఇద్దరు ప్రధాన న్యాయశాఖాధిపతులు, మరి ఏడుగురు న్యాయమూర్తులు వుండి ఆశాఖను అపూర్వంగా నిర్వహించేవారు; ధర్మపరిపాలన సాగించేవారు.

వాణిజ్యం ప్రధానాంగంకనుక మహోపజిత్ సామ్రాజ్యాధిపతులు వివిధదేశాలతో తిరిగి సామరస్యాన్ని పెంపొందించుకొన్నారు. భారతదేశము, చైనాతదితర దేశాలతో పూర్వపువాణిజ్య వ్యాపారాలు పునరుద్ధరింపబడినవి. భారతదేశంతో వర్తకమైతే కొంత జరుగజొచ్చినదిగాని, వెనుకటి సంబంధబాంధవ్యాలుమాత్రం ఉద్ధరితాలు కాలేదు.

రాజ్యాంగవిషయాలలోనేగాక కళావిజ్ఞానాలపరంగాకూడా మహోపజిత్ సామ్రాజ్యం ఒకమహోజ్వలస్థానాన్ని అలంకరించింది.

మహోపజిత్ సామ్రాజ్యాధినేతలు శైవ మతావలంబులు సామ్రాజ్యరాజధానీ నగరుమధ్యంలో బ్రహ్మాండమైన శివాలయం; దానిని పరివేష్టించి నగరవీథులు, ఇతర మందిరాలు వుండేవి. శైవ మతమేకాక, వైష్ణవమతంకూడా అచట సమానంగా గౌరవింపబడింది. శివునకు, విష్ణువుకు పెక్కునగరాలలో ఆలయాలు నిర్మింపబడ్డాయి.

అసలు మహోపజిత్ సామ్రాజ్యచక్రవర్తులు నగర, గృహ నిర్మాణంలో ప్రత్యేకమైన ఆసక్తిని ప్రదర్శించారు. రాజధానీ నగరమేకాక జావాదీవియంతటా పెక్కు సుందరనగరాలను వారు నిర్మించారు; ప్రతినగరంలోను ఆనాడు వారుకట్టిన సువిశాలమైన మందిరాలు, గృహాలు ఈనాటికికూడా కన్నులపండువు కూరుస్తూ వుంటాయి. జావా సముద్రపుఅంచు వెంబడి కట్టబడిన రేవుపట్టణాలు అపూర్వమైనవి.

మధ్యజావాలోని 'డాంక్' పీఠభూమిలోని ప్రతియూరియందు ఒక్కొక్క దేవాలయం వున్నది. అవి అన్నీ శివాయాలే

వాటిలో 'ప్రాంబనన్' దేవాలయాలు ఎన్నదగినవి. మధ్యజావా లోని సారవంతప్రదేశాలలో అనగా 'జోగాకార్తా' సమీపంలో వున్న శివాలయం పేర్కొనదగినది. కొన్ని మైళ్ళ పొడవుగల ప్రాకారంతో, పెద్దనందికేశ్వరుని విగ్రహంతో నగర ముఖద్వారంవద్ద ఈ దేవళంవున్నది. దేవాలయ ప్రాకారాలమీద, కుడ్యాలమీద రామాయణ, భారతగాధలు చెక్కబడి, వింతసోయగాన్ని కూరుస్తూ వుంటాయి. ఈ దేవాలయాలను, అందలి కళావిశేషాలను, చూచి, ఆనందించడానికి వేలకొలదిప్రజలు యాత్రగా అనుదినము నేటికిని వస్తూవుంటారు. ఇక దేశసంచార కుతూహలురగు పాశ్చాత్యుల అబ్బురాన్ని, ఆసక్తినిగురించి వేరుగా చెప్పనక్కరయేలేదు......!

జావాదీవి మొత్తంమీద హిందూదేవాలయాలు 500 లకు పైగా వున్నాయి. వీటిలోకొన్ని క్రీ॥ శ॥ 650 - 950 సంవత్సరాల మధ్యకాలంలో కట్టినట్లు వాటినిగురించివున్న శాసనాలు చెబుతూ వున్నాయి.

శ్రీ విజయసామ్రాజ్యం కృతంగా ప్రతిభను కోల్పోయిన హిందూమతాన్ని మహోపజిత్ సామ్రాజ్యం ఉద్ధరించింది గాని బౌద్ధ మతాన్ని మాత్రం నశింపుచేయవలెనని ప్రయత్నించినట్లులేదు. హిందూమతంతో పాటు బౌద్ధమతంకూడా అచట తనస్థానాన్ని తాను నిలుపుకొన్నది.

మహోపజిత్ సామ్రాజ్యం ప్రవర్తిల్లినకాలంలో స్వర్ణదీపాలకు, ఇండోనీసియాకు అంతగా సంబంధబాంధవ్యాలు లేకపోవడం వల్ల భారతదేశంలోని మతప్రభావం ఆ దీవులను సోకడంకూడా పూర్తిగా సన్నగిల్లిపోయింది. దీనికితోడు మహోపజిత్ సామ్రాజ్య చక్రవర్తులు అనుసరించిన మతసారస్య దృక్పథంఫలితంగా స్వర్ణదీపాలలో ఒక అపూర్వమైన పరివర్తనం కలిగింది.

శైవమతము, వైష్ణవమతము, బౌద్ధమతము మూడుమతము లున్న భారతదేశములోవలెగాక స్వర్ణదీపాలలో మిళితమై

పోయాయి. మహోపజిత్ సామ్రాజ్యం చివరిరోజులలో ఈ పరిణామం బాగా రూపించింది. క్రమేణా యీ మతాలు అదిమనివాసులగు జావానీయుల ఆచారవ్యవహారాలతో మిళితమైపోయాయి. సంస్కృతభాషఅంతరించి జావానీయులభాష విజృంభించసాగింది. అయితే భాష పైకివచ్చినా పద్య, గద్య, రచనావిధానమంతా సంస్కృతభాషకు మారురూపంగానే బయలుదేరింది.

స్వదేశభాష, స్వదేశఆచారాలు తిరిగి తలయెత్తటంతో రామాయణ, భారతగాథలుకూడా కొన్ని మార్పులుపొందాయి. హిందూ, బౌద్ధధర్మవిబేధాలు నశించడంతో శివుడు, విష్ణువు, బుద్ధుడు ముగ్గురుకూడా వీరికి ఆరాధ్యదైవాలు అయినారు. 'బలీ' ద్వీపంలో నేటికి ఈ విశ్వాసం నిలిచివుంది.

సుమారు 15 శతాబ్దాలకుపైగా మహోపజిత్ రాజ్యం జావాలో వుండినప్పటికిని సామ్రాజ్యవైభవంతో అది విలసిల్లినది ఒకశతాబ్దంమాత్రమే. - దీనికికారణం మహోపజిత్ సామ్రాజ్యం అనుసరించిన సామ్రాజ్యవిధానమేనని చరిత్రకారులు తీర్పు చెబుతూ వున్నారు.

ఏదిఏమైనప్పటికిని పదిహేనవశతాబ్దారంభంలో మహోపజిత్ సామ్రాజ్యానకి అంతఃకలహాలు ప్రాప్తించినవి. దానికితోడు చైనాతోకూడా విభేదాలు పొటమరించాయి. దీనిఫలితంగా చైనా చక్రవర్తులు బ్రహ్మాండమైన నౌకాబలాన్ని సమయత్తపరుచుకొని జావాదీవిపై దండయాత్రవచ్చారు.

రానురాను మహోపజిత్ సామ్రాజ్యానికి అనుబంధంగా వుండినవలసదేశాలన్నీ జారిపోయాయి. చివరకు 1426 లో సామ్రాజ్య మంతటా భయంకరమైన క్షామంవ్యాపించింది. రెండుసంవత్సరాల వ్యవధిలో సామ్రాజ్యంఅంతా ఎండి బీటలువారినట్లయిపోయింది. అయినప్పటికిని తరువాత మరియాభైయేండ్లవరకు మహోపజిత్ సామ్రాజ్యం ప్రవర్తిల్లింది.

ఈలోపుగా స్వర్ణద్వీపాలను మరొక జాతీయులు మహమ్మదీయులు ఆగమించారు. అంతకుపూర్వంనుండి వారు ఆ ద్వీపాలతో వర్తకవ్యాపారంచేసుకొంటూవుండినప్పటికిని స్వర్ణద్వీపాలలో ప్రాదేశిక ప్రాబల్యాన్ని ఆర్జించుకొనలేకపోయారు. పదిహేనవశతాబ్దం మధ్యభాగంలోవారు జావాలో ఒక నౌకాకేంద్రంవద్ద బలమైన స్థావరాన్ని నెలకొల్పుకొనగలిగారు గాని రాజకీయమైన బలాన్ని మాత్రం సంపాదించలేకపోయారు. అయితే ఈలోపుగా కొందరు జావానీయులను మహమ్మదీయులనుగా మార్చి వారితోడ్పాటుతో వారు మహోపజిత్ సామ్రాజ్యంతో యుద్ధానికి తలపడ్డారు. కడకు 1522 సంవత్సరంలో మహోపజిత్ సామ్రాజ్యాధిపతులు మలకా ముస్లిమ్ సంస్థానాధీశ్వరునితో సంగ్రామంజరిపి పరాజితులైనారు. వెంటనే ముస్లిమ్‌సుల్తానులు జావాదీవిని పూర్తిగా ఆక్రమించుకొన్నారు. దానితో మహోపజిత్ సామ్రాజ్యం పతనమైపోయింది. చరిత్రనుండి నిష్క్రమించింది.

పడిపోయిన హిందూమతాన్ని పునరుద్ధరించి, బౌద్ధమతాన్ని కూడా పోషించి, జావాజాతీయభాషావిజ్ఞానాలను పైకితెచ్చి అసలు ఆదినుండి స్వీయస్వాతంత్ర్యాన్ని అజేయంగానిలుపుకొన్న ధీరస్వాంతనయై ఒకశతాబ్దికాలం అఖండతేజస్సుతో విలసిల్లి మహోపజిత్ సామ్రాజ్యంకూడా కాలగర్భాన కలిసిపోయింది.

ఆ మహాసామ్రాజ్యచిహ్నాలుగా ఆలయాలు, శిల్పాలు నేటికిని నిలిచి జావానైకతసీమలో గుప్తకళారోచిస్సులను వెదజల్లుతున్నాయి; విజ్ఞానపాండితినిగూర్చి గానంచేస్తూనేవున్నాయి...!



# మహమ్మదీయ మహాయుగం

స్వర్ణద్వీపాల ఐశ్వర్య సౌరభాన్ని ఆఘ్రాణించి భారతీయులు మాత్రమే గాదు, అరబ్ జాతీయులుకూడా ఆకర్షింపబడ్డారు. పూర్వకాలంనుండి 'వణిజులు' గా అరబ్బులున్నూ ఇండోనీషియాలో అడుగు పెట్టారు. వర్తకము, వ్యాపారము మొదలైన వాటితోనే వారిఉద్యమం సాగుతూవచ్చినదిగాని పదకొండు శతాబ్దాలు గతించువరకు అరబ్బులు ఇండోనేసియాలో ఒకింత స్థిరమైనవాసరాన్ని ఆర్జించుకొనలేకపోయారు. వాణిజ్య ప్రయోజనాలను ఎఱగాపెట్టి స్వర్ణద్వీపవాసులలో ముస్లిమ్ మతప్రచారాన్ని చేయవలెననివారు శతాబ్దులతరబడిగా విశేషపరిశ్రమ చేశారు.

శ్రీ విజయసామ్రాజ్యము, మహోపజిత్ సామ్రాజ్యములు రెంటున్న, బౌద్ధ, హిందూమతాలను ప్రధానసమస్యలుగా పెట్టుకొని పోరాడుతూవుండినతరుణంలో ప్రజానీకంలో ప్రాటుమరించిన ప్రతిభావాలను అవకాశంగాతీసుకొని అరబ్ వర్తకులు తమ చిరవాంఛితాన్ని కొంతవరకు ఈడేర్చుకొనగలిగారు. అరబ్ వర్తకనాయకుడైన అబ్దుల్లాఆరిఫ్ ప్రోద్బలంపై సుమత్రాదీవిలోని 'ఆఛే' పురవాసులు తొల్దొల్తగా 1111 సంవత్సరంలో మహమ్మదీయ మతాన్ని స్వీకరించారు. తదుపరి అతని శిష్యకోటిలో ఒకడైన బొర్హానుద్దీను అనునతడు జావాదీవిలో విశేషమైన ప్రచారంచేసి తూర్పునుండి పడమటికొనవరకు ముస్లిమ్మతాన్ని వ్యాపింపజేశాడు; సుమత్రాదీవి తూర్పుకొననున్న పడమటిదిశలోని 'మినాంకబావు' రాష్ట్రంలోని పరియమన్ వరకు అతని మతప్రచారం బాగా విస్తరించింది. దీనిఫలితంగా 1205 సంవత్సరంనాటికి 'ఆఛే' నగర ప్రాంతంలో మొట్టమొదటగా ఒక 'ముస్లిమ్' సంస్థానం ఏర్పడింది.

దానికి 'ఓహాన్ షా' అనునతడు మొదటిపాలకుడుగా రాజ్యంచేయ నారంభించాడు.

వర్తకానికితోడుగా ఒకింత స్థానిక రాజ్యాధికారంకూడా లభించినవెంటనే ముస్లిమ్ మతప్రచారం ద్విగుణీకృతవేగంతో సుమత్రాదీవిఅంతటా అలుముకొన్నది. 1440 నాటికి సుమత్రాదీవి లోని ప్రధాననగరమైన పాలెంబాంగ్ కు, 15 వ శతాబ్దాంతానికి సుమత్రాదక్షిణకొనకు ముస్లిమ్మతం విస్తరించింది. ముస్లిమతప్రచార కులు రాపెన్ రాబ్ మట్, మినాక్ కమలాబోమీ మొదలైనవారు నాడు మిక్కిలి ప్రఖ్యాతివహించారు. వీరి కీనాడు భారతదేశంలో వుండిన మహమ్మదీయమతాధికారులు, రాజులుకూడా బాగా సహా యపడి, ప్రోత్సాహమిచ్చినందువల్ల, స్వర్ణద్వీపాలలో ప్రజాభిప్రాయం ఎంతవ్యతిరేకంగా వుండినప్పటికిని అనుకొన్నదానికంటె పరిమిత కాలంలోనే ముస్లిమ్మతప్రచారకులు తమ కర్తవ్యాన్ని నెరవేర్చు కొనగలిగారు.

సుమత్రాదీవిలో ముస్లిమ్మతవ్యాప్తికి ప్రారంభం జరుగునాటికి శ్రీ విజయసామ్రాజ్యం అస్తమించడము, తదుపరి మహోపజిత్ సామ్రాజ్యం అవసానదశలో అడుగులు కడనంటివుండడము ప్రాప్తిం చినందువల్ల ముస్లిమ్సుల్తానులు జావాదీవిలోకూడా తమ మతప్రచార వ్యూహాలను బాగుగా జరుపగలిగారు.

జావాదీవిలోకొంతబలీయుడైన హిందూరాజు 'పాజాజగాన్' అనునతడు వర్తకావసరాలపై భారతదేశానికివెళ్ళి అచట మహమ్మ దీయమతాన్ని స్వీకరించి ముస్లిమ్ మతప్రచారకుడుగా స్వదేశానికి తిరిగివచ్చాడు. వస్తూ తనతోపాటు కొందరు ముస్లిమ్ మతప్రచారకు లను కూడా వెంటబెట్టుకొనివచ్చాడు. తూర్పు జావాలోని 'గ్రిసిక్' నగరంవద్ద కేంద్రాన్ని నెలకొల్పుకొని ఆ ముస్లిమ్మతప్రచార సంఘ నాయకుడైన మాలానా మాలిక్ ఇబ్రహీమ్ అనునతడు అచిరకాలం లోనే జావాఅంతటా మహమ్మదీయమతాన్ని వ్యాపింపజేశాడు. వందలు, వేలకొలది జావానీయులు అతనిద్వారా మహమ్మ దీయులుగా మారిపోయారు.

జావా సుమత్రా దీవులలో ప్రాబల్యం లభించినవెంటనే ముస్లిమ్‌మతప్రచారకుల నడక ఇతరదీవులపై నల్లేరుపై బండిఎతుగా సాగిపోయింది. 'డైడార్' రాజు తనదేశంలోని ప్రజలతో సహా ముస్లిమ్‌మతస్వీకారంచేశాడు. 'బెర్నెట్' రాజు జావాలోని 'గ్రిసిక్' ముస్లిమ్‌మతపీఠానికే తరలివెళ్ళి మహమ్మదీయమతం పుచ్చుకొన్నాడు.

ఈ ఇద్దరురాజులు మహమ్మదీయులై తమతమ సైనికబలాలను అండగాపెట్టుకొని ఇండోనేసియాఅంతటా విజృంభించారు. ఫలితంగా 17 వ శతాబ్దం ఆరంభంనాటికి ఇండోనేసియా అంతటా ముస్లిమ్‌మతంవిస్తరించింది. దీవులంతటా,వివిధప్రదేశాలలో పెక్కురు ముస్లిమ్‌సుల్తానులు బయలుదేరారు. వీరిలో 'మకస్సార్' సుల్తాను చాలా బలాఢ్యుడై ఇండోనేసియాఅంతటా మారులేనిఅధికారాన్ని చెలాయించాడు.

పదునాల్గవశతాబ్దానికి పూర్వం ఇండోనేసియాలో మహమ్మదీయమతం చెప్పుకొనదగిన స్థానాన్ని ఆర్జించలేకపోయినా మహోపజిత్ సామ్రాజ్య పతనానంతరం దానిప్రభావం మిన్నుముట్టింది. మూడుశతాబ్దాలవ్యవధిలో అదిఇండోనేసియాఅంతటా వ్యాపించింది. సైనిక, ఆయుధబలాల తోడ్పాటుతో బలవంతంగా మహమ్మదీయ మతం వ్యాపించకలిగినది గాని ప్రజాభిమానాన్ని పురస్కరించుకొని అది ఎన్నడును వ్యాప్తిలోనికి వచ్చివుండలేదని, 'విథర్ ఇస్లామ్'అనే గ్రంథంలో ప్రొఫెసర్ సి. సి. బెర్గ్ వ్రాస్తూవున్నాడు.

ఒక బలిష్ఠమైన మహాసామ్రాజ్యం పతనమైనవెంటనే ప్రతి తావులోను చిన్నచిన్న రాజులు బయలుదేరి స్వీయరాజ్యాలను స్థాపించుకొంటూవుండడం చరిత్రచెప్పేసత్యం. ఈ సత్యం ఇండోనేసియాపట్లకూడా అక్షరాలా అనువర్తించింది. మహోపజిత్ సామ్రాజ్యం అస్తమించినవెంటనే జావా, సుమత్రా, బోర్నియో, సెలిబస్ తావులయందు పలుప్రదేశాలలో చిల్లరరాజులు మొలకెత్తి చిల్లర సంస్థానాలను సృష్టించారు. కాలక్రమాన, మహమ్మదీయమతప్రచా

రకుల సైనికశక్తికి తాళలేక ముస్లిమ్‌మతాన్ని అవలంబించి 'సుల్తాన్' లుగా మారిపోయారు.

అయితే మహమ్మదీయమతాన్ని స్వీకరించకుండా ముస్లిమ్ మతాధికారులను, రాజులను ధిక్కరించినిల్చినవారుకూడా లేకపోలేదు. బోర్నియోలోని 'సోకదానా' రాజు అట్టివారిలోఒకడు. కాని ఈతని మరణానంతరం ఇతనికుమారుడు (ఇంతకుముందే ఇతడు మహమ్మదీయుడైనాడు) రాజ్యాధికారాన్ని చేకొని ముస్లిమ్‌రాజ్యాన్ని స్థాపించినాడు. 'సోకదానా' రాజువలె 'బలి' దీవిలోని రాజులు కూడా మహమ్మదీయ మతప్రచారవాహినులను ఎదురొడ్డి నిలువగలిగారు. అందువలననే నేటికిని 'బలి' ద్వీపంలోమాత్రమే కొంత వరకు హిందూమతం వ్యాప్తిలోవున్నది.

మొత్తంమీద 17వ శతాబ్దంచివరకు ఇండోనేసియా అంతటా మహమ్మదీయమతం వ్యాపించిపోయింది. సుల్తానులున్నూ అటనట వెలిశారు. 'హిందూ' రాజ్యంఅనునది 1770 సంవత్సరంవరకు జీవించి అస్తమించింది.

ఇండోనేసియా అంతటా చిన్నచిన్న సంస్థానాధీశ్వరులు హెచ్చుగుండినప్పటికిని వారిలో బలీయులు, ప్రశిద్ధులు అయినవారు కొద్దిమందిమాత్రమే వుండినారు. వారిలో డెమాక్ సంస్థానము, బాంటమ్‌సంస్థానము, ఆఛరాజ్యము, టెర్నేట్, టైడోర్ సంస్థానాలు, మటారమ్‌సంస్థానము, బాండనీస్ దీవులు, మక్‌స్సార్ సంస్థానము ముఖ్యమైనవి.

వీరందరిలోను 'మటారమ్' సుల్తానులుమాత్రం ఇండోనేసియాకు కొంతయదార్థమైన సేవ చేయగలిగారు. కేవలము మతప్రచారాన్నే ఇతరసుల్తానులు తమపరమావధిగా పెట్టుకొని కాలంగడిపితే మటారమ్ సుల్తానులుమాత్రం రాజ్యపాలనలోను, వర్తకాభివృద్ధిలోను మిక్కిలి కృషిచేశారు. 'కొరాన్' ను అనుసరించి న్యాయచట్టాన్ని అమలుజరిపినా పన్నులు తదితరసుంకాలను

వసూలు చేయడంలో వీరు 'మహాపజిత్' సామ్రాజ్య విధానా లను పునరుద్ధరించి రాజ్యపాలన చేశారు.

ఇంతకన్న మినహా ముస్లిమ్ రాజులు ఇండోనీసియాలో కొని తెచ్చిన మార్పులేవియు లేవని చరిత్రకారులు చెబుతూవున్నారు. ఇందుకు వేరొక కారణంకూడా లేకపోలేదు.

ముస్లిమ్ వర్తకులు ఇండోనీసియాలో స్థిరమైన ప్రాబల్యం ఆర్జించడానికి మూడువందల సంవత్సరాలు పట్టింది. తీరా మత ప్రచారంచేసి ఇండోనీసియా నంతను మహమ్మదీయ దేశంగా మార్చి, స్థిరపడునాటికి ఆసియాముస్లిమ్ సుల్తానులకు పాశ్చాత్య వర్తకులపోటీ ప్రారంభమైనది. అంతేకాదు ఆపాశ్చాత్యవర్త కులతో యుద్ధాలు, స్వదేశరాజులతో కలతలు మొదలైన హెచ్చు క్లిష్టపరిస్థితులు దాపురించడంవల్ల మహమ్మదీయ సుల్తానులు చెప్పుకొనదగిన రాచకార్య చాతుర్యాలనుగాని, కళా, విజ్ఞానవైభ వాలనుకాని ఇండోనీసియాలో ప్రదర్శించలేకపోయారు. మహమ్మ దీయ రాజులు ఇండోనీసియాలో చెప్పుకొనదగిన ఘనకార్యాలను కేటినీ ఆచరించివుండలేక పోవడానికి ఇవి ప్రధానకారణాలని 'బెగ్' మహాశయుడు వ్రాస్తువున్నాడు.

1750 సంవత్సర ప్రాంతాలకు ఇండోనీసియాలో మహమ్మ దీయరాజులు రాజ్యాధికారాలను స్థిరంగా నెలకొల్పుకొని ఒక శతాబ్దంపాటు అవిరామమైన కలతలతో అశాంతిలోనై 1650 సంవ త్సరప్రాంతాలకు పాశ్చిమాత్య వాణిజ్యజాతులకు లోబడిపోయారు. సుమారు మూడువందల సంవత్సరాలపాటు ఇండోనీసియాలో ముస్లిమ్‌రాజ్యపతాకము ఎగరించి పాశ్చాత్యులకు దారినిచ్చివేశారు.

కళింగ, శ్రీవిజయ, మహాపజిత్ సామ్రాజ్యాలవలె కాక పోయినా ముస్లిమ్‌సుల్తానులు కొందరుచేరి ఇండోనీసియాలో 'ముస్లిమ్ మహాయుగాన్ని' సృష్టించి చరిత్రనురచించి అస్తమించారు.

# ఇండోనీసియా జాతీయస్వరూపము

## స్వర్ణద్వీపాలు

ఈ పేరు ఇండోనీసియాకు అక్షరాలా అన్వర్థనామం అయిపోయింది. పాడిపంటలు; ఖనిజసంపత్తి ఆదిగాగల అష్ట ఐశ్వర్యాల పరంగానేకాక ఈ 'స్వర్ణ' శబ్దార్థం 'జాతీయత' పరంగాకూడ మూడుమూర్తులా సరిపోయింది. ఏ ఆభరణాన్ని తయారుచేసుకొనడానికైనా 'స్వర్ణం' మృదువుగా లొంగి శిల్పకారుని హస్తలాఘవానికి ప్రదీపనం కూరుస్తుంది. ఇది బంగారానికివున్న ప్రత్యేకగుణంగా చెప్పబడుతూవుంటుంది. బంగారంవలెనే స్వర్ణద్వీపాలుకూడా ఇతరమత విజ్ఞానాలనే శిల్పుల హస్తనైపుణ్యంలో చక్కగా సురూపాన్ని పొందుతూవచ్చాయి. అన్యమత సంస్కృతుల ప్రబోధాలు ఇండోనీసియాలో అందుకొన్ని ప్రతిధ్వనులను ప్రపంచంలో మరి యే ఇతరదేశంలోను, ఏ ఇతరమతము పొందివుండలేదని చెప్పడం అతిశయోక్తికాదు. స్వీయజాతీయమునకు పైమెరుగుగా అన్యదేశ జాతీయవిజ్ఞానాలను ఇండోనీసియా అపారంగా ఆస్వాదించింది. ఇండోనీసియాచరిత్ర ఈ సత్యాన్ని పలుభంగులుగా ఘోషిస్తూనేవుంది.

స్వర్ణద్వీపాలలో ఆంధ్రుల విజ్ఞానవాణిజ్యశ్రీలు ఆదిలో పొంగి పరవళ్ళువారాయి. ఫలితంగా ఇండోనీసియాలో పది శతాబ్దములపాటు హిందూమతం వికసించింది. ఇండోనీసియాచరిత్రలో 'హిందూమహాయుగం' ఒక దివ్వెవలె వెలుగొందింది.

హిందూమతానికి తోడుగా 'బౌద్ధమతం' కూడా ఇండోనీసియాలో పరివర్తిల్లింది. అందువల్ల ఇండోనీసియాచరిత్రలో 'బౌద్ధమహాయుగం' కొన్ని శతాబ్దులు విరాజిల్లింది.

పిమ్మట ఇండోనీసియాలో 'ముస్లిమ్' మతం ప్రవేశించింది. ఈ మతప్రభావం మరికొంతకాలం సాగి ఇండోనీసియాలో 'ముస్లిమ్ మహాయుగము' ను రచించింది.

సుమారు పదిహేను శతాబ్దాలపాటు ఇండోనీసియాలో హిందూ, బౌద్ధ, ముస్లిమ్ మతాలు వరుసగా రాజ్యంచేశాయి. అన్య మతప్రభావాలకృతంగా ఇండోనీసియా "హిందూఇండోనీసియా, బౌద్ధఇండోనీసియా, ముస్లిమ్ఇండోనీసియా" గానే చెల్లిపోతూ వచ్చింది కాని ఇండోనీసియా 'జాతీయస్వరూపం' అనేది ఒకటి నిర్దుష్టంగా రూపొందలేకపోయింది. ఇండోనీసియా 'జాతీయఇండో నీసియా' గా రూపురేఖాంచితం పొందజాలకపోయింది. అందువల్ల ఇండోనీసియాచరిత్రలో మొదటి పదిహేనుశతాబ్దాలు అన్యదేశీయ విజ్ఞానాలనుగురించి ఉగ్గడిస్తాయి: అన్యమతాల ఘనతనుగురించే గానంచేస్తాయి. దీనిఫలితంగా ఇండోనీసియా జాతీయతనుగురించి గాని, మతము, భాష, ఆచారవ్యవహారాలను గురించిగాని మన కంతగా ఎరుకకాదు.

కాని పదహారవ శతాబ్దం ఆఖరికి ఇండోనీసియాకు 'జాతీయ స్వరూపం' అంటూ ఒకటి రూపొందింది. ఒక ప్రత్యేకమైన దేశ భావము, ఒక భాష, ఒక మతము, ఒకజాతీయత అంటూ ఇండునీ సియా నిర్మించుకొనగలిగింది. పదహారవ శతాబ్దాంతానికి రూపొందిన ఆజాతీయతాస్వరూపమే ఇండోనీషియాలో ఈనాటివరకు నిలచివున్నది.

ఇండోనీసియాలో ముస్లిం సుల్తానుల పరిపాలన అంతంకావ డము, డచ్ దేశీయుల అధికారం ఆరంభం కావడము జరిగినసంధి కాలములో - ఇండోనీసియా జాతీయస్వరూపాన్ని గురించి తెలుసు కొనడం ఉచితమై వుంది. అసలు ఇండోనీసియన్ జాతీయత ఏవి ధంగా పరిణామం పొందుతూవచ్చినది, ఇండోనీసియనుల ఆచార వ్యవహారాలు ఏరూపాన మారుతూవచ్చినది ఆపరిణామ విశేషానుల గురించి మున్ముందుగా తెలుసుకొనడం ఈ సందర్భములో ముఖ్యమై వుంది.

భారతదేశానికి ఇండోనీసియాకు మధ్య సంబంధబాంధవ్యాలు సుమారు పదకొండవ శతాబ్దం ఆఖరువరకు సమరసంగా సాగుతూ వచ్చాయి. శ్రీ విజయసామ్రాజ్యం స్వర్ణద్వీపాలలో అస్తమించిన తరువాత ఈ రెండు దేశాలమధ్య వెనుకటి సామరస్యం కూడా అంతరించిపోయింది. మహోపజిత్ సామ్రాజ్యం మంచి ఉచ్ఛదశలోనికి రాగానే ఇండోనీసియాకు భారతదేశంతో అసలు ప్రమేయమే లేకుండా పోయింది. అందువల్ల ఇండోనీసియా ఒక స్వతంత్ర్యదేశంవలె ప్రవర్తిల్లసాగింది.

మాతృభూమితో సంబంధం తెగిపోవడంచేత హిందూ బౌద్ధ మతాలు ఇండోనీసియాలో పూర్వపు ప్రాబల్యాన్ని నిలుపుకొనలేక పోయాయి. హిందూబౌద్ధ మతాలు ఇట్టిదుర్బలత్వానికి లోనైన తరుణంలో ఇండోనీసియా తన జాతీయ స్వరూపాన్ని పునరుజ్జీవింప జేసికొన నారంభించింది. మహోపజిత్ సామ్రాజ్య చక్రవర్తులు జావా జాతీయవిజృంభణకు పూర్తిగా దోహదమివ్వడంకూడా కొంత కారణభూతం కాకపోలేదు.

ఈ పరిణామంలో ఒకశతాబ్దం గడుచునాటికి ఇడోనీసియాలో నవ్య వ్యవస్థ తలసూపింది.

హిందూబౌద్ధమతాలు మిళితమై ఇండోనీసియా ఆదిమ మతంతో ఏకమై పోయాయి. ఇండోనీసియాలో అంతవరకు ప్రధానమై వుండిన సంస్కృతభాష తన స్థానాన్ని వదలిపెట్టింది. దానికి బదులు ఇండోనీసియనుల జాతీయభాష అయిన 'మలయా' ప్రాముఖ్యాన్ని ఆర్జించింది. అంతేకాదు; ఆమలయాభాషలో సంస్కృతంకూడా కొంతకలిసిపోయింది. దీని ఫలితంగా ఇండోనీసియన్ సాహిత్య ప్రపంచములో ప్రధానంగా పేర్కొనదగినవి భాగవత రామాయణాలే అయినప్పటికి ఆగాథలన్నీ విశేషమైన మార్పులను పొందాయి. రచనా విధానంలోకూడా సంస్కృతానికి దీటుగా ఇండోనీసియన్ పద్య రచనాపోకడలు వెలిశాయి. సంస్కృత గ్రంథాలలోని కథలు భావాలుకూడా మార్పులు చెందాయి.

భారతీయ సాహిత్యమంతా మారిపోయి ఒక వికృతరూపంలో ఇండోనీసియన్ సాహిత్యం ఒక పరిపూర్ణ స్వరూపాన్ని పెంపొందించుకొన్నది.

రానురాను సంస్కృతభాష శిష్టుల భాషఅయింది. అచ్చమైన హిందూమతం అగ్రవర్ణాలవారి పూజావస్తువు అయింది. హిందూమతంలోని శైవ, వైష్ణవ, సాంప్రదాయాలు వాటి భిన్నత్వాన్ని కోల్పోయి ఒకసమానత్వాన్ని, ఏకత్వాన్ని పెంపొందించుకొన్నాయి. ఇదిన్నీ ఇండోనీసియాలోని 'బలి' ద్వీపం వంటి ఏ ఒకటి రెండు ద్వీపాలలోమాత్రమే నిర్దిష్టంగా నిలువగలిగినవి. హిందూ మతంలోని అంతర్భేధాలు నశించడంవల్ల 'బలి' ద్వీపంలో నేటికిని శివ, కేశవులకు, బుద్ధునికికూడా సమానమైన పూజలు జరుగుతూవుంటాయి.

మత, సాహిత్య వృత్తులలోనేగాక, కళాక్షేత్రాలలో కూడా కొత్తమార్పులు పొడసూపాయి.

ఆదిలో భారతీయుల భరతనాట్యం ఇండోనీసియాలో కళాశిఖరాలను అందుకొన్నది. కాని రాను రాను ఆభరతవిద్య, రాజులకు, జమిందారులకు మాత్రమే ఒక విలాసవస్తువు అయిపోయింది. ఇప్పటికిని అది రాజప్రాసాదాలలో మాత్రమే నిలిచివుంది. పండుగరోజులలోను, పర్వదినాలలోను రాజమందిరాలలో జరుగు భరతనాట్య ప్రదర్శనాలకు జనసామాన్యం తండోప తండాలుగా వచ్చి ఆనందిస్తూవుంటారు. సాధారణ ప్రజలకు ఈ విద్య అందుబాటులో లేకపోయినా వారు భరతవిద్యలోని కళా సౌందర్యాన్ని ఆనందించగలరు. ఆయా ప్రదర్శనాల సమయంలో వారు ఏకాగ్రచిత్తులై ఉత్తమ కళావిన్యాసాలను ఉగ్గడిస్తూ వుంటారు. లోటుపాట్లను విమర్శిస్తూ వుంటారు.

భరతనాట్యం అందుబాటులో లేకపోయినా, సాధారణ ప్రజలు భరతనాట్యానికి వికృతరూపమైన కొన్ని నాట్యభణుతులు మాత్రం కొన్నిటిని ప్రదర్శిస్తువుంటారు. అందు భరతవిద్య పోకడలకంటె ఇండోనీసియన్ కళాఛాయలే మిక్కుటంగా వుంటాయి.

వీటితో భాగవత రామాయణ గాధలను ప్రదర్శించే నాట్యాలు విశేషంగా వుంటాయి. తరువాత వీరిగాధలుకూడా పెక్కు-బున్నాయి.

భారతీయులనుండి గ్రహించిన తోలుబొమ్మలు జానపదాలు (బొబ్బిలికథలవంటివి) కూడా ఇండోనీసియనులు కొన్నిటిని ప్రదర్శిస్తూ వుంటారు. వీటికి సంబంధించిన సాహిత్యం మారినదిగాని, లయ, ఘటుతులుమాత్రం భారతీయులే నేటికిని.

హిందూ, బౌద్ధమతాలు భారతీయకళలు ఇడోనీసియా జాతీయమత సంస్కృతులతో మిళితమై ఒక వినూత్న వ్యవస్థాన రూపం ఏర్పడినపిమ్మట ఇండోనీసియాలో 'ముస్లిమ్' మతం ప్రవేశించింది.

అరబ్ వణిజులు రాజ్యాధికారాలను సంపాదించి సైనికశక్తులను అండగాగొని ఇండోనిసియాలో ముస్లిమ్ మతప్రచారానికి పూనుకొన్నారు. స్వదేశరాజులను 'సుల్తానులు' గా మార్చారు. వారితోడ్పాటుతో ప్రజలనందరను ముస్లిములుగా మార్చివేశారు. ఇండోనీసియానంతటా ముస్లిమ్‌మతస్థాపన చేయగలిగారు. గాని, వీరు, ఇండోనీసియనుల ఆచారవ్యవహారాదులను, విశ్వాసాలను మాత్రం మార్చలేకపోయారు. ముస్లిమ్‌మతం బలవంతంగారుద్దబడినది కావడంవల్ల అది పైపైననే ఆవేశించగలిగినదిగాని, ఇండోనీసియన్ మత, సాంఘికజీవనంలో లోతులకంటా చొరుచుకొని పోలేకపోయింది.

ఒకవిధంగాచూస్తే నేటికిని ఇండోనీసియాలో హిందూమతానికి ముస్లిమ్‌మేలిముసుగు వేసినట్లుగా కనబడుతుంది. కావడానికి ఇండోనీసియా జనాభాలో నూటికి 90 మంది ముస్లిమ్‌లేఅయినా వారిలో ఈనాడు అరేబియాదేశంలోగాని, కనీసం భారతదేశంలోగాని వున్న మహమ్మదీయులుపాటించే ఆచారవ్యవహారాలు కానరావు. కొన్నికొన్ని ప్రదేశాలలో మశీదులే లేవు. మహమ్మద్‌ను, శివకేశవులను కొన్నికొన్ని తావులలో బేధమేలేదు.

స్త్రీలలో 'ఘోషా' పద్ధతి అమలులోలేదు. స్త్రీలు సర్వ స్వతంత్రులుగా చరిస్తూవుంటారు. వివాహితలైనవారుగూడా విచ్చల విడిగావిందులకు, వేడుకలకు వెళ్ళుతూనేవుంటారు. పేరుకుమాత్రం ముస్లిమ్‌నామధేయాలు వున్నాయికాని, గృహాలలో పాటించేవి మాత్రం ఇండోనీసియన్ జాతీయాచారాలే.

కొరాణ్ గ్రంథాన్ని మతగ్రంధంగా ఎంచుతారు. కాని, ఈనాటికీ ఇండోనీసియాలో భాగవత రామాయణాలకు వున్న పూజ్యత అపారము, అనంతమును. తోలుబొమ్మలవంటి ప్రదర్శ నాలలోనే గాక, నాటక సినిమాలలోకూడా నూటికి తొంభై కధలు భారత రామాయణ గాధలకు సంబంధించినవై వుంటాయి. పాండమధ్యముడు 'అర్జునుడు వీరశౌర్యాది విశేషగుణాలకు ఆదర్శ పురుషుడని ఇండోనీసియనులు భావిస్తారు. అసలు క్షాత్రధర్మానికి అతడు మూలపురుషుడని ఇండోనీసియనులు విశ్వసిస్తారు.

సుమారు ఆరుశతాబ్దాలు గతించి, హిందూ బౌద్ధమతాలు ఇండొనీసియన్ జాతీయమతంతో ఐక్యమై, ఆపైన మహమ్మదీయ మతం విస్తరించినందువల్ల హిందూగాధలు వికృతరూపాన్ని పొంద డమేగాక అవి చిత్రవిచిత్రములైన గాధలుగా అచటనేడు చెప్పుకొం టూవుంటారు. అట్టివాటినివింటే మనకునేడు విచిత్రంగాను వింతగాను కనపడతాయి. వినోదకరములైన గాధలుకొన్ని.

"...జావాను పాలించిన ఒక మహమ్మదీయ చక్రవర్తి సగర్వంగా చెప్పుకొంటాడు — తనపూర్వులు మహాభారతవీరులు అని..."

"...జావారాజాస్థాన పండితుడు 'రంగవరిష్టుడు' ఉద్రేక పూరితంగా వ్రాసాడు — తనప్రభువు పాండవవీరుడు అర్జునుని సంతతివాడు — అని"

"...పాండవశ్రేష్టుడు యుధిష్టురుడు మహమ్మదీయుడుగా మరణించాడు — అని"

—ఇంతేకాదు— నేడు జావాజనపాదాలకుపోయి, ఒకజావ పమణ్ణి అడిగితే అతడు చెబుతాడు. పాండవు లందరు జావాలోనే జన్మించి, పెరిగి, పెద్దవారయిరిని. అందుచేతనే తామంతా పాండవుల సంతతివారమని చెప్పుకొని గర్విస్తూ వుంటారు. మహాభారతానికి తమకు పరంపరాగత సంబంధమున్నట్లు వారుచెప్పు కుంటారు.

—ఇట్టివే పెక్కు మహాభారతవీరులు గాధలు చిత్రవిచిత్ర ములైన రీతులలో జావాజనపద వాఙ్మయంలో గానం చేయబ డుతూవుంటాయి.

మతము, విజ్ఞానము, కళలు- మొదలైన వాటినిగాక - ఇండొనీసియనుల దైనందిన జీవితవిశేషాలను జీవనపద్ధతులను ఆచార వ్యవహారాలనుస్వభావవిశేషాలనుగురించి కొంచెం తెలుసుకొందాము.

ఇండొనీసియనులు సాధారణంగా నిష్కపటులు. మాయ, మర్మము ఎరుగనివారు. తృప్తాత్ములు. 'నిత్యసంతోషులు' అత్యాశ లేనివారు, మతైకజీవులు. సాధువులె అయినా ఆగ్రహం కలిగిన దంటే రుద్రరూపులౌతారు. తారతమ్యభేదాన్ని పాటించకుండా, క్రిందుమీదు చూచుకోకుండా నరహత్యచేయడానికి వారు ఏమాత్ర మూ వెనుదీయరు.

శ్రీమంతులగువారికి పేదవారికి మధ్య విశేషమైన అంతరాన్ని పాటించరుగాని ఇరువురూకూడా శ్రమజీవనాన్నే అభిమానిస్తారు. ధనికులు మనలోవలెనే ఆలయాలు, సత్రాలు, మఠాలు—మొద లైన వాటినినిర్మించి ధర్మకార్యాలను చేయడానికి ఉత్సాహ పడతారు.

జ్యోతిషం, మంత్రతంత్రాలు, శుభాశుభ విశ్వాసాలు, పచ్చ బొట్లు పొడిపించుకొనడం మొదలైనవంటే వారికి మిక్కిలిమక్కువ పురుషులు, స్త్రీలుకూడా వర్తక, వ్యవసాయాదులలో సమానంగా పాటుపడతారు. శీతలోదకస్నానం ప్రతిదినము వారు నిత్యకర్మగా పాటిస్తారు. చాపలు, మాంసం వారికి నిత్యాహారం. మిరప,

నీరుల్లి, కూరగాయలు, ఆకుకూరలుకూడ ఎక్కువగా వాడుక చేస్తారు.

స్త్రీ పురుషులిరువురు అంగీలు ధరిస్తారు. తొడలుదిగని జుబ్బాలు, లుంగీలుకూడా వీరు ధరిస్తారు. స్త్రీలు మాత్రం ఒక రుమాలును మెడలోపల్లెవాటుగా వేసుకొంటారు. పురుషులు టోపీలు ధరిస్తారు. కాళ్లకు జోళ్లనుమాత్రం ముఖ్యంగా ధరిస్తారు స్త్రీలకు ఆభరణాలమీద అంతమక్కువ ఉన్నట్లు కనపడదు. కాని, విలువగల ఆభరణాలను చేయించుకొని శుభదినాలలో మాత్రమే వాటిని అలంకరించుకొంటారు. పువ్వులంటే వారికి పరమప్రీతి.

తరుచుగా 'తేనీరు' పానీయాన్ని వారు త్రాగుతూవుంటారు తాంబూల చర్వణంకూడా వారిలో లేకపోలేదు. సుగంధ ద్రవ్యాలను ఇండోనీసియనులు వాడుకచేసినట్లుగా ప్రపంచములో మరియొకజాతి వాడుకచేయదు. జాజికాయ, జాపత్రి మొదలైన వాటితో వారు పెక్కురకాల మసాళాలను మధురములైనవి తయారుచేస్తారు.

ఇక ఇండోనీసియనుల వృత్తులు, చేతిపనులు మొదలైనవి ముఖ్యముగా ఇవి:

వ్యవసాయం, వర్తకం, బట్టలు నేయటం, రంగులు వేయటం, చేపలుపట్టడం చేతిపనులలో ప్రధానంగా పేర్కొనదగిన వెదురుతో చేసే వివిధములైన వస్తువులు. వెదురుచెట్టు వీరికి కల్పవృక్షం అని చెప్పవచ్చు: దానితో వారుచేసే పలురకములైన సామాగ్రి ముచ్చట కొలుపుతూవుంటుంది. వెదురువలెనే కర్రపరిశ్రమకూడా ఇచట ప్రధానమైనది. కర్రమీద నగిషీపనులు, మట్టిపాత్రలు, శిల్పము, వెండి, బంగారము, దంతపుపనులు మొదలైనవి గృహపరిశ్రమలుగా ఇండోనీసియా అంతటా వ్యాపించివున్నాయి.

ఇండొనేసియనులకు 'నృత్యం' అంటె మిక్కిలిమక్కువ. ప్రతివారునాట్యం చేయగలిగివుంటారు. బాలబాలికలకు పసితనము నుండి నృత్యాన్ని నేర్పుతారు.—ఇక పందెములు, జూదాలుకూడా వారికి వినోదక్రీడలుగా మరికొన్ని వున్నవి.—

అన్నిటికంటె ఇండొనేసియనులకు బాగా అబ్బినవిద్య సముద్రసంచారం. సముద్రంలో ఈదటమన్నా, చేపలను వేటాడటమన్నా వారికి ఒక వినోదవ్యాపారంగా వుంటుంది. సముద్ర పవనాలనుబట్టి వీరుదేశంయొక్క వాతావరణస్థితిని భావిస్థితిగతులను తృటిలో తెలుసుకొనగలుగుతారు. పడవలనుచేయడము వాటితో సముద్రసంచారం చేయడము-వీరిలో అజన్మసిద్ధమైన ప్రావీణ్యంలా కనబడుతుంది. దేశమంతా దీవులమయంగనుక ఇదివారికి సహజంగా అబ్బివుండడంలో ఆశ్చర్యంలేదు.

ఇండొనేసియనులు నిరాడంబరులు. ఆశయాలలో పవిత్రత, ఆచరణలో ఒక ధర్మనిరతి ప్రస్ఫుటంగా కనబడుతూ వుంటుంది. వారి వివాహాదికాలను, సాంసారిక జీవనాన్ని గమనిస్తే ఈ సత్యం ద్యోతకమవుతుంది.—

పరిణయపద్ధతులలోను, తదితరదైవిక జీవనవిధానంలోను-ఒక దీవిలోని ప్రజలకు వేరొక దీవిలోనిప్రజలకు కొన్నికొన్ని వ్యత్యాసాలు కూడ లేకపోలేదు.—

జావాబాల్యవివాహాలు ఆచరణలో వున్నాయి. ఆడబిడ్డకు పది, పదమూడేండ్ల మధ్యకాలంలోనే పెళ్లిళ్లు చేస్తారు. వధూవరుల విషయంలో తల్లిదండ్రులు ఒక నిశ్చయానికి వచ్చిన తరువాతనే ఆవధూవరులు ఒండొరులను చూచుకొంటారు. చూపులు అయిన తరువాత వధువు తనకు నచ్చినదోలేదో వరుడుచెప్పాలి. వివాహానికి పెళ్లికొడుకు ఆమోదమే ప్రధానంగా పరిగణింప బడుతుంది. పెళ్లికుమార్తె అంగీకారంకూడా స్వీకరించడం అక్కడక్కడ లేకపోలేదు.—

వధూవరుల సమ్మతిని కైకొన్న తరువాత 'ప్రధానం' జరుగుతుంది. ఆ సమయంలో పెళ్లికొడుకువారు పెళ్లికుమార్తెకు అభరణాలను బహూకరిస్తారు. పెళ్లికుమార్తె తరఫువారు అందరికీ విందుచేస్తారు. మరికొన్నాళ్ళకు మగపెళ్లివారు ఆడపెళ్లివారికి కన్యాశుల్కం సమర్పిస్తారు. ఈ కన్యాశుల్కాన్ని జావా భాషలో 'తుంబాసన్' అంటారు. కన్యాశుల్కం అనగా కేవలము ధన రూపంగా వుండదు. వెండివస్తువులు; పాత్రసామగ్రి, కర్రసామాను, బట్టలు, బియ్యము మొదలగునవి శుల్కవస్తువులుగా వుంటాయి. కన్నెకుమార్తమేగాక, ఆమె 'తల్లి' కి కూడా ప్రత్యేకంగా కొన్ని బహుమతుల నీయడం తప్పనిసరియైన ఆచారంగా పరిగణింపబడు తుంది. కన్యాశుల్కం వధువు గృహానికి చేరిననాడు వధూవరుల తల్లిదండ్రులు గ్రామంలోని బంధువులకు, హితులకు స్వయం పాకాలు పంపి చెరివకనాడు తమ ఇండ్లకు విందుభోజనానికి పిలుస్తారు. యీ విందుభోజనాలు అమితమైన వ్యయమూలకాలై వుంటాయి.

ఇక పెళ్లితంతుకూడా ముచ్చటగా వుంటుంది. పెళ్లికిపూర్వ పురాత్రి వధూవరులు జాగరణంచేయాలి. ఏమాత్రం నిద్రపోయినా తమ జీవితంలో ఏదోఒక ఆపదకల్గుతుందని వారు నమ్ముతారు. మరునాడు మత విధులననురించి మసీదులో పెళ్లిజరుగుతుంది. ఆడంబరంగా అలంకరించుకొని మేళతాళాలతో, బంధువులతో పెళ్లికొడుకు మసీదుకు వెడతాడు. కాని అక్కడికి పెళ్లికుమార్తెమాత్రం రాదు. ఆమెకు బదులుగా ఆమె గురువుగారు మాత్రం వస్తాడు. మసీదులో తంతుజరిగిన తరువాత పెళ్లికొడుకు ఇంటికివెళ్లి, దుస్తులుమార్చి, పెళ్లికూతురు ఇంటికి బాజాలతో, బంధువులతో వెడతాడు. అక్కడ పెళ్లికూతురు అతనికొరకు వేచివుంటుంది. ఆమె విలువైన దుస్తులను ధరించి వుంటుంది. వక్షస్థలము చేతులు, అనాచ్ఛాదితాలయి వుంటాయి. ఆభాగానికి అంతా ఆమె 'బోరె' అను పచ్చని గంధాన్ని వ్రాసుకొంటుంది. గసగసాల నూనెలో పసుపుగుండను కలిపిచేసిన ముద్దకు జావా వాసులు

'బోరె' అంటారు. పవిత్రకార్యాలను ఆచరించేసమయంలో కటి సీమకు పైభాగాన్ని అంతనూ అనాచ్ఛాదితంగా వుంచుకొని 'బోరె' పూనుకొని పసుపుపచ్చగా వుండాలని జావా స్త్రీలలో ఒక ఆచారం—

'పెళ్లి' ముక్తసరిగా మతకర్తల ఆధ్వర్యాన, వంశమర్యాద లను అనుసరించి జరుగుతుంది. పెళ్లిఅయినతరువాత కులపెద్దవచ్చి వరుని పూర్వుల ప్రభావాన్ని గురించి, వధువు పూర్వీకుల ఘనతను గురించి ఇరువురకు తెలియజేసి, వారివంశానికి కీర్తి తెచ్చునట్లుగా దాంపత్య జీవితయాత్రను సాగించమని ప్రబోధిస్తాడు:

పెళ్లికూతురు తనభర్తకు తానుపాదదాసీగా వుండబోతున్నానని ప్రతిజ్ఞతీసుకుంటూ వున్నానని చెప్పడానికి గుర్తుగా అతనికాళ్ళు కడుగుతుంది. అనంతరం పెళ్లికొడుకు పెళ్లికూతురును తనబసకు తీసుకు వెడతాడు. అచట పెద్దవిందు జరుగుతుంది. మరునాడు వధువుఇంట విందుజరుగుతుంది. మూడవరోజున ఆ నూతన దంప తులు - అప్పటికప్పుడే వారికి స్వగృహం ఏర్పడివుంటే అక్కడ కాపురం పెడతారు. పేదతనంవల్ల వేరేయిల్లు లేకపోయినట్లయితే వరుడు వధువు పుట్టింటికే వస్తాడు. వేరే ఒకగృహాన్ని నిర్మించుకొన్న తరువాత అక్కడికి తరలిపోతారు. పెళ్లినాటికి పెళ్లికూతురువలె నే పెళ్లికొడుకుకూడా పదహారు, పద్ధెనిమిది ఏండ్లకంటే ఎక్కువ వయస్సువుండదు.—ఇదీవారి పరిణయపద్ధతి.

ఇక—జావానీయుల సంసారిక జీవనంలో పురుషునికంటె స్త్రీలకే ఎక్కువ బాధ్యతలువుటాయి, స్త్రీ అక్షరాల గృహానికి 'రాణి'లాగే ఎక్కువ అధికారాలను పొందివుంటుంది. తోటల లోను, తదితర వర్తక వ్యాపారాదులలోను స్త్రీ పురుషులిద్దరు సమానంగా కష్టపడి పనిచేస్తారు. స్త్రీధనం అంటూ జావా స్త్రీ లకు కొంత ఆస్తివుంటుందిగాని, వారసత్వపు హక్కుమాత్రం పురుషునిదే ఐవుంటుంది. —

జావాలోని పర్వతారణ్య ప్రదేశాలలో వుండేప్రజలుమిక్కిలి ధైర్యవంతులు.—కొన్ని ఏండ్లుగా యిచట ప్రజలు నివశించి, పరిశోధనలు చేస్తూవున్నా ఇంకా వన్యమృగాలబాధ వారికి పూర్తిగా తొలగిపోలేదు. —జావానీయులు జంతుప్రియులు. ప్రతిఇంటిలోను కోళ్లు, లేళ్లు మొదలైనవాటిని పెంచుతూ వుంటారు. సంఘమర్యాదలను, పెద్దలయెడ గౌరవాన్ని మతవిశ్వాసములను పాటించడంలో జావానీయులు విశేషమైన శ్రద్ధచూపుతూ వుంటారు. — గృహనిర్మాణంకూడా వారిలో ఒకకళాకౌశలాన్ని వెదజల్లుతూవుంటుంది. ప్రాగణంలేని గృహాన్ని నిర్మించడం ఒకదోషంగా వీరు ఇటీవలివరకు పాటించేవారు. కాని, దారిద్ర హేతువుచేత అది నేడు సన్నగిలిపోయింది.

జావాలోని పట్టణాలు, పల్లెలు ఒకశిల్పశోభతో రామణీయవతను పరుపుతూ వుంటే—బోర్నియో దీవిలోని కుటీరాలు చిత్రమైన రీతులలో నిర్మించబడుతూ వుంటాయి.—

ఒక్కొక్క కుటీరంలో నలభై, యాభైకుటుంబాలు కాపురం చేయవచ్చు. అంత సువిశాలమై వుంటాయి. ఆకుటీరాలు ఒక్కొక్క కుటీరం ఒక్కొక్క గ్రామంలో కనబడుతూ వుంటుంది. ఇట్టి పెద్ద పెద్ద కుటీరాలు సుమారు యాభై, అరవైవరకూ వుంటాయి. అదే ఒక పల్లెఅవుతూ వుంటుంది.

బోర్నియోవాసులు మంచి యుద్ధకుశలులు. మిక్కిలి పాటుపడి పనిచేసే స్వభావము కలవారు. లేమి అనేది లేనట్లుగా వారు జీవితానందాన్ని అనుభవిస్తూవుంటారు. వారు నిత్యసంతోషులు. వారిభాషలో చలోక్తులు ఎక్కువట! అందుచేతనే వారుమాట్లాడుతూవుంటే చాలాసరదాగా వుంటుందని అంటారు.

అక్కడ స్త్రీపురుషు లిద్దరూ కష్టజీవులు ప్రొద్దు పొడవకముందే స్త్రీలు ఏటికిపోయి స్నానంచేసి, పెద్దపెద్ద వెదురుగొట్టాల నిండా నీళ్లుతెచ్చుకుంటారు. ఆ వెదురుగొట్టాలే వారికి కడవలుగా

ఉపయోగపడతాయి. అట్టిగొట్టాలతోనే వీరు వంటకూడా చేస్తారు. పురుషులు బాగా ప్రొద్దుపొడిచినగాని నిద్రమంచంమీద నుంచి లేవరు. సూర్యోదయమంటే ఎలావుంటుందో ఇచటి మగ వారిలో చాలామందికి తెలియదంటే అతిశయోక్తికాదు. పొగా కుతో తయారుచేసిన చుట్టలను కాల్చడం వీరిలో సాధారణమైన అలవాటు. వ్యవసాయికములైన పనులకు తప్ప స్త్రీలు ఇళ్లువదలి బయటకుపోరు. గృహకృత్యాల్లో భారమైనపని ధాన్యం దంప డం. వారు ఏరోజుకారోజు ధాన్యం దంపి బియ్యం తయారుచేసు కొంటారు.

బోర్నియోవాసులు అంత భాగ్యవంతులుకారు. డాబుసరి దుస్తులను ధరించకపోయినా, ఉన్నంతమటుకు వారు శుచిగాను, శుభ్రంగాను వుంటారు. మగవానికి ప్రాయంవచ్చి స్త్రీ లపేక్ష కలిగినదంటే వానికి వలపుకుదిరిన యువతితో పరిచయం చేసుకొన డానికి తగిన అవకాశాలను పెద్దలే కలుగజేస్తారు. చెప్పదగిన పరి ణయ పద్ధతులుగాని, కఠిన సాంఘిక నియమాదులుగాని వీరిలో లేవు.

పిల్లకువుండే చెవితమ్మి పొడవునుబట్టి ఆమెకు సంఘంలో స్థానం నిర్ణయించబడుతుంది. బాలికలకు పిన్ననాటనుండి నృత్య విద్యలో చక్కని ప్రావీణ్యం అలవరుస్తారు పెద్దలు. పచ్చబొట్లంటే ఈ ద్వీపవాసులకు మిక్కిలిప్రీతి. పదహారేండ్ల బాలికలు సాధార ణంగా ఆపచ్చబొట్లు లేనివారుండరు. సాధారణంగా యువకులకు పెండ్లిమాటలను నిశ్చయించేది కన్యలే...!

బోర్నియోవాసులు వృధకాయులు. పడవలను నడపడంలో ప్రవీణులు. చేతిపరిశ్రమలలో వారికి చిత్రమైన చతురతవున్నది. పౌరుషానికి వారినిచెప్పి మరివొకరిని చెప్పాలి.

బోర్నియో ప్రజలలో ఒకవింత ఆచారంవుంది. పక్షిని శకునముడుగుతారువారు. ఒకగ్రద్దబొమ్మనుచేసి ఒకప్రత్యేకమైన చోటవుంచుతారు. వారుచేయబోయే ప్రతికార్యానికీ ముందుగా ఆబొమ్మపక్షివద్దకువెళ్లి ప్రశ్నఅడిగి, మరీపనికి పూనుకుంటారు.

వీరిలో మహమ్మదీయ మతావలంబకులైన వారిలో 'పందిని ప్రశ్నఅడగడం' అనే మరియొక విచిత్రమైన ఆచారంవుంది.

ఏ రెండు గ్రామాల వారైనా కలహానికి దొరకొన వలెనన్నా లేక శాంతిని నెలకొల్పు కొనవలెనన్నా వీరుఒక ఆచారాన్ని పాటిస్తారు. ఒక పందినిపట్టి దానికాళ్లుకట్టి, గ్రామపెద్దయింటికి తీసుకపోతారు. ఆకులపెద్ద ఆపందిద్వారా 'జోస్యం' తెలుసు కుంటాడు.-ఆజోస్యంతెలుసుకొనడానికికూడా ఒకకర్మకాండవుంది.

ముందుగా దైవప్రార్థన, పిమ్మట అగ్నిప్రతిష్ఠాపన జరిపి ఆనిప్పు బాగా రగులుకొన్నతరువాత దానిలో అపందిని పడవేసి బాగాకాల్చేస్తారు. అట్లా అగ్నిప్రజ్వలింపజేయడంలో నరులకు సురలకు నడుమవుండే ప్రసంగోపకరణం పొగ అనివారు భావిస్తారు కాలిన పందినిచీల్చి, దాని 'యాకృత్'ను (లీవర్) తీసి, దాని స్వరూపాన్ని పరీక్షించి గ్రామపెద్ద ప్రశ్నలకు ప్రత్యుత్తరాలు ఇస్తాడు. అతడు చెప్పిన మాటలన్నీ పంది ఆత్మద్వారా వస్తూ వున్న దేవవాక్కులని అవే భవిష్య నిర్ణాయకాలని వారు విశ్వ సిస్తారు. ఈ తతంగం తరుచు అచట జరుగుతూవుంటుంది. దృష్టి దోషం తగులకుండా వుండాలని వారు ప్రతికుటీరానికి ఒక దిష్టి బొమ్మను తగిలిస్తారు. 'మతం' అంటేవీరికి ఓ పెద్ద ప్రతిబంధకం కాదు. హిందువులైనా ముస్లిమ్‌లయినా వారు కలిసిమెలిసి వుంటారు.

బోర్నియో 'సిడైక్సు' జాతిఅనే ఒక ప్రత్యేక ఆదిమనివా సులువున్నారు. వీరిలో గర్భాధానం జరిగిన తరువాతనే వివాహ కాండ జరుగుతుంది.

1879 లో ఈ దీవిలో నాలుశాసనాలు, బంగారు విష్ణు విగ్రహాలు కనుగొనబడ్డాయి. ఆ శాసనాలలో బ్రాహ్మణమత ప్రభావంబాగా కనిపిస్తూవుంది. మనసగరుడు, భగీరథుడు ఆ శాసనాలలో పేర్కొనబడ్డారు. ఆ శాసనాలకాలం క్రీస్తుశకం నాల్గవ శతాబ్దం అని నిర్ధారించబడింది. బోర్నియోలో 'కోమ్‌బెగ్'

అవే గుహలు అతిప్రాచీన నాగరికతా భాండాలుగా చెప్పబడు తున్నాయి. ఆ గుహలలో శివ, గణేశ, నంది, బ్రహ్మ, స్కంధ, మహాకాళివిగ్రహాలు కనుగొనబడినాయి.

*   *   *

'మతం' అంటే వున్న పట్టుదలకు 'బలి' ద్వీపాన్ని చెప్పి మరి యొకదానిని పేర్కొనాలి. శతాబ్దులకు పూర్వం ఇచట హిందూ మతం వ్యాపించినా, బలిద్వీపవాసులు నేటికినీ హిందూమతాన్ని అనుసరిస్తున్నారు.

సమీపంలోని జావా, మదుర దీవులలోని ప్రజలు ఎంతో కాలానికి పూర్వమే హిందూమతాన్ని వీడి ముస్లిమ్ మతాన్ని చేపట్టి నా, బలి ద్వీపవాసులుమాత్రం హిందూమతాన్ని వీడలేదు. వారిని ఇస్లాంమతానికిగాని, క్రిస్తవమతానికి మార్చవలెననే ప్రయత్నా లన్నీ వ్యర్థములయినాయి.

హిందూదేశంవలెనే బలిద్వీపంలోకూడా వర్ణాశ్రమ ధర్మమూ, బ్రాహ్మణ ప్రాబల్యమూవుంది. బ్రాహ్మణకన్య తక్కువ జాతిపురుషుణ్ణి పెండ్లిఆడితే, ఆమెనుచంపి, అతణ్ణి బస్తాలలోకుక్కి నడిసముద్రంలో పారవేయడం మొన్న మొన్నటివరకూ ఆచారమై వుండేది. కాని ఇటీవల ఇదిబాగా నిరోధింపబడింది. ఇటీవలవరకు బలిద్వీపంలో సహగమనాచారం కూడావుండేది. కాని ఇదికూడా నిషేధింపబడింది. అయినా అటనట సహగమనాలు నేటికిని జరుగుతూ వుండకపోలేదు. బలిద్వీపంలో బ్రాహ్మణులకు తక్కువ కులాల స్త్రీలను వివాహమాడే హక్కు నేటికినీ వుంది. బలిద్వీప వాసులు భారతదేశంలోని హిందువులవలెనే, ఉపవాసవ్రతాలు, పూజాపురస్కారాలు చేస్తూవుంటారు. గోమయాన్ని మనవలెనే పరమపవిత్రంగా ఎంచుతారు. పంచగవ్యాలు అచట పరమపవిత్రంగా ఎంచబడుతాయి.

గోమాంసంగాని, మహిషమాంసంగాని వారుతినరుగాని-బలి ద్వీపంలోని బ్రాహ్మణులుకూడా నిరభ్యంతరంగా పందిమాంసం

తింటారు. ఇచటశివపూజ హెచ్చు. శక్తి, దుర్గ, కాళి అనేనామంతో శివునిభార్య అచట పూజలను అందుతూవుంది. ఇంతేకాక, విఘ్నేశ్వరుడు, దత్తాత్రేయుడు, ఆంజనేయుడు మొదలయిన చిల్లర దేవతలకుకూడా బలిద్వీపంలో ఆలయాలు వున్నాయి. అర్చనలున్నూ సాగుతున్నాయి.

బలిద్వీపానికి తూర్పునవున్న లంబక్ దీవిలో 'సాసక్' జాతీయులనే మహమ్మదీయ మతావలంబులున్నారు. కాని వారికి తమ మతమునందు అంత ఎక్కువ పట్టింపులేదు. వుండవలసినన్ని మసీదులుకూడా వారికిలేవు. సున్నితి చేయించుకొనడము, పందిమాంసము తినకుండా వుండటము-అనేరెండేవారు మహమ్మదీయులుగా ఆచరించే విధులు. బలిద్వీపవాసులకు గోమాంసభక్షణము ఘోరపాపకృత్యమైతే - లంబక్ ద్వీపవాసులకు అదిమిక్కిలి వరణీయమైనదైవుంది. లంబక్ ద్వీవిలో బలిద్వీపవాసుల ప్రాబల్యంలో వుండే పరిపాలనవుంది. అయినా బలిద్వీపవాసులు లంబక్ ద్వీపవాసులను చాలానీచంగా పరిగణిస్తూ వుంటారు.

బలిద్వీపప్రభువుల అనుమతిలేనిదే లంబక్ దీవిలోని 'సాసక్' జాతీయుడు గుర్రాన్ని ఎక్కడానికికూడా ఒకనాడు వీలులేకుండా వుండేదంటే - బలిద్వీపవాసుల అధికార ప్రియత్వం, రాజసము అర్థమవుతాయి. బలిద్వీపవాసులు ధైర్యవంతులు. పురుషులు స్త్రీలు కూడా శూరులు. ధీరులును. యుద్ధనైపుణ్యం వీరికి ఉన్నంతగా ఇండోనేసియాలోని వేరొక ద్వీపవాసులకు లేదు.—

వీనిలో ముస్లిము సుల్తానులు పెక్కుయుద్ధాలుచేసినకూడా వీరిని నిర్జించలేక పోయారు. డచ్ వారుకూడా వీరిని ఓపట్టాన ఓడించలేక పోయారు. 1903 సంవత్సరంనాటికి కాని బలిద్వీపరాజుల్ని డచ్ వారు జయించలేదనే చెప్పవలసి వుంటుంది. 1908 లో జరిగిన భయంకరమైన యుద్ధం లోబలిద్వీపరాజులు ఓడిపోయారు. రాజులతోపాటు రాణులుకూడా యుద్ధభూమికివెళ్లి యుద్ధంచేశారు. కడప్రాణంవుండు దాకా యుద్ధంచేసి, ఇక ఓలిమి తప్పనప్పుడు శత్రుసైనికుల తుపాకీకొనకు తగిలించే బాకులమీదపడి అసువులను

కోల్పోయినా రేగాని—డచ్ వారికి కైవశం కాలేదు. —స్త్రీలు సైతము అట్టిస్వాతంత్ర్య ప్రియత్వం కలవారు. ఇండోనేసియాలో నేటికిని బలిద్వీపములంటే వున్నగౌరవము, భయము అచ్చెరువు గొల్పుతూవుంటుంది. 'బలి' ద్వీపమంటే మనబలిచక్రవర్తి జన్మించిన తావుఅని వారు సగర్వంగా చెప్పుకుంటారు...! బౌద్ధ, శైవ మతాలు ఇచట చక్కని మేళవింపు పొందాయి. 'బుద్ధుడు' శివుని చిన్నారితమ్ముడని బలిద్వీపవాసుల నమ్మిక.

* * *

ఇండోనేసియనులు ధర్మనిరతులు. విశేషమైన మర్యాద కలవారు. అతిధి అభ్యాగతులయెడ ఆదరము గలవారు. న్యాయ ధర్మాలు ఆనాట చెట్టాపట్టా వేసుకొని వర్ధిల్లినవని చెప్పె పెక్కు కధలు ఇండోనేసియాలో వాడుకలోవున్నాయి. అట్టివాటిలో ఇది ఒకటి.

"...క్రీస్తుశకం 674 సంవత్సరంలో జావాప్రజలు 'శిమ' అనే ఒకస్త్రీని తమపాలకురాలిగా ఎంచుకున్నారు. ధర్మపాలనకు ఆమెకీర్తిగన్నది. ఆమెరాజ్యంలో దొంగతనమనేదిలేదు. రోడ్డు మీద ఒకరు జారవిడచిన వస్తువులుకూడా ఇతరులచే తాకబడకుండ వుండేవి...అరిబ్బురాజు 'తాజ' అనునతడు ఇదివిని అదియెంతవరకు సత్యమో పరీక్షించి చూడాలనుకొన్నాడు. అనుకొని, ఒక బంగారపు మూటను ఆమెరాజ్యపు సరిహద్దుల్లో పడవేయించాడు. ప్రజలు ఆబంగారపు మూటనుచూచి ఆదెసకే పోవడం మానివేశారు. తప్పనిసరిగా ఆదిక్కున పోవలసి వచ్చినపుడు ఆమూటను తప్పించుకొని పోవుతూండేవారు. ...ఆబంగారపుమూట ఆవిధంగా ఆపొలిమేరలో మూడుసంవత్సరాలపాటు అలాగేవుంది. మర కొన్నాళ్ళకు 'శిమ' రాణికొడుకు ఆవేపు వెళ్ళినప్పుడు ఆమూటనుచూచి, తీసిదాచుకున్నాడు. ఈ వార్తవిని శిమరాణి చాలాఆగ్రహించింది. వెంటనే ఆమెఅతనికి మరణదండన విధించాలని తీర్మానించింది. కాని ఆమెనిర్ణయానికి మంత్రులు ఆమోదించలేదు. అందు మీద ఆమె 'ఆతప్పిదానకి కారణం అతనికాళ్ళుకనుక, వాటిని

ఖండించాలని నిర్ణయించింది. మంత్రులు అందరున్నా అంగీకరించ లేదు. అప్పుడు ఆమె అతని బొటనకాలి వ్రేళ్ళను తెగగోయించి, ధర్మపరిపాలనలో తన ఆ ధర్మాన్ని నెలకొల్పింది....'తాజీ' రాజు ఆమె ధర్మదీక్షకు ఆశ్చర్యపొంది, ఆమెరాజ్యమునకు, పరిపాలనకు హానిచేయరాదని, నిశ్చయించి, వెనుదిరిగిపోయాడు...'
—ఇట్లే ధర్మనిరతికొరకు ఇండొనీసియనులు ప్రదర్శించిన త్యాగ, ధైర్య, సాహసాలను కీర్తించె పెక్కు గాథలు నేటికిని ఇండొనీసియాలో మిక్కిలి ప్రచారంలో వున్నాయి.

ఇట్టికథలేగాక ఇండొనీసియనుల సౌహార్ద్ర స్నేహ వాత్సల్యాలను వివరిస్తూ పాశ్చాత్య సంచారులు కొందరు వ్రాసివున్నారు. వాటిలో ఇవికొన్ని:—

ఇండొనీసియాలో మొట్టమొదటగా కాలుపెట్టిన పోర్చుగీస్ వర్తకుడు 'అల్బుకర్కు' అనునతడు 1511 సంవత్సరంలో ఇలా వ్రాశాడు. "సుమత్రాదీవిలోని మినాంకబావూ ప్రాంతంలోని ప్రజలు మిక్కిలి ఉత్తములు మంచినడతగలవారు. సత్యచరితులు ఇంట్లో వున్నప్పుడు, బయట ఉన్నప్పుడూకూడా వారు మంచి శుచి శుభ్రతలను పాటిస్తారు. బయటకువస్తే వారు 'చాజూన్' అను ఒక వదులైన అంగీని ధరిస్తారు. 'క్రీసే' అను ఒక విధమైన బాకు ఎప్పుడూవారిమొలలో వుంటుంది.

1577 సంవత్సరంలో ఫ్రాన్సిస్ డ్రేక్ సుమత్రాదీవికి ఆగమించి, అచటి ప్రజలనుగురించి "అపరిచితులయెడ ఆదరంగలవారు, దయగలవారు అని మా అనుభవాలనుబట్టి చెబుతున్నాము" అని వ్రాశాడు.

1879 సంవత్సరంలో ఇసబెల్లాబర్డ్, ఇండొనీసియను లను గురించి ఇలా పేర్కొన్నాడు. "నాగరికతా ప్రసిద్ధిగల జాతులలో ఇండొనీసియనులనుకూడా చేర్చవచ్చు. వారిగృహ నిర్మాణం కళాకౌశల్యానికి, ప్రశాంతికి ఆటపట్టుగ వుంటుంది. వారి వస్త్రధారణ ఒక ప్రత్యేకకళ. కొన్ని కళలలోను చేతిపనులలోను వారిచాతుర్

గరిమ ఆశ్చర్యము గొల్పుతుంది. కొన్ని శతాబ్దుల పర్యంతమునుండివస్తు వున్న పరిపాలనాక్రమము, భూమి విభజనపద్ధతి, నాకాధర్మాలు మొదలైనవాటిని, సమీక్షించి నట్లయితే అవి ఎంతటి విశాలాదర్శ ప్రపూరితము లైనవో, ఎట్టినాగరికతకు ఆటపట్టు అయినవో విశద మవుతుంది...”

పాశ్చాత్య ప్రముఖులు ఇండోనీసియన్ ప్రజల నాగరికతను గురించి. ఔన్నత్యాన్ని గూర్చి పల్కినపల్కులు ఇట్టివే లెక్కకు మించినవన్ని వున్నవి.

కళాప్రపుల్లమై, ధర్మప్రభ సమానమై విశేషించి త్యాగ, సత్యశౌచాలు ముక్కారు పంటపండిన ఇండోనీసియాలో కాల క్రమాన పాశ్చాత్య కుటిలరాజనీతి కాలు పెట్టింది. అమాయకులు, అనుపమ ప్రేమాకాంక్షకులు అగు ప్రజలను మాయోపాయాలతో వంచించి పాశ్చాత్య వాణిజ్యవర్తకులు వారిరక్తాన్ని పీల్చుతూ చేవదెర సాగినారు. దయా, ధర్మాలు, ఆదర అభిమానాలు నిష్కపట చిత్తముతో పరులను గౌరవించే ప్రాచ్యనైతిక నీతియే పాశ్చాత్య పశుప్రీతికి బలి అయిపోయింది. సద్వర్తనులు సహన స్వరూపులు అను ప్రాచ్య ప్రజలు త్యాగాన్నే వరించి, ధర్మాన్నే ఆలంబనంగా గైకొని, స్వాతంత్ర్య తపస్సు చేస్తున్నారు నేడు.

ఇండియా, ఇండోనీసియా దేశాలు రెండున్ను ఒక్కసారిగా మహోచ్చదశకు వచ్చి, మహా వైభవాలను అనుభవించినవి. కొంచెం ఇంచుమించుగా ఈ రెండు దేశాలున్ను పాశ్చాత్యులకు లోబడి పోయినవి. ఒకేవిధమైన సమస్యలతో రెండు దేశాలున్ను కష్టనిష్టా లనుభవిస్తున్నవి. ఈ రెండు దేశాలున్నూ ఒకే ఒక పరమలక్ష్యం కోసం పోరాడుతున్నవి.

ఇదే స్వాతంత్ర్య ! ప్రాచ్యఖండ ప్రాభవం !!

# ఇండొనీసియాలో పాశ్చాత్య జాతుల ప్రవేశం

ప్రాచ్యఖండపు బంగారు భూములలో పాశ్చాత్య జాతులు ప్రవేశించడము, ప్రవేశించి ఆదేశముల నన్నిటిని ఆక్రమించుకొనడము ఆక్రమించుకొని వాటికి రారాజులు కావడము మొదలైన గాధలన సమీక్షించినట్లయితే అవిఅన్నీ విధ్వంసకరములని కాలవై పరీత్యములని తోచకమానదు...! —అన్నాడు సుప్రసిద్ధ దేశ భక్తుడు, సైనిక వ్యాపార కుశలుడు అయినమేజర్ జనరల్ 'బోసు.'

—వర్తక ప్రాబల్యాల కొరకు పిమ్మట సామ్రాజ్యాధిపత్యాలకొరకు పాశ్చాత్య క్రైస్తవజాతులు ఇండొనీసియాలో చరించిన విధానాలను, ఆచరించిన దుర్ణయాలను పరికించినట్లయితే 'బోసు' మహాశయుని పల్కులు అతిశయోక్తులుగా కనుపట్టవు; అవి అక్షర సత్యములు.

పాశ్చాత్య క్రైస్తవ జాతుల చరిత్రలో పదిహేనవ శతాబ్ది ప్రవేసిస్తు ఒక ఉజ్వల భవిష్యత్తుకు నాందిపాడింది. 'బొగ్గు, ఇనుము' ఆస్తిపాస్తులుగాగల పాశ్చాత్యులు, 'రొట్టె బట్ట' కొరకు అన్వేషణలకు ఆరంభించిన సంధికాలమది వాణిజ్యమే ప్రధానోపాయనముగా గల పాశ్చాత్య ప్రజలకు ఆనాడు ప్రాచ్యఖండాన్ని గురించి వినవచ్చేకధలు అనేక ఆశలకు రేకెత్తించినవి. "ప్రాచ్య భూములు స్వర్ణభూములని, అచటి వృక్షసంతతికూడ బంగారు పండ్లను ప్రసాదించుననని, వాటిని కోసికొనితెచ్చుకొనడమే ఇక తరువాయి" అని నాడు అనేకకధలు పాశ్చాత్యదేశాలలో ప్రచారంలో వుంటూవుండేవి. ఆ కధలను విని అత్యాశాప్రలోభులై ప్రాశ్చాత్య క్రైస్తవ వణిజులు ప్రాచ్య దేశాలకు పయనించినారు.

అట్టి ప్రయాణాలను ప్రారంభించినవారిలో పోర్చుగల్ దేశస్థులు ప్రప్రథములు. ముమ్ముందుగా భారతదేశంలోను, పిమ్మట తూర్పు ఆసియా దేశాలకు కూడాప్రాకి - వీరు 1521 సంవత్సరంలో ఇండోనీసియాల్లో మొట్టమొదటగా అడుగుపెట్టారు. పోర్చుగీసులు చూపినమార్గాన్ని అనుసరించి 1530 లో ఫ్రేంచి వర్తకులు, 1592 లో డచ్ వణిజులు, 1602 లో ఇంగ్లీషు వ్యాపారులు - ఇండోనీసియాలో ప్రవేశించారు.

సహజోదారులు, సజ్జనులు అయిన ఇండోనీసియనులు ఆయా క్రైస్తవ వణిజులకు ఎట్టిఆటంకాలను కలిగించలేదు సరిగదా, వారిని ఆహ్వానించి ఆదరించారు. పరదేశీయులను పెరవారిగాగాక, సోదరులవలె చూచు స్వభావము ఇండోనీసియనులకు ఆదికాలము నుండి వుంటూవున్న ఒక సల్లక్షణాలంకారం. క్రైస్తవ వర్తకులు గాకపూర్వము ఇండోనీసియనులు - భారతీయులకు, చైనీయులకు, జపానీయులకు, అరబ్బులకు ఆశ్రయమిచ్చి ఆదరించారు.

విజ్ఞానోపాసనయెడల ఇండోనీసియనులకు మక్కువఎక్కువ పరసపర జ్ఞానపోషణ యెడల ఆసక్తిమెండు. 'వ్యాపారము' అనే ఇచ్చి, పుచ్చుకోలుతనాన్ని ఒక ధర్మంగాను, సద్వృత్తిగాను భావించే స్వభావులు ఇండోనీసియనులు. కాగా వారు తమదేశంలో పరదేశస్థులప్రవేశాలకు ఎన్నడును, ఎట్టి అపరాధాలను కలిగించి ఎరుగరు.

ఇండోనీసియనులు స్వతహా వాణిజ్యప్రియులు. భారతభూమి తోను, చైనా, జపాకలతోను, పూర్వకాలంనుండి వాణిజ్య సంబంధాలను నెరపుతూవున్న వారేకావటంవల్ల 'వాణిజ్యం' పేరుతో వచ్చినవారిని గౌరవపురస్సరంగా ఆదరించు సత్స్వభావం వారిలో ఇతోధికంగా పెంపొందింది. దీనికితోడు ఆనాడు ఇండోనీసియనుల ఐశ్వర్యసంపత్తితో - దీటైన వర్తకవ్యాపారాదులను సలుపగల దేశాలు వలసినన్ని లేవు. అందువలన ఇండోనీసియన్ ప్రజలు, రాజులు వాణిజ్యప్రియత్వం పరదేశజులనుగౌరవిస్తూవుండేవారు. నైతిక, ధర్మాలను పడికట్టు రాళ్ళుగాను, సహకారసానుభూతు

లను పరమాశయాలుగాను గలవారి వాణిజ్య ప్రవృత్తికి - పరదేశీయులను అనుమాన వృక్కులతో వీక్షించవలసిన అవసరం అణుమాత్రమున్నా కలిగివుండలేదు. కాని, వారి ఈ నైతికధర్మమే పాశ్చాత్య క్రైస్తవజాతుల పశునీతిచే హీనంగా వంచింపబడింది. స్వార్థకలుషితులైన ఆ క్రైస్తవ వ్యాపారులు తమ కుతంత్ర బీజాలను నాటడానికి, ధర్మసౌచాలు పండిననాటి ఇండోనీసియా మాగాణి భూమి పదునుగా ఉపకరించింది. అనతికాలంలోనే వారి వాణిజ్య విష వృక్షపు వేరులు అచట బాగా పాతుకొన్నాయి.

పాశ్చాత్య క్రైస్తవ వర్తకులకు ఇండోనీసియాలో ఆశ్రయం దొరికి క్రమేపీ అచట అధికారస్థానాన్ని అధిష్టించడానికి అలంబనాలైన అవకాశాలు ఎట్టివి? నాటి ఇండోనీసియా సాంఘిక, ఆర్థిక, రాజకీయపరిస్థితులు ఎట్లున్నవో కొంచెం ఆలోచించి చూచినట్లయితే - క్రైస్తవజాతులచట ఎట్లు బలీయులు కాగలిగినది విశదమవుతుంది.

క్రైస్తవజాతులు కాలిడునాటికి ఇండోనీసియాలో పూర్తిగా మతసహన మొకటి ఏర్పడివుండలేదు. హిందూ, బౌద్ధమతస్థుల నడుమ కలహాలు సర్వసాధారణంగా పొడసూపుతూనే వుండినవి. అధిక సంఖ్యాకులగు ప్రజలు మహమ్మదీయ మతావలంబులు కాకపోలేదుగాని, కొన్నికొని దీవులలో సనాతనులగు హిందూమతస్థులు ముస్లిమ్ మతప్రచారకులపై తిరగబడుతూనే వుండినారు. అట్టివాటిలో చిరకాలమువరకు అశాంతిని ప్రజ్వలించినదీవి బలి; పిమ్మట లంబక్ సహజంగా మతము యెడల భక్తివిశ్వాసాలు కల ఇండోనీసియనులకు ఈ మత మాత్సర్యాలు పొలుమరిస్తూ వుండినందున - ఇండోనీసియా శాంతి పాలిట అవి ఆరని కుంపటులైపోయాయి. అయినా పాశ్చాత్య క్రైస్తవవర్తకులీ మతమాత్సర్యాలను స్వీయోపయోగానికి అంతగా వినియోగించుకొనలేక పోయిరనే చెప్పవలసియున్నది.

రాజకీయంగా ఇండోనీసియా నాడు శక్తివంతంగా లేదు.

స్వర్ణద్వీపులన్నిటి పైనా ఏకచ్ఛత్రాధిపత్యం వహించిన సామ్రాజ్యాలు అంతరించాయి. దీవికొక రాజు రాజ్యపాలన చేస్తున్నాడు. ద్వీపానికొక సుల్తాను అధికారం చెలాయిస్తున్నాడు. అసలే ఆయాసుల్తానులకు వుండిన రాజ్యభాగం చాలాపరిమితమైన దైనా - అతనిక్రింద మరికొందరు సామంతరాజులు, చోటా సుల్తానులూను. అధికారవాంఛ' రాజ్యవిస్తరణాకాంక్ష జనితాలైన అసూయ, అసహనము, ఆయాసుల్తానుల మధ్య రాజ్యంచేస్తున్నది. యుద్ధాలు, కలహాలు వారిమధ్య అతితరుచుగా సంభవిస్తూ వుండినవి.

ఈ చిల్లరరాజుల చిల్లరపరిపాలనలే నాటి ఇండోనేసియా పాలిటి ప్రధాన దౌర్బల్యమై పోయింది !!!

ఆర్థికముగా ఇండోనీసియానాడు పుష్టికరముగానే వుంది. పాడిపంటలకు కొదువలేదు; భూగర్భ సంపత్తికిన్నీ కొరతలేదు. ఇండోనీసియనుల ప్రధాన వృత్తిఅయిన 'వాణిజ్యం' ముమ్మరంగానే సాగుతూవుంది. ఇండోనీసియాలో ఆనాడు ప్రధానులైవుండిన డెమక్, బాంటమ్, ఆఛె, టెర్నేట్, మటారమ్, బాండనీస్, మకస్సార్ - సుల్తానులు ప్రజలలో వాణిజ్యవృత్తులను విశేషంగా పోషిస్తూనే వుండినారు. శ్రీవిజయ, మహోపజిత్ సామ్రాజ్యాల నాటి వలెనే నావికా బలగాన్ని అసుల్తాలు పెంపొందిస్తూనే వుండినారు.

తూర్పుజావాలో డెమక్ సుల్తాను ప్రధాన రాజ్యాధిపతి. జావా ఈశాన్యదిశలోని జావరాష్ట్రపు కొననుండి మధ్యజావా వరకు తూర్పున సురబాయా రేవుపట్టణం మొదలు గ్రిసిక్ రాష్ట్రంవరకు ఇతని పరిపాలన వ్యాపించివుంది. జావా తూర్పుతీరమంతా ఇంత నౌకాబలగం విస్తరించి, మేలు గతితో వాణిజ్యం జరుగుతూవుంది. సుమత్రాలోని పాలెంబాగ్ వరకు డెమక్ రాజ్యాధిపతుల వాణిజ్యం విస్తరించింది.

పశ్చిమజావాలో 'బాంటమ్' సంస్థానం మిక్కిలి ప్రసిద్ధి గన్నది. జావాపశ్చిమతీరానవున్న 'సుందాకల్పా' అనే రేవుస్థలం (నేడు బటేవియా వున్నతావు) ఒక ప్రముఖ వర్తక కేంద్రం. అబ్దుల్లా అంగోగ్ అనునతడు ఈ సంస్థానాధిపతులలో మిక్కిని ప్రఖ్యాతిపడసి - వాణిజ్యాన్ని పెంపొందించాడు. బాంటమ్ సంస్థానం 'మిరియాలు' గంధద్రవ్యాలు మొదలైనవాటి వాణిజ్యానికి ప్రశిద్ధిచెందింది. చైనా, మలయాదేశాలతో ఈ వర్తకం 17 వ శతాబ్దంవరకు కూడా విరివిగా సాగుతూవుండేది.

సుమత్రాదీవిలో 'ఆఛే' రాజ్యం ప్రధానమైనది. సుమత్రాలో ఇతర తావులందుగల చిల్లర సుల్తానులను, అనగా - మినాంకబావూ సుల్తానును, ఇంద్రగిరిరాజును, మలయాద్వీపకల్పంలోని కెడా. పాహాంగ్ రాజ్యాలను, జోహార్ సుల్తానును ఓడించి, 15 వ శతాబ్దాంతానికి 'ఆఛే' సుల్తానులు సుమత్రాదీవిపై మారులేని అధికారాన్ని పాలించగలిగారు. సుమత్రాదీవిలోని మిరియపు వర్తకాన్ని, కెడాసంస్థానంలోని తగరపుగనులను, బాంకా, బిలిటన్ రాష్ట్రాలలోని తగరపు కేంద్రాలను 'ఆఛే' రాజులు బాగా పెంపొందించారు. తగరపు వర్తకంలో ఆఛేరాజ్యంతో పోటీచేయగల దేశం ఆనాడు వేరొకటిలేదు.

టెర్నేట్, మటానమ్ సుల్తానులు జావాలోని ధాన్యపు వర్తకాన్ని, సుగంధద్రవ్యాల వ్యాపారాన్ని విశేషంగా వృద్ధి చేశారు. పండ్లు, కొబ్బరి, ఇనుముకూడా వర్తకంలో ముఖ్యమై వుండినవి.

'బాండ్లనీస్' రాష్ట్రాలు రాజ్యపాలనా విధానంలో నాటికి మహోచ్ఛదశలో వున్నాయి. 'ప్రజారాజ్య' విధానాన్ని అమలుపరచి, ఆరాష్ట్రాలలో 'రిపబ్లిక్' లను స్థాపించి - ప్రపంచానికి ఒక నూతన రాజ్యాంగ విధానాన్ని అదిచూపించినది. పోర్చుగీస్ వర్తకులు వచ్చునాటికే అచట ఈనవ్యరాజ్యతంత్రం అమలులోవుంది. బాండనీస్ ప్రజాస్వామ్యరాష్ట్రాలను నావికాబలగం

ప్రధానమైనది. మొలుకాస్ దీవులనుండి జావాపుత్తరతీరవు కొన వరకు గల విశాల సముద్రంలో ఈ రాష్ట్రప్రజల నౌకలు వీర విహారం చేస్తూవుండినది.

'మకస్సార్' సుల్తానులు కరడుకట్టిన ముస్లిమ్ మతాభిమానులు. ఇతరదీవులలోని సుల్తానులందరు పాశ్చాత్యులచే పరాజితులైనప్పటికీ - మకస్సార్ సుల్తానులు మాత్రం ముస్లిమ్ మతరక్షణకు ఆసాంతరు పాటుపడ్డారు; సర్వత్యాగాలను చేశారు. మకస్సార్ సంస్థాన వాణిజ్యంలో తుత్తునాగము, కలప, సుగంధ ద్రవ్యాలు ప్రధానములైనవి.

— ఇండోనీసియాలో పాశ్చాత్య క్రైస్తవ వర్తకులు ప్రవేశించునాటికి - ఇండోనీసియా సాంఘీక, ఆర్థిక, రాజకీయ స్వరూపం ఇది.— అంతరంగిక విభేదాలు ఎట్లున్నప్పటికి ఇండోనీసియనులు వాణిజ్య ప్రశక్తిలో వీను మిగిలివున్నారు. తగరము, తుత్తినాగము, ఇనుము, బంగారము, వెండి, పండ్లు, కొబ్బరిదినుసులు, ధాన్యము, సుగంధద్రవ్యాలు - మొదలైన వస్తుసంభారంతో ఇండోనీసియనులు చైనా, మలయా, బర్మా, భారతదేశము, జపాన్ మున్నగు దేశములతో వర్తక సంబంధాలను నెరపుతూ ప్రాచ్య ఖండంతో అపూర్వమైన వాణిజ్య సామ్రాజ్యాన్ని నెలకొల్పుకొని పాలించసాగారు.

వాణిజ్య ప్రసక్తిలో తమవలెనే ఉత్సాహంచూపుతూవచ్చిన పాశ్చాత్య వణిజులను ఇండోనీసియనులు సహజమైన ఔదార్యంతో గౌరవించారు. సస్యసమృద్ధి, ఖనిజసంపత్తి గల ఇండోనీసియాను పరికించడంతోనే ఆ క్రైస్తవ వర్తకులకు ఆశలు చిగురింపదొడగినవి. అంకపాంకాలుగా వర్తకాన్ని సాగించుకొనవలెననే ఆశలు వారికి పెరుగజొచ్చాయి...చివరకు ఆఆశలు అత్యాశలు, దురాశలుగా మారిపోయాయి.

అమాయకులు, ధర్మపథగాములు అయిన ఇండోనీసియనుల 'మంచి తనము - పాశ్చాత్య వర్తకులకు మిక్కిలి వినియోగపడినది. ముందుగా ప్రజానీకంలో చేరి చెలిమి చేసుకొన్నారు. పిమ్మట

రాజుల అండజేరి అధికారబలాలను సంపాదించుకొన్నారు. 'క్రొత్త ఒక వింత' వ్యామోహాన్ని కలిగించి ఆతెల్లజాతులవారు ఇండోనేసియన్ ఎర్రజాతిలో ఒకవిధమైన ప్రాబల్యాన్ని అచిరకాలంలోనే ఆర్జించుకొన్నారు.

పోర్చుగీస్ వర్తకులు మున్ముందుగా ఇట్టిచనువును సంపాదించి, సముద్రతీర పట్టణాలలో కొన్ని కేంద్రాలను నెలకొల్పుకొన్నారు. ప్రజల సహకారంతోటి, రాజుల సహాయంతోటి జావాలోని బాంటమ్ నగరప్రాంతంలో కొంత భూవసతి ఆర్జించి - అచట 'వర్తకక్షేమంకొరకు' వాణిజ్యవస్తువుల భద్రతకొరకు కొన్ని గిడ్డంగులను వారు కట్టుకొన్నారు.— ఫిలిప్పయిన్ దీవులలో స్థావరాల్ని సంపాదించిన స్పెయిన్ దేశస్థులు తూర్పుదెసనుండి ఇండోనేసియాలో ప్రవేశించు నాటికి - అనగా 1521 సంవత్సర ప్రాంతానికి - పోర్చుగీస్" వర్తకులు ఇండోనేసియాలో బాగా బలపడిపోయారు.—స్పెయిన్ దేశస్థుల ఆగమనంతో పోర్చుగీస్ వర్తకులకు ఇండోనేసియాలో అంతకు పూర్వమే ఆర్జించుకొన్న తమ ఆధిక్యానికి ఎట్టిమోసము కలుగగలదో అనేభీతి జనించి, ప్రజలలో ఇంకా బలపడవలెనని ప్రయత్నించసాగారు. మతవ్యవహారాలలోను, రాజకీయాలలోను కూడా: వేలుపెట్టి ఇండోనేసియన్లకు సన్నిహితులు కావలెనని పోర్చుగీస్ వర్తకులు తాపత్రయపడ నారంభించారు.— కాని - ఆత్మగౌరవంగల ఇండోనేసియనులకు పాశ్చాత్యుల ప్రవర్తన అంతగా రుచించలేదు.—ఫలితంగా పాశ్చాత్యజాతులను అనుమానంతోను, ఏహ్యభావంతోను వారు చూడమొదలిడినారు. ఇది రాను రాను ఇరుజాతులమధ్య ఒక అగాధాన్ని పెంచివేసింది. చివరకు సంఘర్షణలు, యుద్ధాలు అనివార్యములైనవి. ఇట్టి అసహనపూరితమైన వాతావరణంలో - ఇండోనేసియనుల ఆగ్రహానికి మొట్టమొదటగా గురియైనవారు పోర్చుగీస్ వర్తకులు.

# పోర్చుగీస్ వర్తకుల పతనం

ఇండోనీసియాలో పోర్చుగీస్ వర్తకులు ప్రవేశించి ప్రజలలో సన్నిహితత్వాన్ని పెంచుకుంటూవుంటే - వారిచర్యలను ఇండోనీసియన్ ప్రజలు ఆదిలో అంతగా అనుమానించలేదు. కాని, అరబ్బులు, చైనీయులు మాత్రం వారిని ఆదినుండీ అవిశ్వాసంతోనే చూస్తూవచ్చారు. 'వర్తకం' పేరుతోవచ్చి, 'మత' మనే మంత్రాన్ని ప్రయోగించి, ఇండోనీసియా నంతనూ లోగొనిన అరబ్ జాతీయులకు - తమవలెనే పోర్చుగీసు వారుకూడా ప్రవర్తింపగలరనే భీతి ఆదిలోనే జనించింది.

దీనికి కారణంకూడా లేకపోలేదు. పోర్చుగీస్ దేశస్థులు స్వతహా మతమౌఢ్యం గలవారు. ఐరోపాఖండ రాజకీయాలలో వారికిని, అరబ్బులకును అప్రీతికరమైన పెక్కు సంఘర్షణలు పూర్వంనుండీ జరుగుతూనే వుండినవి. ఆరీతిగానే ఇండోనీసియాలోకూడా 'ముస్లిమ్' మతము, 'క్రైస్తవ' మతము ఇక సంఘర్షణ పడకతప్పదని - అరబ్బులు నిశ్చయించుకొన్నారు. వారి అనుమానం క్రమశః యదార్థమే అయింది

పోర్చుగీస్ జాతులకు క్రైస్తవమతం యెడల అభిమానం మిక్కిలి గాఢమైనది. సైనికబలంతో క్రైస్తవమతాన్ని నిర్బంధంగా వ్యాపింపజేసే 'క్రూసేడ్' తత్వంవారిలో ఆదినుండిన్నీ వున్నది. ముస్లిమ్ జాతులను 'మార్పు' గావించి వారిని వేటాడుతూ, తమ మత వ్యాప్తికై పాటుపడుతూ వుండడం పోర్చుగీస్ వారికి పరిపాటి - ఇండోనీసియాలో కూడా పోర్చుగీస్ వర్తకులు ఇదే ధోరణిని అవలంభించారు. నిర్బంధంగా - ఇండోనీసియన్ ముస్లిములను 'క్రైస్తవ' మతంలోనికి మార్చవలెనని ప్రయత్నించసాగారు.

మతాభిమానులగు ఇండోనీసియన్ ముస్లిములకు పోర్చుగీస్ వర్తకుల చర్యలు తీవ్రమైన ఆగ్రహాన్ని కలిగించినవి. వెంటనేవారు తిరగబడి పోర్చుగీసులను ఎదుర్కొన్నారు.

పోర్చుగీస్ వర్తకులను దుర్మార్గులుగా భావించి ప్రజలు వారితో వర్తకము చేయ మానివేశారు; వర్తకరీత్యానే గాక ఇతరములైన సాంఘిక వ్యవహారాలలో కూడా పోర్చుగీస్‌వారు ప్రజలకు దూరమైనారు. 'టెర్నేట్' సుల్తానులు కొందరు ముస్లిమ్ మత ప్రచారకులద్వారాపోర్చుగీస్ వర్తకుల క్రైస్తవమత ప్రచారాన్ని ఖండించి, దానికిపూర్తిగా విరుగుడుమందు వేశారు.

డెమక్ సుల్తాను, ప్రచారం చేయించడమేగాక, పోర్చుగీస్ వర్తక కేంద్రాలపై తన సైనికబలంతో దండయాత్రలను కూడా నడిపించాడు. తనరాజ్యంలో పోర్చుగీస్ వర్తక కేంద్రాలను దుర్బలంచేసి డెమక్ సుల్తాను తన నౌకాబలాన్ని మలక్కా సుల్తానుకు సహాయార్థం కూడా పంపించాడు. కాని - అప్పటికప్పుడే పోర్చుగీసులు మలక్కాను పూర్తిగా జయించి ఆక్రమించుకొన్నారు. అయితే మలక్కాదీవి మినహా, పోర్చుగీసులకు ఇతర తావులలో ఎట్టిప్రాబల్యమూ లేనందువల్ల వారిసైనికశక్తి ఇండోనీసియను రాజులను ఎదుర్కొని నిలువలేకపోయింది. కాని సుమత్రా దీవిలో మాత్రం పోర్చుగీసువారు కొంతకాలం తమ పూర్వప్రాబల్యాన్ని పునరార్జించడానికి పెనుగులాడారు. సుమత్రాదీవిలోని 'బాటక్' కొండజాతుల వారితో నేస్తము జరిపి, వారితోడ్పాటుతో సుమత్రాదీవిలోని ఆఛేరాజ్యాన్ని కూలద్రోయవలెనని వారు ప్రయత్నించారు. కాని ఇది నిరుపయోగమైనది.

సుమారు నలభైసంవత్సరాలపాటు వర్తకాన్ని నెరపుకొని మతవ్యాపకపు మత్తులోపడి పోర్చుగీసు వర్తకులు యుద్ధాగ్నిగుండంలో చిక్కుకొన్నారు. పోరాటాల మధ్యవర్తకం వెనుకబడింది. దీనికితోడు ప్రజలుకూడా వారితో వ్యాపార సంబంధాలను త్రెంచుకొన్నారు. ఈ సంఘర్షణలతో పది సంవత్సరాల

వాటు పెనుగులాడి పోర్చుగీస్ వర్తకులు పూర్తిగా పతనమైపోయారు. ఇంతలో ఇండోనీసియాలో ఫ్రెంచివర్తకులు కూడా (1530) ప్రవేశించడంతో పోర్చుగీస్ వర్తకులకు పోటీపైపోటీ ప్రాప్తించి వారి ప్రాబల్యం రూపులేకుండా నశించిపోయింది. అర్ధశతాబ్దం దాటకుండానే పోర్చుగీస్ వర్తకుల వాణిజ్య వ్యాపారాదులు పెరగడము; విరగడముకూడా పూర్తి అయిపోయినవి. 1565 సంవత్సరం నాటికి పోర్చుగీసు మతప్రచారం నామరూపాలు లేకుండా పోవడము, 16 వ శతాబ్దాంతానికి పోర్చుగీస్ వాణిజ్య ప్రాబల్యము, స్థానికాధికారముకూడా నామమాత్రావశిష్టమై పోవడము పూర్తిఅయింది. పిమ్మట, ఫ్రెంచి, డచ్, ఆంగ్లవర్తకుల అధికారం పెరగడంతో ఇండోనీసియాలో పోర్చుగీసు వర్తక ప్రసక్తికి అశ్వాశాంతమై పోయింది.



# డచ్చిసామ్రాజ్యస్థాపనము

పదునారవశతాబ్దం పర్యవసిస్తున్న సమయమది. —

"...పశ్చిమజావా సముద్రతీరాన బాంటమ్ నగరతీరస్థలికి ఒక కొయ్యఓడ తెరచాప దించుకుంటూవచ్చి, లంగరువేసింది. పొడుగుపాటి గెడ్డము, ఈకలు కుచ్చులు గలటోపీ, పెద్దకోటు, షుర్వావంటిలాగు ధరించిన ఒక తెల్లజాతివ్యక్తి ఓడనుండి దిగి నాడు. వెంటనే సుమారు నూరుమంది తెల్లవారు ఆయుధపాణులై అతణ్ణి అనుసరించారు. మహోపజిత్ సామ్రాజ్యానికి చెందిన పల్లె ప్రజలు అతనిచుట్టూ వేడుకగా గుమిగూడారు. వారికి అతడు 'వెండినాణెములు'కొన్నింటిని పంచిపెట్టాడు. అంతటఆప్రజలు ఒక ఎత్తుకుర్చీని తీసుకువచ్చి, అతణ్ణి అందులో కూర్చోపెట్టి, ఆగ్రామ వీధులవెంట ఊరేగించినట్లుగా తీసుకువచ్చారు. స్త్రీలు, పిల్లలు అమాయకంగా ఆనందపడుతూ అతడికి స్వాగతమిచ్చారు. అతడు చిరునవ్వుతో వారిని అనునయించి, అవూరు పొలిమేరలోని ఒక మట్టియింటిలో గృహప్రవేశ మయ్యాడు..."

ప్రపంచపర్యటనం చేస్తూ, ఆయాదేశాలలోగల విశేష వృత్తాంతాలను తెలుసుకుంటూ వచ్చిన డచ్ యాత్రీకుడు జాన్ పీటర్సు అతడు 1599 సంవత్సరంలో అతడు జావాలో కాలుపెట్టిన నాటివుదంతాన్ని ఇండోనీసియా చరిత్ర ఈపైవిధంగా వర్ణిస్తూవుంది.

పదిహేడవ శతాబ్దంలో ఐరోపియా దేశాల వాణిజ్య ప్రశస్తిలో హాలెండుదేశం అగ్రస్థానాన్ని ఆక్రమించి వుండినది.

వర్తకవ్యాపారములోనేగాక నావికాబలంలోకూడా ఆనాడు హాలెండు ఇతరదేశాలకంటె మిన్నగా వుండేది. వాణిజ్యవిస్తరణా కాంక్షతో పోర్చుగీసువారు, బ్రిటిషువారు, ఫ్రెంచివారు. ప్రాచ్య

దేశాలకుపయనమై పోతుండడముచూచి పోలెండుకూడా ఒకవుద్యోగిని ప్రాచ్యదేశాల భోగట్టాను తెలుసుకొని రమ్మనమని ముందుగా పంపించింది. ప్రభుత్వ పనుపున వచ్చిన జాన్ పీటర్సు, ఇండోనీసియాలోదిగి, తన పనిని చక్కగానే నిర్వహించాడు.— ఇండోనీసియన్ గ్రామీణులతో కలిసిపోయి, అతడు ఆదేశంలోగల విశేషాల నన్నిటిని సమీకరించాడు. ఒక సంవత్సరంకూడా తిరగకుండా అతడు ఆస్వర్ణద్వీపాల సంపత్తిని గురించి ఒకదీర్ఘమైన నివేదికను తయారుచేసి మిరియాలు, ధనియాలు వంటి సుగంధ ద్రవ్యాలేకాక, వరి, చెరుకు, తగరము, బంగారము, వెండి మొదలైనవి అచట లభిస్తాయని, కోకో. సింకోనా, టీ, రబ్బరు మొదలైన వాటిని పుష్కలంగా పండించుకొన వచ్చునని, వలసినంత భోగ్యంకూడా అచట దొరుకుతుందని వివరిస్తూ తన ప్రభుత్వానికి అతడు తెలియజేసాడు.

వర్తక సామ్రాజ్యాన్ని వృద్ధిచేసుకొనవలెననే ఆకాంక్షతో వున్న ఆనాటి డచ్ వాణిజ్య ప్రభువులకు పీటర్సు నివేదిక ఎనలేని ఆశలను రేకెత్తించింది. వెంటనే "డచ్ ఈస్టుఇండియా కంపెనీ" అను పేరుతో ఒక వర్తక సంఘాన్ని నెలకొల్పి దానికి ఆయుధ సైన్యబలగాలను సమకూర్చి ఇండోనీసియాకు వారు పంపించారు. ఆకంపెనీకి నాయకత్వం వహించిన హౌట్ మన్ అనునతడు 1602 సంవత్సరంనాటికి ఇండోనీసియాకు వాణిజ్య సంచారంతో అరుదెంచాడు. పీటర్సు సలహాతో అతడు బాంటమ్ నగర శివారులలో 'డచ్ ఈస్టుఇండియా కంపెనీ'కి ఒక వర్తకకేంద్రాన్ని నెలకొల్పాడు.

డచ్ వణిజులు ఇండోనీసియాలో అడుగుపెట్టినది లగాయితు సర్వసర్వత్రా వారికి సుముఖమైన పరిస్థితులే ఎదురైనవి. ఇతర యూరోపియన్ జాతులకు వలెనే డచ్ వారికికూడా ఇండోనీసియనులు ఆతిధ్యమిచ్చారు; కాని అందులోకూడా డచ్ వారికి కొంత అధికమైన పాలేలభించింది. దీనికి కారణంకూడా లేకపోలేదు. మత, సాంఘిక, వ్యాపార, రాజకీయ పరిస్థితులలో

పోర్చుగీసువారివలన ఇండొనీసియనులు విసిగి వేసారి వున్నారు. ఎట్లయినా పోర్చుగీసు వారిని అణిచి వేయవలెననే కోరికతో ఇండో నీసియనులు డచ్ వారిని అందుకుబాగా వినియోగపరుచుకొనవలయు నని ఆశించారు. కాగా డచ్ వారిని ఇండోనీసియనులు కొంచెం అధికమైన ఆదరంతో ఆహ్వానించి వారికి సమస్తసౌకర్యాలను కలుగజేశారు. ఫలితంగా డచ్ వర్తకులు ఇండోనీసియా అంతటా చక్కని వర్తక సంబంధాలను నెలకొల్పుకొని బలపడ సాగినారు.

బాంటమ్ నగరంచెంత ఒక గిడ్డంగిని, వర్తక కేంద్రాలను నిర్మించుకొన్న తరువాత, ఆ ప్రాంతీయ ప్రజల మంచితనాన్ని అవకాశంగా తీసి కొని - జాన్ పీటర్సు "ఇండొనీసియాను ఆక్ర మించుకొనవలెననే తనచివరవాంఛితాన్ని ఆచరణరూపానఅనువదించు కొనడం ఆరంభించాడు. మొట్టమొదలుగా - తగిన గిడ్డంగులలోని సామానుల భద్రతకొరకు - తన 'డచ్ వర్తకులు తదితర సేవకుల క్షేమముకొరకు' అను నెపముతో సైన్యాల అవసరము వున్నదని వెంటనే హాలెండునుండి ఒక సైనికదళాన్ని దిగుమతి చేయించు కొన్నాడు. పిమ్మట ప్రాంతీయ రాజకీయాలలో ప్రవేశించి ఒక విధమైన ఆధిక్యతను ఆర్జించాడు. 'వర్తకపు ఒడంబడికలు' అను పేరుతో ప్రజలతో నేగాక, ప్రాంతీయ సుల్తానులతో సంబంధాలను పెంచుకొన నారంభించాడు. స్వదేశసుల్తానులతో వ్యవహరించడం ఆరంభమైనవెంటనే - జాన్ పీటర్సుకు - కొన్ని నూతనావకాశాలు లభించాయి.

అంతఃకలహాలతోను, పారపొచ్చాలతోను ఒకరిపైవేరొకరు కక్షలు సాధించుకొన వలెనని ఆశిస్తూవుండిన స్వదేశసుల్తానుల పీటర్సుయొక్క సహాయము, అతని సైన్యముయొక్క ఉపయోగము మిక్కిలి ఉపయోగించగలదనే ఆశలు రేకెత్తసాగినవి. స్వదేశ సుల్తానుల అభిప్రాయాలను గమనించిన పీటర్సుకు కూడా, తన కోర్కెలను ఈడేర్చుకొను అవకాశం లభించినదనే ఆశలు పొలుమరించాయి. ఇట్టి స్వార్థాశయాలలో సుల్తానులు, పీటర్సు

సన్నిహితులై వ్యూహాలను పన్నుకొన నారంభించారు. ఒకరితో ఒకరు పోరాడుకొనడం ప్రారంభించారు.

ఆయాసంఘర్షణలలో పాల్గొంటూ, తనకు ప్రయోజనం సిద్ధించునను నమ్మకం కలిగిన పక్షాన్ని వహిస్తూ జాన్‌పీటర్సు 1602 1619 సంవత్సరాల మధ్యకాలంలో, అనగా పదిహేడేండ్ల వ్యవధిలో జావాలోని అత్యధిక భాగానికి అధిపతిగా మారిపోయాడు. స్వదేశరాజులనుండి అధికారాలను దత్తంచేసుకొనడమే గాక, వారివారి వాణిజ్య ప్రయోజనాలను కూడా గుత్తగొన్నాడు.

ముందుగా 'బాండనీస్ ప్రజాస్వామ్యరాజ్యాలను ఓండించి భాండాదీవులను లాగొన్నాడు. పిమ్మట జావాలోని 'మటారమ్' సుల్తానును పదభ్రష్టుణిచేసి అతని రాజ్యాన్ని ఆక్రమించాడు. కొన్నిదీవులు, జావాలోని ఒకరాజ్యభాగము భుక్తమైనవని తెలిసిన వెంటనే హాలెండులోని డచ్‌రాజులను 'ఇండోనీసియాలో' తమ రాజ్యపరిపాలనను ఒక ముద్రవేయవలెననే ఆశ ఇనుమడించింది. వెంటనే 1918 సంవత్సరంలో హాలెండు రాజధాని నగరమైన 'ఆమ్‌స్టర్‌డమ్' లో 'డచ్ తూర్పు ఇండియా కంపెనీ' డైరెక్టర్లు సమావేశమై, డచ్‌రాజుల తోడ్పాటుతో ఒక గవర్నర్ జనరల్‌ను నియమించే అధికారాన్ని పొంది జాక్‌పీటర్సునే ఇండోనీసియాలోని డచ్‌దీవులపై 'గవర్నర్ జనరల్' గా నియోగించారు.

పీటర్సు ఈ నూతనపదవిని పాతగాగొని తన కర్తవ్యాన్ని ద్విగుణీకృతంగా పాలించాడు.

ముందుగా పశ్చిమజావాలోని 'జాకార్తా' ను జయించి దానికి 1619 మార్చి 12 వ తేదీని దానికి 'బటేవియా, అని నామకరణంచేశాడు. 'బటేవియా' ను డచ్ సామ్రాజ్యప్రభుత్వానికి ప్రధానపీఠం చేసికొని అటనుండి ఇండోనీసియా నలుదెసలా విజృంభించి, డచ్ సామ్రాజ్యాన్ని విస్తరింప జేయాలని అతడు ఉద్యమించాడు.

'మొలుకాస్' లోని ప్రజలలో డచ్ వణిజులకు తంత్రాల వలన కలిగిన ఆందోళనను పురస్కరించుకొని పీటర్సు వారిపై దండెత్తసాగాడు. కాని, అనుకొన్నంత సులువుగా ఆదీవులను అతడాక్రమించుకొనలేక పోయాడు. అందువల్ల అతడు వేరొక కుతంత్రాన్ని పన్నినాడు. మొలుకాస్ దీవిలోని ప్రజలకు కెరామ్ హాల్మహెరా దీవులలోని పెగాన్, కొండజాతులకు చిరకాలంనుండి వుంటూవున్న వైరాన్ని గమనించి, ఆకొండజాతులద్వారా మొలుకాస్ ప్రజలను, సుల్తానును ఓడించవలెనని పీటర్సు ప్రయత్నించినాడు. కొండజాతులను చేరదీసి, వారికి క్రైస్తవమత, బోధ కావించి, వారినందరిని తనవైపు తిప్పుకొని వారిద్వారా మొలుకాస్ సుల్తానుపై దండెత్తినాడు. 1655—1660 మధ్య రెండుసార్లు యుద్ధాలు జరిపి చివరకు పీటర్సు ఆమొలుకాస్ దీవులను పూర్తిగా ఆక్రమించాడు. దీనితో పీటర్సు ఆశలు చాలావరకు ఫలించినవి. జావాదీవిలోని పశ్చిమభాగము, పరిసములోని కొన్ని దీవులు డచ్ అధికారానికి లొంగిపోయాయి. జావాదీవిలోని తూర్పుభాగమునందు గలచిన్నచిన్న సుల్తానులుకూడా పీటర్సుతో వర్తకపు టొడంబడికలు చేసుకొని అతనికి సన్నిహితులుగా నూ, బృత్యులుగా నూ మారిపోయారు. అందువల్ల జావాదీవియందంతటా పీటర్సుమాటకు ఎదురులేని పరిస్థితులు ఏర్పడినవి. డచ్ రాజ్యాధికారానికి అంకురార్పణమై, అన్నివిధములా అది చేవదేరసాగింది.

డచ్ వణిజులు, జాన్ పీటర్సు ఆధిపత్యంలో ఇట్లు ఇండోనీసియాలో రాజ్యాధికారాన్ని పెంపొందించుకుంటూ వుండడం ఇతర యూరోపియన్ జాతులకు కన్నుకుట్టింది. అందువల్ల వారున్నూ కొన్నికొన్ని సమయాలలో డచ్ వారితో సంఘర్షణలకు పాల్పడక తప్పలేదు.

డచ్ వారికంటెముందుగానే ఇండోనీసియాలో ఫ్రెంచివారు, పోర్చుగీసువారు, స్పెయిన్ వారు, ఇంగ్లీషువారు అడుగుపెట్టారు. ఇంతమంది యూరపియన్ జాతులవారు "వాణిజ్యం" అనే ఒకేఒక ఆశయంతో ఇండోనీసియాలో ప్రవేశించడంవల్ల వారిలోవారికి

పోటాపోటీలు, స్పర్థలు ఏర్పడటం సహజం. యీ పోటాపోటీలవల్ల ఆదిలో ఇండోనేసియన్ వణిజులే అత్యధికంగా ప్రయోజనాలు పొందుతూ వుండేవారు. కాని యూరపియన్ జాతులవారు ఒండొరులతో కలహాలకు దిగడంవల్లను, ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్కరు బలపడి ఆ ప్రాంతంలోని వర్తకాన్ని అంతను వారే గుత్తగొనయత్నించడంవల్లను స్వదేశజులలాభాలు కొంతకాలానికే తరిగిపోయాయి. కాని ఈ ప్రాంతీయప్రాబల్యాలను ఆర్జించవలెననే ఉద్యమంలో యూరపియన్ జాతుల మధ్య సాయుధసంఘర్షణలు బలంగానే పొటమరించాయి.

బాంటమ్ప్రాంతంలో పోర్చుగీస్ వర్తకులు ఆదిలో బాగా బలపడిపోయారు. వారి వాణిజ్యాన్ని అణచివేసినకాని తమరూక మారదనే అభిప్రాయంతో డచ్ వారు ఇంగ్లీషువారితో 'ఒండొరులు సహాయంచేసికొను' ఒకఒడంబడికను చేసికొనవలెనని ప్రయత్నించారు. అలా ఒకరికొకరు తోడ్పడి ఇద్దరూకలిసి పోర్చుగీస్ వారిని అణచివేసినపిదప వర్తకాన్ని ఇరువురు సమానంగా పంచుకొని బాగుపడవచ్చుననికూడా డచ్ వారు ఇంగ్లీషువారికి బోధచేశారు. కాని ఇంగ్లీషువారు డచ్ వారి 'స్నేహపుటొడంబడిక'కు కలిసిరాలేదు. కారణం? డచ్ వారికి పోర్చుగీస్ వారికినడుమ తీవ్రమైన మనస్పర్థలే వున్నవి కనుక వారు ఎట్లయినను పోరాడుకొనక తప్పరని అలా పోరాడుకొని ఇరువురు పతనమై పోయినట్లయితే ఇరువురి వర్తక ప్రయోజనాలను తామే దఖలుపరుచుకొనవచ్చునని అంతట తమకు రెండు బలమైన కక్షలపోటీ తనంతటతానే నశించగలదని ఇంగ్లీషువారు చాలా తెలివిగా దూరమాలోచించి డచ్ వారి ఒడంబడిక యత్నాలను త్రోసిపుచ్చారు.

కాని ఇంగ్లీషువారి తోడ్పాటు లభింపనందున డచ్ వారు పోర్చుగీసువారితో పోరాటంజరుప సాహసించలేదు. అందువల్ల ఇంగ్లీషువారికి వర్తకరంగంలో పోర్చుగీసు, డచ్ వర్తకుల పోటీ యథాలాపంగానే ఎక్కువగాసాగింది. కాగా ఇంగ్లీషువారు ఎట్టకేలకు డచ్ వారితో చేతులుకలుపక తప్పలేదు. ఇంగ్లీషువారు డచ్

వారు కలియడంవల్ల పోర్చుగీస్‌వారు పతనంకావడానికి ఎంతో కాలం పట్టలేదు. 1615 నాటికే అంతంతమాత్రంగావున్న పోర్చుగీసువర్తకులు డచ్, ఇంగ్లీషువర్తకుల సంయుక్త సైన్యబలిమికి తాళలేక వీడిపోయారు.

పోర్చుగీసువారిని అణిచివేసినపిదప ఇంగ్లీషువారు, డచ్‌వారు సమానంగా లాభాలుపంచుకొంటూ రెండుమూడేండ్లకాలం వర్తకం జరుపుకొన్నారు. కానివారిరువురిమధ్య అభిప్రాయభేదాలుఅంకురించి ఒండొరులపై కత్తులుదూసుకొన్నారు. కాని అటు 'లండన్' నగరంలో 'బ్రిటిష్, హాలెండు' ప్రతినిధులమధ్య ఒక ఒడంబడిక జరుగడంవల్ల ఇటు ఇండొనీసియాలోని ఇరుదేశాలవర్తకులు శాంతించి తమతమ వర్తకాలను కొనసాగించుకొనసాగినారు.

అయినా ఇరువర్గాలమధ్య కక్షలు అంతంకాలేదు. వాణిజ్యంలో పోటీ యథాప్రకారంగానే వుంటున్నది. పైగా డచ్చి వణిజులు స్వదేశరాజులను ఓడిస్తూ కొంత భూభాగాన్నికూడా ఆర్జించడం మొదలుపెట్టారు. స్వదేశరాజులతో తరుచు యుద్ధాలుచేస్తూ వుండినసమయంలో అప్పుడప్పుడు ఇంగ్లీషువర్తకుల తోడ్పాటును కొందరు స్వదేశసుల్తానులు కోరుతూవుండడం జరుగుతూవుండేది. కాని ఇంగ్లీషువర్తకులు స్వదేశరాజులతో అంతగా సంబంధాలను పెంచుకొనలేదు.

కాని డచ్చివర్తకులు స్వదేశసుల్తానులతో పోరుతూవుండిన ఒకానొకసందర్భంలో 'అంబోయినా' వద్దనున్న డచ్చిసైనిక పటాలాన్ని చంపివేయడానికిగాను ఇంగ్లీషువారు కుట్రసన్నుతున్నారనే ఒక నెపంమోపి, డచ్చిసైన్యాలు బటేవియాసమీపంలోవున్న ఒక ఇంగ్లీషుసైనికదళాన్ని చిత్రవధచేశాయి. అందువల్ల ఇంగ్లీషువారికి డచ్చివారికినడుమ వెంటనే మరొక తీవ్రమైన యుద్ధం బ్రద్దలైంది. ఈ యుద్ధంలో ఇంగ్లీషుసైన్యాలు హీనంగా పరాజయమందటంవల్ల డచ్చివారిప్రాబల్యానికి అడ్డంఅనేది లేకుండాపోయింది. జావాదీవిలో

కొంతబలంగలిగిన పోర్చుగీసువారు ఇంగ్లీషువారు పరాజయం పొంద టంవల్ల డచ్చివారి అధికారం చరచరా నలుగడలా వ్యాపించి పోయింది.

పోర్చుగీసు, ఇంగ్లీషువర్తకులు దెబ్బతినినప్పటికిని ఫ్రెంచి, స్పెయిన్ జాతులవారు ఇండోనీసియాలో లేకపోలేదు. కాని వున్నను లేనివారివలెనే వుండిపోయారు. ఫ్రెంచివర్తకులకు భారతదేశంలో సర్వమూ అపజయాకరం కావడంవల్ల వారు ఇండోనీసియాలో రాణించలేకపోయారు. స్పెయిన్ దేశస్థులకు మొదటినుండి ఇండోనీసియాలోని వర్తకంయెడల అంతగా మమకారం ఏర్పడివుండలేదు.

పోర్చుగీస్, ఇంగ్లీషువర్తకులు పరాజితులుకావడము; ఫ్రెంచి స్పెయినుదేశస్థులు నామమాత్రులు కావడమువలన డచ్చివణిజులకు ఇండోనీసియాలో వాణిజ్యరాజ్య విస్తరణోద్యమం నల్లేరుపై బండి వతుగా నడువజొచ్చినది. కాని అంతలోనే వారికి 'చైనీయవర్తకుల' వలన మోసంవాటిల్లగల చిహ్నాలు గోచరించాయి.

డచ్చికేంద్రమైన బటేవియాకు చుట్టూ చైనీయులువిశేషంగా నివసిస్తున్నారు. ఇండోనీసియాలో యూరపియనులుకాలు పెట్టుటకు పూర్వమే చైనీయులు అచట నెలకొనివున్నారు. వర్తకపుటాశీలు తప్ప వారికి అన్యదురాశలు ఎన్నడునువుండివుండలేదు. ఒకవిధంగా వారు ఇండోనీసియనులతో కలిసిమెలిసి వాణిజ్యప్రశక్తిని పెంపొందించుకొంటున్నారు. వాణిజ్యమే ప్రధానాశయంగాగల చైనీయుల ఉనికి డచ్చివారికి కన్నెర్రకలిగించింది. అప్పటికప్పుడే జావాలో కొందరు సుల్తానులను ఓడించి రాజ్యభాగాలను ఆర్జించడము పోర్చుగీస్, ఇంగ్లీషువర్తకులను అణిచివేసి వర్తకములో అధికప్రాబల్యాన్ని కైవసంచేసివుండడమువలన డచ్చివర్తకుల ఉధృతికి పట్టపగ్గాలు లేకపోయినవి; వారిదౌష్ట్యానికి పారం లేకపోయినది.

అంతట ఒకనాటి అర్ధరాత్రివేళ డచ్ సైనిక పటాలాలు బటేవియా చుట్టూవుండిన పరిసర గ్రామాలల్లోని చైనీయ ప్రజల నందరను చిత్రవధచేయ నారంభించారు. భయంకరమైన ఈ హత్యా

కొండ ఫలితంగా అచట నివసిస్తూవుండిన చైనీయులందరూ మరణించారు. కాని, కొందరు సమీపంలోవున్న పర్వతాలలోనికి పారిపోయి, అచటగల జావానీయులతో కలిసిపోయారు.—

జావాలో వర్తకం పేరిట, సుల్తానులతో జరుపుతూవుండిన యుద్ధాలపేరిట డచ్చివర్తకులు చేస్తూవుండిన కౄరకృత్యాలకు ఉగ్రులై కొందరు జావా ప్రజలు, ప్రతీకారవాంఛతో తమతమ నెలవులను విడిచి, కొండగుహలలో దాగుకొని, డచ్చివారిపై ప్రతీకారయత్నాలు చేస్తూ వుండినారు. అట్టిజావానీయులతో ఈ చైనీయ కాందిసీకులు చేతులుకలిపి ఆకొండగుహలనుండియే డచ్చివారిపై ప్రతీకారోద్యమాలను నడుప సమకట్టినారు.

ఇట్టి తరుణంలో ఈ ప్రతీకారకులకు ఒక నూతనావకాశం లభించింది.

డచ్చివారు ఇండోనీసియాకు వర్తకం చేసికొనడానికి హాలెండునుండి వచ్చి, పోతూ వుండినప్పటికిని తమవెంట డచ్చి స్త్రీలను ఎన్నడును ఇండోనీసియాకు తీసుకొని వచ్చువారుకారు. అందువల్ల ఇండోనీసియాకు వచ్చిన డచ్చివారు "దేశీయవనితల"ను వివాహం చేసుకొంటూవుండేవారు. ఇట్లు వివాహాది కార్యాలు చేసికొనడానికి డచ్చి వాణిజ్యసంస్థ పెత్తందారులు స్వయంగా తమసేవకులను ప్రోత్సహించేవారు. ఇట్టి వివాహాలు జరుగుతూ వుండటంవల్ల "యూరేషియన్" జాతి ఒకటి ప్రత్యేకంగా బయలుదేరింది. ఈ సంకర సంతానంయెడల డచ్చి అధికారులకు వాత్సల్యం లేకపోగా అదొక విధమైన తృణీకారభావం పెంపొందడంవలన యూరోషియనులకు డచ్చిఅధికారులపై వైరుధ్యం పెరగసాగింది. వీలైనప్పుడల్లా వీరు డచ్చిఅధికారులపై తిరగబడుతూ వుండేవారు, డచ్చి అధికారులపై ఏవైనను కుట్రలు పన్నవలెనంటే స్వదేశసుల్తానులు, తదితర జాతులవారు ఈ యూరోషియనులను బాగుగా వినియోగించుకొంటూ వుండేవారు. అందుచేత ఈ "సంకర జాతి"ని డచ్చి అధికారులు కడుహీనంగాచూస్తూ వారిని పలు బాములకు లోనుచేస్తూ వుండేవారు. దీనిఫలితంగా ఆ "యూరేషి

యనులు" ఒక సంఘంగా సమకూడి డచ్చివారిపై పగసాధించుకొనవలెనని సంకల్పించి, ప్రయత్నాలను చేస్తూవుండిన సమయంలో వారికి కొండగుహాలలో తలదాచుకొంటూ ప్రతీకార యత్నాలను చేస్తూవుండిన చైనీయులు, జావానీయుల తోడ్పాటు లభించింది.

అంతట వీరందరూకలిసి 'పీటర్ ఎబర్ పీల్డు' అనునతని నాయకత్వాన 'బటేవియా' లో వుండిన తెల్లవారి నందరిని చంపివేయాలని ఒక 'వ్యూహం' పన్నుకొన్నారు. కాని, ఈలోగా ఒక 'బటేయవిన్ యువతి' నమ్మకద్రోహం చేయడంవలన వారి యత్నాలన్నీ భగ్నమైనాయి, తిరుగుబాటుదారుల నందరను పట్టుకొని డచ్చిఅధికారులు చంపివేశారు. 'ఎబర్ఫీల్డు' పుర్రెను పాత బటేవియాలో ఒకచోట సిమెంటుతో అతికివుంచారు. ఈ నాటి వరకు ఆపుర్రెఅచట గోడమీద కనుపిస్తూవుంటుంది....!

ఈ సంఘటనవలన చైనీయుల ప్రతిఘటనమేగాక, డచ్చి ప్రతికూలురగు యూరేషియనుల తిరుగుబాటు కూడా సమసిపోయింది. దీనితో డచ్చివారికి ఇండోనీసియాలోగల ఇతర జాతుల ప్రతికూలశక్తులన్నీ పతనమై పోయాయి. ఇంగ్లీషువారు ఫ్రెంచివారు మొదలైన యూరేషియన్ జాతులవారు ఇండోనీసియాలో అటనట చెల్లాచెదురుగా నామమాత్రమైన వర్తకం చేసుకొనటంతప్ప డచ్చివారిని ఎదుర్కొని నిలువగలశక్తిని కోల్పోయారు. ఫలితంగా డచ్చివారి 'వాణిజ్య ప్రభుత్వ' ప్రాబల్యం మారులేని పోడిమిని అందుకొన్నది.

1602 సంవత్సరం మొదలుకొని1750 సంవత్సరం వరకు డచ్చివారు ఇతర యూరషియన్ జాతులవారి వాణిజ్యాన్ని నిర్జించడము, స్వదేశరాజులలో కొందరిని లోగొనడము పూర్తిచేయ గలిగారు. తోడి యూరషియన్ జాతులపోటీ సమసిపోయిన వెంటనే డచ్చివారు జావాలో బలమైన ప్రభుత్వ పీఠాన్ని నెలకొల్పుకొని ఇతరదీవులపై దండయాత్రలను జరిపి వాటినికూడా ఆక్రమించుకొన

వుద్యమించారు. 1775 సంవత్సరం నాటికి తూర్పుబోర్నియోలోని 'పంజార్ మాసేక్' ప్రాంతీయులను ఓడించి, డచ్చివారు అత్యల్ప కాలంలోనే ఆదీవిలో సగభాగాన్ని ఆక్రమించుకొన్నారు. అంతకుపూర్వమే బోర్నియోలో ఇంగ్లీషువారు 'పంజార్ మాసేక్' రాష్ట్రప్రజలతో పోరుతూ తూర్పు బోర్నియోలో కొంతస్థావ రాన్ని ఆర్జించించారు. డచ్చివారావిజయాన్ని కూడా చూరగొన్న పిమ్మట పశ్చిమబోర్నియోను డచ్చివారు, తూర్పుబోర్నియోను ఇంగ్లీషువారు ఆక్రమించుకొన్నారు. 1775 సంవత్సర ప్రాంతానికి తూర్పుజావాలోని 'జావానీయులను' ఓడించి ఆభాగమునుకూడా డచ్చివారు ఆక్రమించుకొన్నారు. 1780 సంవత్సరం నాటికి డచ్చివారు సెలిబస్ దీవులనుకూడా కదళించి వేశారు. 1800 సంవత్సర ప్రాంతానికి జావాకు తూర్పునగల దీవులన్నీ ఇంచు మించుగా డచ్చివారి ఆధీనంలోనికి చేరిపోయాయి.

కాని జావాకు ఇటుపశ్చిమంగావున్న పెద్దదీవి సుమత్రా మాత్రం డచ్చివారికి ఓపట్టాన లొంగిపోలేదు. డచ్చివారు ఇండొనీసి యాలోఅడుగుపెట్టిననాటినుండి ఈ దీవి వారికి కొరకరానికొయ్యా లాగుననే వుండిపోయింది.

జావాదీవిలో డచ్చివారు ఆదరపు రస్పరంగా ఆహ్వానితులై నారుగాని, సుమత్రాదీవిలోని ప్రజలుమాత్రం డచ్చివారికి ప్రవేశ మివ్వలేదు. సుమత్రాలో అప్పటికి శక్తివంతమైవున్న 'ఆఛే' రాజులు డచ్చివారు ఆదీవిలో కాలూనకుండా అడ్డుతగిలారు. అక్క డికీ ఆఛేరాజ్యనికి కొందరుడచ్చివర్తకులు చేరితే, వారిని గుట్టు చప్పుడుకాకుండా చంపివేశారు. ఆఛేరాజులు సుమత్రాదీవిలో ప్రబ లమైన శక్తిసంపన్నులై వుండటంవలన ఇంచుమించుగా 17 వ శతా బ్దారంభంవరకు సుమత్రాదీవి పరదేశజుల ప్రాబల్యానికి లోను కాకుండా రక్షింపబడింది.

కాని పదహారవ శతాబ్దాంతానికి సుమత్రాదివిలో ఆఛే రాజ్య ప్రాబల్యశ్రీలు తగ్గనారంభించాయి, ఆఛేరాజ్యం విచ్ఛి న్నమై దీవియంతటా చిల్లరరాజులు తలలెత్తారు. ఆట్టిసమయంలో

డచ్చివారు సుమత్రాదీవులుకూడా కొన్ని వర్తకకేంద్రాలను నెల కొల్పుకొనగలిగారు కాని, ఇతర దీవులలోవలే అచటవారు ప్రాంతీయాధికారాలనుమాత్రం ఆర్జించలేక పోయారు.

జావాదీవిలోని మటారమ్, బాంటమ్ మొదలైన సంస్థానాలు డచ్చివారిచే ఓడింపబడినతరువాత ఇండొనీసియాలోని ముస్లిమ్ ప్రజాళిని మిక్కుటమైనఖేదం ఆవహించింది. అందు సుమత్రాదీవి లోని ముస్లిములు డచ్చి రాజ్యాధిపతులను కూలద్రోయవలెనని అను నిమిషము ప్రయత్నించ సాగారు. సుమత్రాదీవిలోని నౌకాకేంద్ర మైన మినాంకబావ్రా రేవుపట్టణంలో విశేషమైన నావికాబలాన్ని సమీకరించుకొని సుమత్రా ముస్లిమ్‌లు డచ్చివాణిజ్య నౌకలతో తలపడుతూ వాటిని ముంచివేస్తూ వుండేవారు. తన్మూలంగా డచ్చివారు సుమత్రారాజులతో పెక్కునౌకా సంఘర్షణలు జరు పుతూ విశేషశ్రమలకు లోనుకాక తప్పలేదు.

పదునెనిమిదవ శతాబ్ది ఆరంభంవరకు డచ్చివారు సుమత్రా దీవిలోని రాజులతో తరుచు యుద్ధాలనుచేస్తూ విశేషనష్టాన్ని పొందుతూ సుమత్రాలో కొంతభూభాగాన్ని ఆక్రమించుకొన్నారు. క్రమేపీ అచటి స్వదేశసుల్తానులతో పోరుతూ, ఒకదానివెంబడి మరియొక సంస్థానాన్ని జయిస్తూ మరికొన్నిటిని జారవిడుచుకొంటూ అస్థిమితులైన డచ్చివారికి సుమత్రా దీవిని ఒకతప్పనిసరియైన గుది బండగా భరించక తప్పలేదు.—

సుమత్రాదీవిలో డచ్చివారు పొందుతూవున్న లిగాడును చూచి, ఇతరదీవులలోకూడా తిరుగుబాట్లు పొక్కనారంభించాయి. ఆయావిప్లవాలనుఎదుర్కొంటూ వాటిని అమితమైనవ్యయప్రయాస లతో అణచివేస్తూ వుండటంవల్ల 'డచ్చి తూర్పుఇండియా కంపెనీ' ఆర్థికంగా దుర్బలమై శల్యావశిష్టమై పోయింది. పేరుకు జావా, సుమత్రా, బోర్నియో, సెలిబస్ దీవులపై రాజ్యాధికారం లభించి నప్పటికిని డచ్చికంపెనీ పాలకుల బొక్కసం నిండుకున్నది. సైనికు లను పెంచడానికికూడా కంపెనీకి శక్తిలేకపోయింది. పరిపాలన

సాగించగల సామర్థ్యము సన్నగిల్లిపోయింది. 'డచ్చితూర్పు ఇండియా సంఘం' ఇంతటి ఆర్థిక దౌర్బల్యానికి లోనుకావడంవల్ల 'కంపెనీ' దివాళాతీసినదని కంపెనీ డైరెక్టర్లు హాలెండులో ప్రకటించారు. ఆప్రకటన హాలెండు వణిజ వర్గాలలో హాహాకారాలను రేకెత్తించింది. వెంటనే హాలెండు ప్రభుత్వం జోక్యం కలుగజేసుకొని 1602 సంవత్సరంలో 'తూర్పు ఇండియా సంఘం' అనుపేర సృష్టించిన 'చార్టరు' ను ఉపసంహరించుకొని 1798 లో ఆకంపెనీని రద్దుచేసింది. కంపెనీని రద్దుచేసి దాని ఆస్థులను స్వాధీనంచేసుకొని మరిమూడుసంవత్సరాలకు అనగా 1801 సంవత్సరంలో 'బటేవియన్ రిపబ్లిక్' అనుపేరుతో జావా, సుమత్రా, బోర్నియో, సెలిబస్ తదితర దీవులపై రాజ్యాధికారాన్ని కైవశంచేసుకొని, హాలెండు ప్రభుత్వం పరిపాలన చేయనొడగింది.

కంపెనీ స్థానంలో, హాలెండు ప్రభుత్వమే పరిపాలన చేయనారంభించిందని తెలియగానే ఇండోనీసియా అంతటా పదభ్రష్టులైన సుల్తానులు తిరుగుబాట్లు లేవదీశారు. ఈ తిరుగుబాట్ల నడుమ చిక్కుకొని సతతమవుతూ వున్న హాలెండు ప్రభుత్వానికి చూస్తూ చూస్తూవుండగా మరొక్క ప్రమాదం ముంచుకువచ్చింది.

ఐరోపాలో ఫ్రెంచిపీఠాధిపతుడు నెపోలియన్ విజృంభించి హాలెండును ఆక్రమించాడు. ఫలితంగా ఆసియాఖండంలో అప్పుడు వర్తకంకొరకు వచ్చి, రాజ్యభాగాలను ఆర్జించిన 'ఇంగ్లీషు; ఫ్రెంచి, డచ్చి వర్తకప్రభుత్వాల' వారుకూడా యుద్ధాలుచేయనారంభించారు. ఇండోనీసియాలో జీవశ్చవాలైవున్న ఫ్రెంచివర్తకులు ఈ అదును చూచుకొని డచ్చివారితో చేతులుకలిపి ఇంగ్లీషువారిని ఆదీవులనుండి తరిమివేయవలెనని ఒక ఒడంబడిక చేసుకొన్నారు. ఈ ఒడంబడిక విషయంతెలిసి అప్పుడు భారతదేశంలో గవర్నరు జనరల్‌గా వుండిన లార్డుమింటో జనరల్ గిల్లెస్పీ నాయకత్వాన్ని కొంతసైన్యాన్ని ఇండోనిసియాకు పంపి వాటిని ఆక్రమించుకొనమని ఆదేశించాడు. జనరల్ గిల్లెస్పీ జావాలోని బటేవియావద్ద విడిసి పోరాటంసాగించాడు. నెపోలియన్ అనుచర

సేనానులలో ఒకడైన 'డాండెల్స్' అనునతని నాయకత్వాన్ని ఇండోనేసియాలోని డచ్చి, ఫ్రెంచి సైన్యాలు సంయుక్తంగా ఇంగ్లీషుసైన్యాలను ఎదుర్కొన్నాయి. కాని గిల్లెస్పీ వారిని ఓడించి జావాను ఆక్రమించాడు. ఈ విజయంతో 'డచ్చి ఇండోనేసియా' 'బ్రిటిషు ఇండోనేసియా' గా మారిపోయింది. వెంటనే బ్రిటిషురాజు సర్. స్టాఫర్డ్ రాఫిల్స్ అనునతనిని ఈ దీవులకు గవర్నర్ జనరల్ గా నియమించాడు. అతడు బటేవియాను అరు దెంచి స్వదేశరాజుల తిరుగుబాట్లను అన్నిటిని అణిచివేసి శక్తి వంతమైన ప్రభుత్వాన్ని నిర్మించాడు.

కాని ఇంతలో నెపోలియన్ సేనాని ఐరోపాలో పరాజితుడై ప్రవాసానికి పంపబడ్డాడు. తదుపరి జరిగిన సంధి, ఒడంబడికలను అనుసరించి ఇంగ్లీషు అధికారులు జావా మొదలైన దీవులన్నింటిని డచ్చివారికి వదలివేసి దానికిబదులుగా 'సింహళం' దీవిపై సర్వాధికారాలను సంపాదించారు.

1811 సంవత్సరం మొదలుకొని 1815 సంవత్సరం ఆఖరు వరకు నాలుగేండ్లపాటు ఇండోనేసియాను ఇంగ్లీషు వారికి వదిలి, పిమ్మట రాజ్యాధికారాన్ని తిరిగిపొందటానికి డచ్చి అధికారుల పని చాలానుకరం అయిపోయింది. నాలుగేండ్ల వ్యవధిలో ఇంగ్లీషు వారి పుణ్యమాఅంటూ ఇండోనేసియాలో స్వతంత్ర్యమైన ఒకసంస్థానంగాని, ఒకశక్తివంతుడైన సుల్తానుగాని లేకుండా హరించిపోయారు. తాముచేయలేని పనిని ఇంగ్లీషువారు చేసిపెట్టిన అదృష్టానికి పొంగిపోతూ డచ్చిఅధికారులు తిరిగి బటేవియాలో జెండా ఎగురవేశారు.

బటేవియాలో ఈసారి ఎగిరినది "డచ్చి తూర్పుఇండియా సంఘం" అనే కంపెనీవారిజెండాకాదు; అది డచ్చి సామ్రాజ్యపు పెద్దజెండా! జావాలో ఈపర్యాయం పునరుద్ధరింప బడినది 'తూర్పుఇండియా కంపెనీ' అనే డచ్చివర్తకుల అధికారంకాదు; అది ఇండోనేసియా అంతే నూ 'వలసదేశం' గా పరిపాలించవలెనని వచ్చిన డచ్చి సామ్రాజ్య ప్రభుత్వం!! — ఇండోనేసియాలో ఈతూరి

నెలకొల్పబడినది డచ్చివర్తకుల వాణిజ్య ప్రధానమైన అధికారం కాదు; అది ఇండోనేసియాను కొల్లగొట్టుకొని పోనుద్దేశించిన డచ్చి సామ్రాజ్య ప్రభుత్వప్రాబల్యం !!!

స్వాతంత్ర్య పిపాసులగు ఇండోనేసియన్ సుల్తానులలో ఈడచ్చి ప్రభుత్వాధికార స్థాపన యెడల ద్వేషాన్ని, ద్వేషాన్ని మించిన ప్రతీకారవాంఛను రేకెత్తించింది. ఫలితంగా జావాదీవిలో పలుతావులందు తిరుగుబాట్లు బయలుదేరాయి. ఈ తిరుగుబాట్లలో ప్రప్రధానంగా పేర్కొనదగినది 'మాటరమ్' సుల్తానుఅయిన అబ్దుల్ హామీద్ దీప్ నగర్ నడిపిన స్వాతంత్ర్యసమరం...!

డచ్చివారితో అంతిమపోరాటం జరుపవలెనని, తద్వారా డచ్చిఅధికారానికి అశ్వాసాంతం చేసినగాని ఇండోనేసియాభవిష్యత్తు గాఢాంధకార బంధురం కాకమానదని దీప్ నగర్ అంతకుముందు నుండి రహస్యంగా సర్వప్రతీకారశక్తులను సమీకరించుకుంటూనే వున్నాడు. ఈలోపుగా ఇంగ్లీషువారినుండి ఇండొనీసియాపై అధికారాన్ని డచ్చివారు స్వీకరించడము తదుపరి డచ్చివారు దేశంలో తమ సామ్రాజ్య విస్తారణను, సంస్థాపనను చేయరాని దుండగాలను ఉపక్రమించడము, అందువలన ప్రజలలో మిక్కుటమైనఅసంతృప్తి పెరిగి డచ్చివారిపై అటనట చిల్లరసంఘర్షణలు పొడసూపడము మొదలైన వాటితో జావాఅంతటా అశాంతి అలుముకొన్నది. ఈ అశాంతిని,అసంతృప్తిని అవకాశంగాతీసికొని దీప్ నగర్ డచ్చివారిపై యుద్ధానికి తలపడ్డాడు. సాయుధ సంఘర్షణలనేకాక, గెరిల్లా యుద్ధక్రమాన్ని కూడ దీప్ నగర్ నడిపించాడు. మటారమ్ రాజ్య ప్రజలందరూ ఈ యుద్ధంలో పాల్గొని, సుమారు ఐదుసంవత్సరాల పాటు డచ్చివారిని ముప్పతిప్పల పాలుచేశారు. రమారమి 15,000 మంది సైనికులను, విశేషమైన ఆయుధబలాన్ని కోల్పోయి డచ్చివారు ఒక పటోపాయంతో దీప్ నగర్ రాకుమారుని ఖైదీగా పట్టుకొన్నారు; తదుపరి అతణ్ణి సెలిబస్ దీవులకు ప్రవాసం పంపించారు. 'మటారమ్' రాజ్యంలోని విప్లవం చల్లారింది. కాని,

డచ్చి అధికారంమాత్రం సవ్యంగా అచట చెల్లుబాటు కాలేకపోయింది. అంతట ప్రజలలోబరుచుకోన వలెనని 'సంధి సంప్రదింపులు' అనేనెపంతో దీప్‌నగర్‌ను జావాకు తీసుకువచ్చి, డచ్చి సేనాని అతనితల నరికివేశాడు.

దీనితో డచ్చివారు జావాలో తమకిక ప్రత్యర్థిని లేకుండా చేసికొనగలిగారు. ఇండోనీసియనులు తమకిక స్వాతంత్ర్యాన్ని ఆర్జించిపెట్టగల ఒక వీరపురుషుని కోల్పోయారు. డచ్చిసామ్రాజ్యాధికారం జావాలోనిర్నిరోధంగా సంస్థాపింప బడింది. జావానీయులకు యదార్థమైన బానిసజీవనం ఆరంభమైనది. దీప్‌నగర్ రాకుమారుని చరిత్ర ఇండోనీసియాలో ఒక వీరచరిత్రవలె పూజింపబడుతూ వున్నది నేటికిని: ఆవీరకుమారుని పేరుస్మరించి ఇండోనీసియనులు పులకాంకితులవుతూ వుంటారు.

జావాను పూర్తిగా జయించిన పిమ్మట డచ్చి సామ్రాజ్య ప్రభుత్వం, తనకు ఇంతకాలంనుండి కంటిలోని నలుసువలెవున్న సుమత్రాదీవిపై తనబలిమిని కేంద్రీకరించింది.

జావాలో దీప్‌నగర్ రాకుమారుని స్వాతంత్ర్యపోరాటం ప్రారంభమైనదేతడవుగా అటు సుమత్రాదీవిలో కూడా మరొక విప్లవం పొడసూపింది. మధ్య సుమత్రాలో 'టోంకోఇమామ్ బంజోల్' అను స్వాతంత్ర్యశూరుని ఆధ్వర్యాన బ్రహ్మాండమైన విప్లవం బయలుదేరి డచ్చిఅధికారాన్ని గడగడలాడించింది. సుమారు పదిహేను సంవత్సరాలపాటు (1821 - 37) ఈ తిరుగుబాటు సాగుతూ నేవుంది. జావాలో దీప్‌నగర్‌ను ఓడించిన తరువాత డచ్చివారు తమబలాన్ని అంతను సుమత్రాపై ప్రయోగించి బంజోల్‌ను ఖైదీగాపట్టుకొని సెలిబస్ దీవులకు ప్రవాసిగా పంపివేశారు. 1854 నవంబరు 8 వ తేదీని బంజోల్ ప్రవాసిగానే సెలిబస్ దీవులలో మరణించాడు.

బంజోల్ పరాజితుడైన వెంటనే మధ్యసుమత్రాలో డచ్చిఅధికారానికి మారులేని స్థానంలభ్యమైంది, కాని ఆఛేరాజ్యసుల్తాను మాత్రం డచ్చివారికి లొంగిపోకుండా ప్రతివిషయములోను అవిశ్రా

కాని వివిధములైన వాణిజ్యసంస్థలు మొలకెత్తడంతో, పైపంటలకు తోడుగా, 'చెరకు' పంటకూడా ఇండోనీసియాలో విరివిగా జొచ్చింది. చివరకు చెరకు పండించడం ప్రతిరైతుకు నిర్బంధం చేయబడింది. 'వెట్టిచాకిరీ'వలెనే ఈ 'నిర్బంధపుపంట' పద్ధతికూడా ఇండోనీసియనుల వాణిజ్యాభివృద్ధిని పూర్తిగా అరికట్టివేసింది. 'వెట్టి' ని తొలగించవలెనని ఆందోళన చేసినట్లే 'డెక్కర్' ఈనిర్బంధపు చెరకుపంట విషయాన్నికూడా ఖండిస్తూ ప్రజాభిప్రాయాన్ని ప్రజ్వలింపజేశాడు.

ఈ ఆందోళనను బాగావ్యాప్తి చెయ్యడానికి డెక్కర్‌కు మంచిసాధనాలుకూడా లభించాయి.

జావాలో ప్రభుత్వం తరఫున మాత్రమేగాక ప్రత్యేకవ్యక్తుల ఆధారాన్ని మూడు పత్రికలు సురబాయా నగరంలోను (1845) సెమరాంగ్ నగరంలోను (1846) బటేవియా నగరంలోను (1851) స్థాపింపబడ్డాయి. ప్రజలకు నష్టంవాటిల్లే ప్రతిసమస్యపైనా ఈపత్రికలు ఘాటుగా వ్రాస్తూవుండేవి. అందువల్ల డచ్చిప్రభుత్వం కన్నుకుట్టింది. వెంటనే ఆపత్రికలపై ప్రభుత్వం చర్యలు తీసికొన్నది. ప్రతిరోజున పత్రిక అచ్చు కాబోవుముందు స్థానిక పోలీసుఅధికారులకుచూపి ప్రచురణకు అనుజ్ఞ పొందవలసి వుండెను. అయినప్పటికీ ఈ పత్రికలు ప్రజలపై అమలు జరుగుతూ వుండిన 'దోపిడీవిధానాన్ని' విమర్శిస్తూ వుండేవి. ఈపత్రికల వ్రాతలయెడల హాలెండులో ఇండోనీసియన్ ప్రజలయెడ కొంతసుముఖమైన ప్రజాభిప్రాయం ఏర్పడినది. ముద్రణాయంత్రాలు పత్రికలు లభించిన ఈ అవకాశాన్ని ఊతగాగొని డెక్కర్ ఒక ఉద్గ్రంథాన్ని రచించాడు. "మాక్సహావెలార్" అనే గ్రంథంలో అతడు ఇండోనీసియాలో డచ్చిఅధికారులు అమలు పరుస్తూ వుండిన 'వెట్టి' ని గురించి నగ్నంగా వర్ణించాడు. వాన్-డి-పుటె అనునతడు 'పంచదార కంట్రాక్టు' లనుగురించి మరొకగ్రంథాన్ని రచించాడు. ఈ రెండు గ్రంథాలవలన హాలెండులో ప్రజాభి

యను టర్కీ సహకారాన్ని కోరివున్నారు. కాని పరదేశాల సహాయంవారికి లభించలేదు. అందువలన స్వశక్తినే నమ్ముకొని వారు నాటినుండి డచ్చిసామ్రాజ్య ప్రభుత్వంతో ఏదోఒకరూపాన పోరుతూనేవున్నారు.

1835 లో డచ్చిసామ్రాజ్య ప్రభుత్వం నెలకొనిన నాటి నుండి డచ్చిప్రభుత్వంతో ఇండోనేసియనులు స్వాతంత్ర్య సమరం చేస్తూనేవున్నారు. ఆసమరం ఒకప్పుడు సాయుధమైనదికావచ్చు, వేరొకప్పుడు గెరిల్లా పద్ధతిని నడువవచ్చు, మరొకప్పుడు శాసనసభ రంగమందు జరుగవచ్చు చివరకు పరరాజ్యాక్రమణకు గురియై ఇంకొకరూపాన అదికొనసాగి వుండవచ్చు ఏరూపంగానైనా అది నడిచివుండవచ్చు...ఇండోనేసియనుల స్వాతంత్ర్య సమరం జరుగుతూనే వున్నది నేటివరకు...



# డచ్ దోపిడీ విధానం

ఇండోనీసియాపై డచ్ ప్రభుత్వం సామ్రాజ్యాన్ని సంపాదించింది. సామ్రాజ్యత్వంసమకూడగానే ఇండోనీసియా భాగ్యభోగ్యాలన్నిటిని పీల్చుకోవడానికి అధికారయుతమైన అవకాశాలు డచ్ సామ్రాజ్య ప్రభుత్వాధికారులకు బాగాలభించాయి. శాసనాల ద్వారాగాని, సైనికబలాల రీత్యాగాని డచ్ ప్రభుత్వం ఇండోనీసియాను దోచుకొనడానికి ఎట్టిఅడ్డంకులు ఇక సంప్రాప్తం కావు. కాని ఇండోనీసియా ఐశ్వర్యాన్ని జుర్రుకొనడానికి గాను డచ్ ప్రభుత్వం సామ్రాజ్యాధికారం లభించునంతవరకు వేచివుండలేదు. ఇండోనీసియాలో కాలుపెట్టిననాటినుండి డచ్ ప్రభుత్వం ఆపనిని చేస్తూనేవచ్చింది. డచ్ వాణిజ్యాధికారులు ఆదినుండి ఇండోనీసియాలో చరించిన విధానాలను పరికించినట్లయితే స్వర్ణద్వీపాల ఐశ్వర్యాన్ని దోచుకొనడానికి వారుఎట్టిఘోరాలు చేసినది; మరెన్ని కుమార్గాల ననుసరించినది విశదమవుతుంది.

డచ్ పరిపాలనా విధానానికి, వాణిజ్యవ్యవహారానికి అవినాభావ సంబంధమున్నది. అసలు వాణిజ్యాన్నిబట్టి ఇండోనీసియాలో డచ్ పరిపాలనా విధానం ఏర్పడుతూ వచ్చింది. డచ్ ప్రభుత్వ పరిపాలనా విధానాన్ని తెలుసుకొన వలెనంటె ముందుగా డచ్ వాణిజ్య ప్రసక్తిని సమీక్షించుకొనడం అవుసరమైవుంది.

పదునారవశతాబ్ది ఆరంభంలో "డచ్ ఈస్టుఇండియా కంపెనీ" అను పేర ఒక వర్తకసంఘాన్ని స్థాపించి డచ్ వణిజులు ఇండోనీసియాలో సుగంధద్రవ్యాల వర్తకంచేయడం ప్రారంభించారు. జావాలో వారివ్యాపారం దినదినాభివృద్ధిచెంది సాలీనా నూటికి యాభైవంతుల వరకు లాభాలు పంచుకొన నారంభిం

చారు. ఈ వాణిజ్యరంగంలో డచ్ వణిజులు ఇతర యూరోపియన్ వర్తకసంఘాలవారితో బాగాపోటీలుపడి, దేశీయసుల్తానులను మంచిచేసుకొని, ప్రజలసానుభూతిని ఆర్జించి క్రమేపీ దేశంలో బలపడసాగారు. ఇట్లుఒక్క శతాబ్దందొర్లిపోవుసరికి ఇండోనేసియాలో వర్తకం కొరకైవచ్చిన అందరు యూరోపియన్ జాతులకంటె డచ్‌వారు పైచేయి సంపాదించారు. అంతేకాదు: జావా పశ్చిమ తీరం పొడుగునా వారుపెక్కు వాణిజ్యకేంద్రాలను నెలకొల్పుకొని కొంతప్రదేశాన్ని కూడా సంపాదించి ప్రజలపైన నేకాక, చిన్న చిన్న సుల్తానులపైకూడా పలుకుబడిని ఆర్జించారు.

పోర్చుగీసు, స్పెయిన్ వర్తకులను తరిమి ఆయాప్రదేశాలను డచ్ వర్తకులు భుక్తంచేసుకొని, వాటిపై తమఅధికారాన్ని స్థాపించుకొన్నారు. ఇట్లుస్థాపించుకొనడంలో వారికి ఎన్నోవిలువ గల భూములు లభించాయి. వెంటనే ఆయాభూములలో ఉత్పత్తు లను విరివిగా సాగించి, దేశీయులతో పోటీచేసి తమవర్తకాన్ని పెంపుచేసికొన్నారు. ఈ పోటీవలన ఇండోనేసియన్ పంటదారులు చాలావరకు దెబ్బతిన్నారు. డచ్ కంపెనీకి చెందిన భూములలో పనిచేయడానికిగాను అమాయిక ప్రజలను ఆయుధబలంతోను, సైనికశక్తితోను బెదిరించి, బలవంతంగా వ్యవసాయాదికాలు జరి పించుకొనేవారు. కంపెనీకొరకు పనిచేయని ప్రజలపై దేశీయసుల్తా నులచే ఒత్తిడిచేయించడమేగాక? అట్టిప్రజలను బానిసలకంటె నికృష్టముగా బాధలుపెట్టసాగారు.

ప్రజలవద్దనుండి, దేశీయసుల్తానులవద్దనుండి సంగ్రహించిన భూములలో డచ్‌వారు వివిధములైన సుగంధద్రవ్యాలను పండిస్తూ అట్టిపంటలనే తమతమ పొలాలలో పండించనీయకుండా ఇండోనేసియన్ ప్రజలను డచ్ అధికారులు పలువిధములైన అవ రోధాలను కల్గించి హింసించారు. ఫలితంగా అన్నివిధములైన పంటలను గుత్తగొని డచ్ కంపెనీ దేశీయుల వ్యావసాయికోత్పత్తు లను అణిచివేసింది. ఇందువలన వ్యవసాయంపై ఆధారపడి జీవించు ఇండోనేసియన్ ప్రజలందరు తమతమ జీవనాధారాలు

నశించగా డచ్చివారి పొలాలలో 'కూలీ' చేసికొని జీవించవలసిన దురవస్థ ప్రాప్తించింది. పొలాలలో పనిచేసి పండించగల ప్రజలు వలసినంతమంది లేనందువల్ల దేశీయజమీందారులు కూడా చాలా వరకు చితికిపోయారు.

వ్యవసాయంపై ఆధారపడి వుండిన జమీందారులు ఈ విధంగా నష్టానికి గురియైతే, నౌకానిర్మాణము, నౌకాయానము మొదలైనవాటిపై ఆధారపడిన మరికొందరు పెద్దతరగతి ఇండోనీసియన్ వర్గాలుకూడా డచ్చివారివలన విశేష కష్టనష్టాలకు పాల్పడినారు. ఎగుమతులు, దిగుమతులు మొదలైనవన్నీ డచ్చి నౌకలద్వారానే జరుగవలెనని డచ్చికంపెనీ అధికారులు విధించడంతో ఇండోనీసియన్ నౌకానిర్మాతలకు, నౌకావ్యాపారులకు వ్యాపారంసన్నగిల్లి డచ్చివారికి లోబడిపోయారు. వ్యవసాయంలోను, నౌకావ్యాపారంలోను ఇట్టిపోటీలు, అవరోధాలు ఏర్పడడంవల్ల ఇండోనీసియన్ జమీందారులలోను, ధనస్వాములలోను ప్రజలలోను అమితమైన అసంతృప్తి జనించి పెక్కుతిరుగుబాట్లు పొడసూపినవి.

డచ్చివారి వాణిజ్యంఅపారంగా పెరుగుతూ వుండినప్పటికిని దేశీయులతో తరుచు సంఘర్షణలను పొడసూపుతూ వుండటంవల్ల డచ్చికంపెనీవారు విశేషమైన వ్యయప్రయాసలకు లోనైపోయారు. చివరకు "డచ్చి తూర్పుఇండియా సంఘం" దివాళాతీసింది. అంతట ఆకంపెనీ ఆస్తిపాస్తులను హాలెండుప్రభుత్వం కైవశంచేసుకొని "బటేవియన్ రిపబ్లిక్" అనుపేర తనవలసరాజ్య ప్రభుత్వాన్ని జావాలో నెలకొల్పి వెనుకటి కంపెనీ అధికారులవలెనే వాణిజ్యవ్యావసాయిక వృత్తులను సాగించ నారంభించింది. కాని ఇదిన్ని డచ్చివారికి ఆశించినంతగా ప్రయోజనకారి కాలేదు.

అంతట డచ్చిప్రభుత్వం తనపద్ధతిని కొంత మార్చుకొన్నది. కేవలము ప్రభుత్వమే పంటలను పండిస్తూ దేశీయ వ్యవసాయ వృత్తిని అరికట్టుతూవుండడంవల్ల తరుచుగా తిరుగుబాట్లు మొలకెత్తి ప్రజలతో ప్రభుత్వం అవిరామంగా సంఘర్షణలలో మునిగి

తేలవలసిన పరిస్థితులు సంభవిస్తున్నాయని, అందువలన ప్రత్యేక వ్యక్తుల వ్యవసాయ వృత్తులకు అవకాశం ఇచ్చినట్లయితే ఆఅశాంతి కొంతవరకు తగ్గవచ్చునని, బటేవియాలోని డచ్చివాణిజ్య ప్రభుత్వాధికారులు కొత్తఎత్తులకు ఉపక్రమించారు. దేశీయులలో కొందరు జమీందారులకు అవకాశాలను కలుగ జేయడమేగాక "నెదర్లెండ్సు ట్రేడింగ్ కంపెనీ" అనుపేర హాలెండునుండి కొందరు పెట్టుబడిదారులను ఇండొనీసియాకు రప్పించి వారికి అన్నివిధము లైన అవకాశ ప్రోత్సాహాలను డచ్చి ప్రభుత్వాధికారులు కలుగ జేశారు. ప్రభుత్వపు ప్రోత్సాహంతో బయలుదేరిన ఈ కంపెనీతో వ్యవసాయ, వర్తకాలను చేయగలశక్తి దేశీయులకు లేకపోవడంవల్ల వారు పంటలు పండించడంలోను, వాణిజ్యాన్ని నడపడంలోను బాగాముందుకు రాలేకపోయారు. అవకాశాలను ప్రజలకు కలుగ జేసినట్లు నటించినా, డచ్చిఅధికారులు, దేశీయులను మరొకసారి వంచించి తమవాణిజ్యాన్ని, దోపిడీవిధానాన్ని యథాలాపంగా కొనసాగించుకొన్నారు.

జావానీయుల వ్యావసాయిక, వాణిజ్యవృత్తులను భిన్నా భిన్నంచేస్తూ డచ్చివలసరాజ్యప్రభుత్వం అచటి ఐశ్వర్యాన్ని దోచుకుంటూవుండగా అటు ఐరోపాలో నెపోలియన్ యుద్ధాలు ప్రారంభమైనాయి. జావాను బ్రిటిషువారాక్రమించడము, పిమ్మట సంధిషరతులననుసరించి జావాను డచ్చివారు పునరాక్రమించి తమ ప్రభుత్వాన్ని నెలకొల్పుకొనడము జరిగింది. ఇంగ్లీషువారివద్దనుండి జావాను, తదితరదీవులను తీసికొనినతర్వాత డచ్చివారు నిజమైన సామ్రాజ్యప్రభుత్వాన్ని అచట స్థాపించుకొనగలిగారు. దానితో వారివాణిజ్యంలోను, తత్ఫలితంగా పరిపాలనలోను నూతనపరిణా మాలు ఉత్పన్నమైనాయి.

1830 లో డచ్చిప్రభుత్వం ఇండొనీసియాకు గవర్నరు జనర ల్ గా వాన్ డెన్ బోష్ అనునతనిని నియోగించింది. అధికారాన్ని స్వీకరించి అతడు ఇండొనీసియా ఐశ్వర్యాన్ని కొల్లగొట్టుకొను పద్ధ తులను అమలుపరచి, తన ప్రభుత్వానికి బాగానే నిర్వాకంచేసి పెట్టాడు.

ఇంతకుముందు డచ్చికంపెనీ అధికారులు అనుసరించిన విధానాలను తొలగించి బోష్ వ్యవసాయంలో 'కల్చర్‌సిస్టమ్' అను కొత్తపధకాన్ని అమలుపరచాడు. ఇంతకుపూర్వం రైతులు తాము పండించినదానిలో ఐదింట రెండుపాళ్ళు ప్రభుత్వానికి భూమిశిస్తుగా చెల్లించవలసివుండినది. కాని బోష్‌విధానంప్రకారం ఈ పద్ధతి తొలగిపోయింది. "ప్రతిగ్రామము తనపంటభూములలో ఐదవవంతు భూమిని ప్రభుత్వపరంచేసి ఆభూమిలో ప్రభుత్వంకోరిన పంటలను పండించినట్లయితే గ్రామంలోని మిగిలినభూమికి పన్నులుండవు. ఐదవవంతుభూమిలోపండిన పంటనంతను ప్రభుత్వంభుక్తపరుచుకుంటుంది. ఎగుమతులుచేసుకొనడానికిగాని, లేక ఇతరవిధములుగా దానినుండి లాభాలను సంపాదించడానికిగాని ప్రభుత్వానికే సర్వహక్కులు వుంటాయి..." అనే కొత్తవిధానాన్ని బోష్ అమలుపరచాడు.

ఈకొత్తపధకాన్ని అమలుపరచి బోష్ 1831సంవత్సరంలో డచ్చిప్రభుత్వానికి ఎంతోధనాన్ని చేకూర్చిపెట్టాడు. ప్రతిసంవత్సరము ఇండోనేసియానుండి ఈరీతిగా ధనం అపారంగా హాలెండు చేరుకొనసారంభించింది. ఇండోనేసియానుండి లభిస్తూవుండిన ఈధనంతో హాలెండుప్రభుత్వం తనదేశంలో 'స్టేట్ రైల్వేలను' నిర్మించుకొన్నది. దేశమంతటా బలమైనకోటలను కట్టుకొని అందు ఐశ్వర్యాన్ని చేరవేసుకొన్నది. ఇంకనూ నెదర్లాండ్సులోఅనేకమైన ప్రజాసౌకర్యాలను డచ్చిప్రభుత్వం నిర్మించుకొన్నది. బోష్ అమలుపరచిన ఈనూతనశిస్తు పద్ధతిమూలంగా 1831-1877 సంవత్సరాల మధ్య జావానుండి హాలెండుకు ఐశ్వర్యవాహినులు ప్రవహించినవి. 5,000,000 మంది ఇండోనేసియా ప్రజలనుండి సుమారు నలభై ఏండ్లలో డచ్చిప్రభుత్వం 832,000,000 మిలియన్ల పౌనుల విలువగల సంపత్తిని దోచుకొన్నదని ఇండోనేసియాలోని డచ్చిప్రభుత్వ లేఖలు తెలియజేస్తున్నాయి.

శిస్తుపద్ధతిలో ఈ పైవిధానాన్ని అమలుపరచడమే గాక బోష్ ఇండోనేసియాలో పూర్వంనుండి అమలుజరుగుతూ వుండిన

ఒక ఆచారాన్నికూడా పునరుద్ధరించి, దానిద్వారాకూడా అతడు ఇండోనీసియాసంపదను కొల్లగొట్టుకొన నుద్యమించాడు.

ఆ ఆచారంప్రకారం భూమి రాజుది; భూమిలో పండే పంట రైతుది అవుతుంది. రైతు తనపంటలో కొంతభాగాన్ని కొంత తన శరీరకష్టాన్ని రాజుకు శిస్తుగా చెల్లించాలి. ఆ శరీరకష్టం ఐదురోజులకు ఒక్కొక్కరోజుచొప్పున ఎట్టికూలీతీసికొనకుండా ఉచితంగా రైతురాజుకొరకు పనిచేయాలి. ఈ ఆచారాన్ని బోష్ తిరిగి అమలు పరచాడు. అయితే అతడు "ఐదురోజుల కొక్కొక్కరోజుగాక, ఏడురోజుల కొక్కొక్కరోజుచొప్పున రైతుప్రభుత్వానికి ఉచితంగా శరీరకష్టంచేయాలి" అని మార్పుచేసి రైతులచేత వ్యవసాయాంశికములైన పనులను చేయించడానికిబదులుగా రోడ్లువేయించడము, కాలువలుత్రవ్వించడము మొదలైన కష్టతరమైన పనులను చేయించాడు. ఈపద్ధతిని అమలుపరచడంలో డచ్చిప్రభుత్వాధికారులు నిర్దాక్షిణ్యంగాను, బహునీచంగాను ప్రవర్తించారు.

బోష్‌కు తరువాత ఇండోనీసియాకు గవర్నరుజనరల్‌గా వచ్చిన 'డీన్‌డెల్సు' అనునతడు ఈ విధానాన్ని బాగా అనుసరించి అనేకమైనదారుణాలను ఆచరించాడు. ఒకతావునుండి మరియొక తావువరకు రోడ్డువేయవలెనని నిర్ణయించినతరువాత ఆరోడ్డునిర్మింపబడవలసిన దారిపొడుగునా వున్న గ్రామాలలోని ప్రజలే ఆరోడ్డు భాగాన్ని తమగ్రామానికి చెందినంతవరకు వేయవలసివుంటుంది' అని అతడు ప్రజలను నిర్బంధించి ప్రభుత్వకార్యాలను నెరవేర్చాడు ఇట్టి బలవంతపు వెట్టిచాకిరీకి ఏగ్రామపు ప్రజలైనా అంగీకరించక పోయినట్లయితే ఆగ్రామంలోని శక్తిగలవారినందరిని అపరాధం క్రింద ఉరితీయించేవాడు. ఈవిధంగా డీన్‌డెల్సు జావాలో అనేకములైన రోడ్డులను వేయించాడు. ప్రజలచే వెట్టిచాకిరి చేయించడంలోనేగాక వారివద్దనుండి శిస్తులను వసూలుచేయడంలో కూడా ఇతడు అనేకఘోరాలుచేశాడు. రైతులను హింసించడంలో డచ్చి అధికారులు దేశీయసుల్తానులను మరపించారు. వారిసర్వస్వాన్ని దోచుకొని వారిని పీల్చిపిప్పిచేశారు.

ఇండోనీసియాలో అనుసృతంగా వచ్చే ఈ భూస్వామ్యవిధానం చాలా పవిత్రమైన ఆశయాలను నెలవైవుంది. అది సూక్ష్మంగా ఇది: "భూమియావత్తు భగవంతునిది. అది ప్రజలకు దత్తమై వుంటుంది. దానికి ప్రభుత్వం ధర్మకర్త. ఎవరున్నూ దానిని స్వంత పరుచుకోరాదు; కొనరాదు, అమ్మరాదు. తనభుక్తంలో వున్న భూమిని ఇతరులకు కౌలుకు ఇచ్చుకొనేహక్కు మాత్రమే ప్రతివాడు కలిగివుంటాడు. రైతునుండి భూమిని వేరుచేయడానికి వీలులేదు; కనీసం అప్పుక్రిందనైనా రైతువద్దనుండి భూమిని సంగ్రహించరాదు. అందువల్ల భూములు దీర్ఘమైనకాలం వరకు కౌలుకు ఇవ్వబడుతూవుంటాయి. పోరంబోకులవంటి భూములు 75 సంవత్సరాల వరకు ప్రభుత్వం ప్రత్యేకవ్యక్తులకు అమరకంగా ఇస్తూవుంటుంది; రైతులు 21 సంవత్సరంవరకు ఇతరులకు తమభూములను కౌలుకు ఇచ్చుకొనవచ్చును...", ప్రాచీనకాలంనుండి ఒక పరమోత్కృష్టమైన ఆచారంగా వస్తూండిన ఈ విధానాన్ని ఇండోనీసియన్ ప్రజలు ఒక పవిత్రమైన ఆచారంగా పరమధర్మంగా పాటిస్తూ వచ్చారు. కాని, ఆపవిత్రధర్మాన్ని డచ్చిప్రభుత్వాధికారులు అపవిత్రమొనర్చివేశారు: దుర్వినియోగం చేసివేశారు.

75 సంవత్సరాలవరకు కౌలుకు యిచ్చుకొనవచ్చుననే ఆచారాన్ని పురస్కరించుకొని డచ్చివారు జావా, సుమత్రాలలో అపారమైన భూభాగాన్ని ప్రజలవద్దనుండి, సుల్తానుల వద్దనుండి లాగుకొన్నారు. "హేండెల్సు వెరీనింజింగ్" అనే డచ్చి కంపెనీ సుమత్రాదీవిలో సగానికిపైగా భూమిని ఈపైవిధానాన్ని అనుసరించి ఆక్రమించుంకొని విశేషంగా లాభాలను గడించింది.

జనపనార, తొటినూనె, సుగంధ ద్రవ్యాలు మొదలైన పంటలెన్నిటినో పండించి సుమత్రాదీవి భూభాగాన్ని అంతను ఆకంపెనీ చిరకాలం కొల్లగొట్టుకొన్నది. హాలెండులోని ప్రముఖవర్తకులు, రాజకీయాధికారులు ఆకంపెనీలో వాటా

లను ఈ కంపెనీద్వారా స్వీయార్థిక ప్రయోజనాలను సాధించుకొన డానికి ఉపయోగించుకొన్నారు.

ఇండోనేసియాలోని జావా, సుమత్రా మొదలైన ప్రధాన మగు దీవులలోని సారవంతమగు భూములన్నిటిని డచ్చివారు భుక్తం చేసుకొంటూ, అందు వర్తకపు దినుసులను మిక్కుటంగా పండిస్తూ దేశీయులను బలవంతపు వెట్టిచాకిరీకి ఉపయోగించుకుంటూ - బ్రహ్మాండమైన లాభాలను పొందుతూ - ఇండోనేసియా సంపద నంతను దోచుకుంటూ వుండటంవల్ల దేశంలో అలజడులు - బయలు దేరాయి... ప్రజలకు 'నాగి' అని చెప్పుకొనదగిన పెద్దపొలాలు లేవు. ఏకొద్దిమంది ఇండోనేసియనులకో వున్నప్పటికిని వారిపంటలకు సరియైన వాణిజ్యవసతులు లేవు. హాలెండుకు ఎగుమతి కావలసిన సరుకులనన్నింటిని డచ్చివారే నిర్వహిస్తూవున్నారు. అట్టిఎగుమతు లను చేయడానికి ఇండోనేసియనులకుఎట్టిఅవకాశాలున్నూ లభించడం లేదు. ఇంతేకాదు; ఇండోనేసియన్ రైతులు తమపంటలనుండి ఏమాత్రమైనా వర్తకానికి వినియోగించుకొన గలిగితే వారట్టి వాణిజ్యాన్ని కొన్ని అనామకపు దేశాలతోనే చేసికొన వలసివుంది. బాగాలాభాలు లభించగల వర్తకమంతా డచ్చివారి చేతులలోకే వెళ్ళిపోయింది.

ఇండోనేసియాలోని భూములనన్నింటిని ఆక్రమించుకొని, తద్వారా వాణిజ్యాన్ని నిర్వహిస్తూవున్న డచ్చివారి చర్యలను విమర్శిస్తూ ఇ. డి. డెక్కర్ అనునతడు పెద్దఆందోళనను లేవ నెత్తాడు. అచిరకాలంలోనే అతని ఆందోళనను సమర్థించు పెక్కు అనుచరులు బయలుదేరారు. సుమారు ముప్పయి సంవత్సరాల ఆందోళనా ఫలితంగా ఇండోనేసియనులకు కొంత ప్రయోజనం సిద్ధించింది. డచ్చిప్రభుత్వం 1854 లో 'తూర్పుఇండియా ప్రభుత్వ చట్టం' అనునొకదానిని తయారుచేసి తన్మూలంగా ఇండోనేసియా లోని భూములను అమ్మడాన్ని నిషేధించింది. డచ్చివారుకూడా ఆభూములను కొనరాదని ఆచట్టం శాసించింది. భూములవిషయంలో ఈచట్టం ఇండోనేసియనులకు కొన్ని ప్రయోజనాలను కలిగించినది గాని, 'వెట్టి' ని మాత్రం నిర్మూలించలేక పోయింది.

కాని అవిరామమైన ప్రజాందోళన ఫలితంగా అదిన్ని 1870 వ సంవత్సరంలో తొలిగించబడింది. హాలెండు ప్రభుత్వం అంతవరకు 'కన్సర్వేటివుల' చేతిలోవుంది. ఇండోనేసియాలో జరుగు వ్యవసాయ, వాణిజ్య వ్యవహారాలన్నీ ప్రభుత్వాధీనంలోనే వుండాలని ప్రత్యేకవ్యక్తులకు అందు చోటువుండరాదనే సిద్ధాంతంతో ఈ కన్సర్వేటివ్‌ల పరిపాలన సాగించుతూ వచ్చారు. కాని 1870 సంవత్సరం నాటికి హాలెండులో 'లిబరల్' పక్షీయులు ప్రభుత్వాధికారాన్ని కరగతం చేసుకొని 'కన్సర్వేటివ్‌లు' అమలు పరుస్తూవచ్చిన పద్ధతిని మార్చివేశారు. ఫలితంగా ప్రత్యేకవ్యక్తులకు సంఘాలకు ఇండోనేసియాతో వర్తక సంబంధాలను నెరపుకొను అవకాశం లభించింది. దానితో హాలెండునుండి మాత్రమేగాక ఇతరదేశాలనుండి కూడా ప్రత్యేకములైన వణిజులు, వర్తక సంఘాలు ఇండోనేసియాలో ప్రవేశించి ప్రభుత్వపు తోడ్పాటుతో వర్తకాలను చేసుకొన నారంభించారు. దీనివలన ఇండోనేసియనులకు ఒకరికంటె ఎక్కువమంది దోపిడీదారులు దాపురించారు.

ఇంతేకాదు ఐరోపాఖండంలో విజ్ఞానశాస్త్ర పరిశోధనలు విరివిగా జరగడము, ప్రతిదేశంలోను 'పారిశ్రామిక విప్లవాలు' పొడసూపడము వాటి పరిణామంగా ప్రతిదేశము యంత్రాగారాలను నెలకొల్పి వాణిజ్యాన్నే ప్రధాన వృత్తిగా స్వీకరించి, పరదేశాలపై వర్తకపు దాడులకు ఉపక్రమించడము ప్రారంభమైంది. టెలిగ్రాఫ్, పోస్టు, స్టీమర్లు మొదలైనవి అమలులోనికి వచ్చాయి. మధ్యధరాసముద్రంనుండి అరేబియా సముద్రంలోనికి రహదారి ఏర్పరుపగల 'సూయజ్' కాలువ త్రవ్వబడింది. ఇన్నినూతన సౌకర్యాలు ఏర్పడడంవల్ల యూరోపియన్ వాణిజ్యసంఘాలు ఉరకలు వేసుకుంటూ ఆసియాఖండంపైకి ఉరకనారంభించారు. జావాలోకూడా వీరిప్రాబల్యం అంతకంతకు అధికమైపోయింది.

ఇంతవరకు ఇండోనేసియాలో పాశ్చాత్యులు నీలిమందు, మిరియాలు, కొబ్బరిదినుసులు, జనపనార, ఈతనూనె, సుగంధ ద్రవ్యాలు మొదలైన పంటలను మాత్రమే పండిస్తూ వుండేవారు;

కాని వివిధములైన వాణిజ్యసంస్థలు మొలకెత్తడంతో, పైపంటలకు తోడుగా, 'చెరకు' పంటకూడా ఇండోనీసియాలో విరివిగా చోచ్చింది. చివరకు చెరకు పండించడం ప్రతిరైతుకు నిర్బంధం చేయబడింది. 'వెట్టిచాకిరీ' వలెనే ఈ 'నిర్బంధపుపంట' పద్ధతికూడా ఇండోనీసియనుల వాణిజ్యాభివృద్ధిని పూర్తిగా అరికట్టివేసింది. 'వెట్టి' ని తొలగించవలెనని ఆందోళన చేసినట్లే 'డెక్కర్' ఈనిర్బంధపు చెరకుపంట విషయాన్నికూడా ఖండిస్తూ ప్రజాభిప్రాయాన్ని ప్రజ్వలింపజేశాడు.

ఈ ఆందోళనను బాగావ్యాప్తి చెయ్యడానికి డెక్కర్‌కు మంచిసాధనాలుకూడా లభించాయి.

జావాలో ప్రభుత్వం తరఫున మాత్రమేగాక ప్రత్యేకవ్యక్తుల ఆధారాన్ని మూడు పత్రికలు సురబాయా నగరంలోను (1845) సెమరాంగ్ నగరంలోను (1846) బటేవియా నగరంలోను (1851) స్థాపింపబడ్డాయి. ప్రజలకు నష్టంవాటిల్లే ప్రతిసమస్యపైనా ఈపత్రికలు ఘాటుగా వ్రాస్తూవుండేవి. అందువల్ల డచ్చిప్రభుత్వం కన్నుపట్టింది. వెంటనే అపత్రికలపై ప్రభుత్వం చర్యలు తీసికొన్నది. ప్రతిరోజున పత్రికఅచ్చు కాబోవుముందు స్థానిక పోలీసుఅధికారులకుచూపి ప్రచురణకు అనుజ్ఞ పొందవలసివుండెను. అయినప్పటికి ఈ పత్రికలు ప్రజలపై అమలు జరుగుతూవుండిన 'దోపిడీవిధానాన్ని' విమర్శిస్తూ వుండేవి. ఈపత్రికల వ్రాతలయెడల హాలెండులో ఇండోనీసియా.. ప్రజలయెడ కొంతసుముఖమైన ప్రజాభిప్రాయం ఏర్పడినది. ముద్రణాయంత్రాలు పత్రికలు లభించిన ఈ అవకాశాన్ని ఊతగాగొని డెక్కర్ ఒక ఉద్గ్రంథాన్ని రచించాడు. "మాక్సహావెలార్" అనే గ్రంథంలో అతడు ఇండోనీసియాలో డచ్చిఅధికారులు అమలు పరుస్తూ వుండిన 'వెట్టి' ని గురించి నగ్నంగా వర్ణించాడు. వాన్-డి-పుటె అనునతడు 'పంచదార కంట్రాక్టు' లనుగురించి మరొకగ్రంథాన్ని రచించాడు. ఈ రెండు గ్రంథాలవలన హాలెండులో ప్రజాభి

ప్రాయాన్ని బాగా రెచ్చగొట్టాయి. వీటిఫలితంగా 1870 లో భూసామ్యవిధానాన్ని సరిదిద్దు ఒకచట్టం అమలులోనికి రావడం మాత్రమేగాక 1890 సంవత్సరంలో చెరుకుపంట నిర్బంధముకూడా చట్టరూపేణా తొలగించబడింది. అయితే ఆనూతన సంస్కరణలు ఒక్క 'జావా' లో మాత్రమే అమలు జరిపబడినవికాని సుమత్రా బోర్నియో దీవులందుమాత్రం వీటిని స్మరింతి లేనేలేదు. అందు ముఖ్యముగా సుమత్రాదీవియందు డచ్చిప్రభుత్వం స్వయంగా 'కాఫీ' పంటలను పండిస్తూ వుండటంవల్ల ఈకొత్తశాసనాలను ఆదీవియందు అమలు పరుచలేదు. దీనిఫలితంగా సుమత్రాలోను, బోర్నియాలోను భయంకరమైన తిరుగుబాట్లు బయలుదేరాయి. వాటిని అతికష్టంమీద అణిచివేసి అప్పటి గవర్నర్ జనరల్ రోషుసేన్ క్రమేపీ ఆసంస్కరణలను అచటకూడా అనువర్తింప జేశాడు.

చెరుకుపంట సందర్భంలో 'నిర్బంధం' తొలగిపోయినదిగాని దానిస్థానే ఇండోనేసియనులకు మరికొన్ని యిక్కట్టులు ప్రాప్తమైనాయి. వరిసాగుకు వలెనే చెరుకుపంటకూ ఎక్కువనీరు కావలసివుంది. నీటివనరులు తగినంతగా లేకపోవడంవల్ల "రాత్రి పగలు" పద్ధతిఅను ఒకకొత్తవిధానాన్ని అమలుపరచి పగలు చెరుకుపంటదారులు, రాత్రి వరిపంటదారులు నీటిని వాడుకొనవలెనని ప్రభుత్వం శాసించింది. ఈ పద్ధతివలన ఇండోనేసియనులు ఎక్కువగా నష్టపడ్డారు. నిర్బంధంతొలగిన వెంటనే చెరుకుపంటను పరదేశజులు, వరిపంటను ఇండోనేసియనులు పండించ నారంభించారు. "పగలు రాత్రి" అను ఈకొత్తనిబంధన వలన వరిపంటదారులగు ఇండోనేసియనులు "బాగాచిక్కులకు లోనైనారు. అందువల్ల నీటిపంపకంలో ప్రభుత్వం "జాతిభేదాలను" పాటిస్తున్నదనే ఆందోళన బయలుదేరింది. డచ్చిప్రభుత్వం బుద్ధిపూర్వకంగా ప్రవేశపెట్టిన ఈజాతిభేదపు నిర్ణయాలను అతిత్వరలోనే ఉపసంహరించుకొన్నది. కాని నియమాలు తొలగింపబడి నప్పటికిని వాటిద్వారా ప్రజలలో బయలుదేరిన జాతిద్వేషాలుమాత్రం తొలగిపోలేదు.

ఇండోనీసియనుల ప్రధానవృత్తిఅయిన వ్యవసాయంలో అనేకములైన కువిధానాలను అమలుపరచి డచ్చిప్రభుత్వం వారిని అన్నివిధములా అణిచివేసింది; వారిఐశ్వర్యాభివృద్ధిని అరికట్టి వారిపై "ద్రోపిడీగాండ్ర" ను పరదేశ వణిజులను అనేకమందిని వర్తకముపేర జావాకు దిగుమతిచేసింది. ఈ విధానంలో సుమారుఒక శతాబ్ది గడుచుసరికి ఇండోనీసియా ఆర్థికవ్యవస్థఅంతా ఇంచుమించుగా పాశ్చాత్యవాణిజ్యసంస్థల హస్తగతమైపోయింది. వ్యవసాయోత్పత్తులనే ప్రధానపరిశ్రమంగాగల పాశ్చాత్య వణిజులు పెద్దపెద్దకంపెనీలను సృష్టించి, ప్రత్యేకమైన వ్యవసాయిక పరిశోధనాగారాలను నెలకొల్పుకొని ఇండోనీసియా సస్యసంపదనంతను గుత్తగొన్నారు. "ది అసోసిఏషన్ ఆఫ్ సుగర్ ప్రొడ్యూసర్సు అనే సంస్థ 1893 లో స్థాపింపబడినది; కాని అచిరకాలంలోనే అదిజావాలోని 95 వంతుల చెరుకుపంటను స్వాధీనం చేసుకొని నూటికినూరుపాళ్ళ లాభాలను ఆర్జించనారంభించింది.

ఇండోనీసియాను వ్యవసాయికంగా మాత్రమేగాక వీలైనన్నివిధములా కొల్లగొట్టుకొనవలెనని డచ్చిప్రభుత్వం తాపత్రయపడింది. కాని తగినంత పెట్టుబడి లేనందునను ఆశతీరనందునను కొద్దికొద్ది మొత్తాలను అనేకరీతులలో పెట్టుబళ్ళపెట్టి డచ్చిప్రభుత్వం అన్ని ఆర్థికరంగాలలోను ఇండోనీసియాను దోచుకొననారంభించింది. ఇందువలన పలువిధములైన పరిశ్రమలు బయలుదేరాయి.

ప్రభుత్వం ప్రారంభించిన ఈ పారిశ్రామిక విధానం ఫలితంగా జావాలోని రైళ్వేలు, ట్రాములు రోడ్లలో సగభాగము, సుమత్రాలోని రైల్వే, ట్రాము రహదారులలో నాల్గింట మూడుపాళ్ళను ప్రభుత్వపు టాస్థులుగా ఒనగూడినవి. 'బాంకా' తగరపుగనులు పూర్తిగా ప్రభుత్వపుసొత్తు. ప్రపంచపు తగరపు ఉత్పత్తిలో ఏడింట ఒకపాలు ఈ గనులనుండి ఉత్పత్తిఅవుతుంది. ఇంతటి అపారమైన ఉత్పత్తిగల ఈ గనులమూలమున 1927 లో డచ్చిప్రభుత్వానికి యాభైమిలియన్ల గిల్డర్లు (అనగా సుమారు ఎనభై

మిలియన్ల రూపాయలు) లాభంవచ్చింది. ప్రభుత్వముద్రణా లయము మిక్కిలిపెద్దది. తూర్పుఆసియాలో ఇంతపెద్ద ముద్రణా లయం మరొకటిలేదు. దీనివలన ప్రభుత్వానికి లభించులాభాలు అపారాలు. ఉప్పుకొఠారులన్నీ ప్రభుత్వానివే. ప్రపంచంలో కెల్లా అత్యుత్తమమైన 'ఉప్పు' ఇచటతయారవుతుంది. దేశం లోని బొగ్గుగనులన్నిటిలోను ప్రభుత్వపు పాటయే అధికమైనది. 1930 లో ఇండోనీసియా అంతటా ఉత్పత్తిఅయిన 18,70,000 టన్నుల బొగ్గులోను, 12,42,000 టన్నులు ప్రభుత్వం స్వతంగా ఉత్పత్తిచేసింది. అంటే ఐదింట మూడుపాళ్ళు బొగ్గుపంట ప్రభుత్వ కైవశమై వున్నదన్నమాట.

ఈవిధంగా డచ్చిప్రభుత్వమే పెట్టుబళ్ళుపెట్టి దేశసంపద నంతను పీల్చుకొంటూవుంటే ప్రభుత్వపు పెట్టుబడులను మించిన పెట్టుబడులు పెడుతూ ఇండోనీసియాలో ప్రవేశించిన పాశ్చాత్య వాణిజ్యసంస్థలుకూడా పెరిగిపోయాయి. ఆయాపాశ్చాత్య వణిజు లకు ప్రభుత్వం బీడుభూములను కౌలుకుఇచ్చి ఇండోనీసియనులచే అందుబలవంతంగా కాయకష్టంచేయించ నారంభించింది. ఇండోనీసి యన్ శ్రామికుల రక్షణభాధ్యతలను తానునిర్వహిస్తున్నట్లుగా నటిస్తూ ప్రభుత్వం వారిచే బీడుభూములలో పాశ్చాత్య వర్తకుల ప్రయోజనాలకొరకు పనిచేయించ సాగినది. ప్రత్యక్షంగా డచ్చి ప్రభుత్వమే ఇట్టి 'కర్షక, కార్మిక' సదుపాయములను కలిగిస్తూ వున్నందువల్ల డచ్చి పెట్టుబడిదారులు మాత్రమేగాక ఇతర పాశ్చాత్య ధనస్వాములుకూడా ఇండోనీసియాలో ధనపుసంచులను విసిరి వివిధములైన పారిశ్రామిక సంస్థలను నెలకొల్పుకొన నారం భించారు. ప్రథమప్రపంచ మహాసంగ్రామం ముగిసినపిదప జావాలో ఈ పరదేశ పారిశ్రామిక సంస్థలు బాగావిజృంభించి, అచటి సంప దను కొల్లగొట్టుకొన నారంభించాయి. 1929 సంవత్సరం నాటికి పాశ్చాత్యపెట్టుబడిదారుల ప్రతాపం జావాలో మిన్నంటినది; అప్ప టికి జావాలో 600 రబ్బరుతోటలు వున్నాయి. ఇవిఅన్నీ బ్రిటిషు, అమెరికన్ ధనస్వాములకు చెందినవి. యు. యస్. రబ్బరు, గుడ్

ఇయర్ రబ్బరు, హూహాయ్, సుమత్రా రబ్బరు కంపెనీలు అనుపేర బ్రిటిషు, అమెరికన్ వణిజులు వాటిని గుత్తగొన్నారు. వీటికి తోడుగా 338 కాఫీతోటలు, 296 టీతోటలు, 145 కొబ్బరి తోటలు, 102 సింకోనాతోటలు, 43 చెరుకుతోటలు, 41 పొగాకుతోటలు, 24 కోకోతోటలు, జావాఅంతటా వెలిశాయి. విస్తృతమైన నూనె గనులను స్టాండర్డు ఆయిల్ కంపెనీ, రాయల్ డచ్చిషెల్ ఆయిల్ కంపెనీలవారు స్వాధీనంచేసుకొన్నారు.

ఈవిధంగా ఇండోనేసియాలో పాశ్చాత్యదేశాలు పెట్టిన పెట్టుబడ్లు 1940 నాటికి హాలెండు 4,500 మిలియనుల ఫ్లోరినులు, బ్రిటన్ 500 మిలియనుల ఫ్లోరినులు, ఫ్రాన్సు, బెల్జియానులు, 120మిలియనులు అమెరికా సంయుక్తరాష్ట్రాలు 100 మిలియనులు, జర్మనీ, ఇటలీ, జపానులు 24 మిలియన్లచొప్పున వున్నట్లుగా లెఖలు తెలుపుతున్నాయి.

ఇండోనేసియా అర్థికరంగంలో పరదేశాలు ఇంతటి బ్రహ్మాండమైన పెట్టుబడ్లు పెట్టినట్లుగానే ఆయాకంపెనీలయొక్క ప్రధానాధికారులుకూడా అధికమైనజీతాలను తీసుకొంటూ వుండేవారు. ఒక్కొక్క కంపెనీమానేజరుకు సాలీనా 30,000 డాలర్లనుండి 75,000 డాలర్ల వరకు జీతంఇవ్వబడుతూ వుండేది.

కంపెనీల మానేజర్లకు పెద్దపెద్ద జీతాలతోబాటు కంపెనీల స్వామిదారులకు విశేషమైన లాభాలు ముట్టుతూ వుండడంవల్ల ఎంతెంతలాభాలువచ్చినా వారివారి ఆశలకు అంతుకనబడలేదు. దేశాన్ని ప్రజలను పీల్చిపిప్పిచేయడమే వారుతమ లక్ష్యంగా పెట్టుకొన్నారు. దీనివలన సాధారణ జావానీయుడు విశేషమైన పేదతనానికి లోనైపోయాడు. సర్వత్రా దారిద్ర్యం నెలకొన్నది. దీనికితగినట్లు కూలీరేట్లుకూడా ఆనాటికానాడు తగ్గుదలనూప నారంభించాయి. కొన్నికొన్ని మారుమూలతావులలో పిల్లలకు రోజుకూలి 5 సెంట్లు (0-3-0) స్త్రీలకు 12 సెంట్లు (0-7-0) పురు

ఫులకు 18 సెంట్లు (0-11-0) ఈసందర్భములో డచ్చి ప్రభుత్వాధి కారి ప్రకటన ఇట్లు చెబుతూవుంది; "యూరోపియనులు, చైనీయు లలోను, ఇండియనులలోను కొంతమంది ఉన్నత తరగతి జీవితాన్ని గడుపుతారు కాని జావానీయులు సాధారణంగా జీవితపరిమాణం చాలా తక్కువగా వుంటుంది.... వారు ఆర్జించునది సామాన్యంగా ఇంత అన్నానికి ఒక ముతకగుడ్డపుగూ తం సరిపోతుంది..." కాని హోలెండు ప్రభుత్వము పత్రికలు ఇండొనీసియాను ఒక "ఐశ్వర్య కేంద్రమని, భూతల స్వర్గమని" వర్ణిస్తూవుంటాయి...!

1929 నాటి ప్రపంచ ఆర్థిక దుస్థితికి గురియై ఇండొనీసి యనులు చితికిపోయినట్లుగా మరొక దేశీయులు కూలిపోలేదు. ప్రపంచంలో ప్రతిదేశము ఈఆర్థిక దుస్థితినుండి తేలుకొనడానికి పటుతర ప్రయత్నాలు చేసివున్నాయి. కాని, ఇండొనీసియా విష యమై హోలెండు ఏమిన్నీ శ్రద్ధవహించలేదు. ఫలితంగా ఇండొనీసి యాలో పరిశ్రమలు దెబ్బతిని దేశీయశ్రామిక వర్గాలు పతనమై పోయాయి. నిరుద్యోగము, నిరాహారము ఇండొనీసియాను చుట్టు ముట్టినవి. 'ఆకలి' కి ఎఱయై పెక్కు ఇండొనీసియన్ ప్రజలు మర ణించారు. ఇండొనీసియన్ పరిశ్రమలలో 'చక్కెర' పరిశ్రమ అన్నిటికంటె విశేషమైన దెబ్బతిన్నది. అట్టిసమయములో ఇండొ నీసియానుండి చక్కెరను తనదేశానికి దిగుమతిచేసికొని, ఇండొనీ సియా చక్కెరపంటను కాపాడడానికిబదులు హోలెండుప్రభుత్వం తనదేశంలోని 'బీటు' దుంపవలన ఉత్పత్తియగు చక్కెరపరి శ్రమ దెబ్బతినగలదను సాకుతో ఇండొనీసియా చక్కెరను హోలెండుకు ఎగుమతిచేయ నిషేధించింది. ఇంతేకాదు; జావా 'కరెన్సీ' కి తక్కువవిలువకట్టి దోచుకొన్నది హోలెండుప్రభుత్వం. జావాకరెన్సీకి బంగారు ప్రమాణమున్నది. అందువల్ల జావాకరెన్సీకి తక్కువవిలువ కట్టడంవల్ల జావానుండి ఎక్కువబంగారు విలువగల నాణెములసరుకు హోలెండుకుఎక్కువగా దిగుమతిఅయినవి. దానిమూల మునజావానీయుల ఆర్థికస్థితి 'మూలిగేనక్కపై తాటికాయపడినట్లు' ఐ, ఛాగావిచ్ఛిన్నమై పోయింది.

ఇండోనీసియాను ఆర్థికంగా దోచుకోవడానికి డచ్చిప్రభుత్వం ఎన్నడును జంకివుండలేదు; ఏట్టివిపత్సమయాలలోనైనా, లెక్క సేయక ఇండోనీసియా సంపదను కొల్లగొట్టుకొని పోవడానికే డచ్చిప్రభుత్వం తాపత్రయపడింది. దీనిఫలితంగా ఇండోనీసియనులు అష్టదారిద్ర్యాలకు లోనైపోయారు. ఇండోనీసియాలో డచ్చివాని సాలుసరి ఆదాయం 30,000 డాలర్లు అయితే జావానీయుని రోజు ఆదాయం 6 సెంట్లు అనగా షుమారు మూడుఅణాల ఆరుపైసలు. డచ్చివానికి జావానీయునికి ఆదాయంలోవున్న ఈఅపారమైనవ్యత్యాసాన్ని గమనించినట్లయితే డచ్చిప్రభుత్వం ఇండోనీసియాను ఎంతటి ఘోరంగా దోచుకొని పోసాగినదో అర్థంఅవుతుంది.

దారుణమైన ఇట్టిఆర్థికస్థితికి లోనైన ఇండోనీసియన్ శ్రామికులకు తమయజమానులను అధికవేతనములను అడుగగల శక్తిలేదు. శ్రామికసంఘాలు లేనందువల్ల వారు 'మూగజీవాలవలె యజమానుని దయాదాక్షిణ్యాలపై ఆధారపడి వుండక తప్పినది గాదు. డచ్చి ప్రభుత్వమైనా ఈ శ్రామికులకు చట్టాలకీత్యా ఎట్టిసదుపాయాలను కలిగించివుండలేదు.

అయినా భారతదేశంలో బ్రిటన్ వలె ఇండోనీసియాకు 'నాగరికత'ను దిగుమతిచేసి, ప్రజలను నాగరికులను చేయడానికి తాను సకలశ్రమలకు లోనైనట్లు, అవుతూవున్నట్లు డచ్చిప్రభుత్వం ప్రకటించుకొంటూవుంటుంది. ఆముఖ్యపద్ధతులను, వైద్యసౌకర్యాలను ప్రభుత్వం కలుగజేసినందువల్ల ఇండోనీసియనులకు మలేరియా జ్వరభయం అంతరించినదట! 1935 వ సంవత్సర ప్రాంతానికి ఇండోనీసియాలో 667 డాక్టర్లు పనిచేస్తూవున్నారు. నాల్గుకోట్ల పదిలక్షల ప్రజలకు ఆరువందల అరువైఏడుగురు డాక్టర్లు డచ్చి పరిపాలనలో ఇండోనీసియాకు లభ్యమైనారు! నిజానికి 1918 సంవత్సరందాకా జావాలో వైద్యకళాశాల అనునది నెలకొల్పబడనే లేదు....!

ప్రపంచ ఆర్థిక దుస్థితి సంభవించిన పిమ్మట అనగా 1930 సం॥ తరువాత జావాలో జనాభాకు సంబంధించిన ఒక విషమసమస్య

మొలకెత్తినది. జావాలో సుమారు 40 మిలియన్ల జావానీయులు, ఒకమిలియను చైనీయులు 2,50,000 వరకు యూరోపియనులు నివసిస్తున్నారు. ఇదిసహజంగా జావా వైశాల్యానికి మించిన మొత్తం. అందువల్లజావాలో నిరుద్యోగము ప్రబలి అధిక జనాభాసమస్య బయలుదేరింది. అంతట జనాభాను తగ్గించవలెనని జావానుండి ప్రజలను ఇతరతావులకు వెళ్ళునట్లుగా ప్రభుత్వం పలుప్రయత్నాలనుచేసి విఫలమైనది. ఇందుకు ముఖ్యకారణం జావాలో ప్రభుత్వం అమలుచేసిన 'నిర్బంధకార్మిక శాసనం' దీనివలన ఒక శ్రామికుడు జావావిడిచి మరియొక దీవికి పోనుద్దేశించినట్లయితే అచట అతడు ఒకయజమానికి నాలుగైదేండ్ల వరకు పనిచేయుదునని ఒక ఖరారునామా వ్రాసి ఇవ్వవలసివుంటుంది. ఇందుకు విరుద్ధముగా అతడు ప్రవర్తించినట్లయితే అతడు నేరముచేసినవాడై శిక్షింపబడుతాడు. ఇట్లు ఖరారు రాసియిచ్చిన శ్రామికునకు యజమాని ఒక నివాసమేర్పరచవలసివున్నది. ఇట్లుగాక, అతడిచ్చుజీతం శ్రామికునకు 'బియ్యం' కొనుక్కోవడానికైనా పూర్తిగాసరిపోదు. అందువల్ల అతడు సదా యజమానికి అప్పులోనే వుంటాడు. ఈకారణంగా ఇండొనీసియన్ శ్రామికులు జావావిడిచి ఇతరదేశాలకు వెళ్ళిపోవడానికి అవకాశాలు లేకపోయాయి. ఫలితంగా జావాలోని దుర్భరఆర్థికదుస్థితికిగురియై జావానీయులే కష్టపరంపరలకు లోనైనారు. గాని డచ్చివారికి ఎట్టి ప్రయాసలు కలిగివుండలేదు.

ఆర్థికదుస్థితినుండి డచ్చిప్రభుత్వం ఇండొనీసియాను తప్పించలేకపోవడమేగాదు; ఆయాప్రయత్నాలలో డచ్చివాణిజ్యరంగంలో 'జపాన్' ను కూడా ప్రవేశపెట్టింది. జపాన్ డచ్చిప్రభుత్వంతో కొన్ని ఒడంబడికలు చేసికొని ఇండొనీసియాలో కాలుపెట్టి ముఖ్యంగా వస్త్రపరిశ్రమను అరచేతపెట్టుకొన్నది.

మొత్తంమీద ఈ ద్వితీయప్రపంచ మహాసంగ్రామం ప్రారంభమవునాటికి ఇండొనీసియాలో వస్త్రపరిశ్రమను జపాను, మోటారుకార్లు, విమానాలు మొదలైనవాటిని అమెరికా, బియ్యపు

మరలను చైనా, మిగిలినవాటిని బ్రిటన్, హాలెండులు గుత్తగొని వున్నాయని స్థూలంగా చెప్పవచ్చు.

ఆర్థికవ్యవస్థనంతను పరదేశీయుల చేతిలోపెట్టి దేశీయుల నందరిని దరిద్రులను చేసిన డచ్చిప్రభుత్వంయెడల ఇండోనేసియను లకు స్వతహా అపారమైన ఆగ్రహము జనించివుంది. వీటికితోడు సైనికవ్యవహారములలో ఇండోనేసియనులకు ప్రభుత్వం ఎట్టి స్థానము ఇచ్చివుండలేదు. ఇందువల్ల ఇండోనేసియన్ అగ్రవర్గా లలో మిక్కుటమైన అసంతృప్తి జనియించినది. డచ్చిప్రభుత్వం ఇండోనేసియాలో 'నల్లమందు' వ్యాపారాన్నికూడా భుక్తపరుచు కొన్నది? ఇది చైనీయులలోనేకాక, తక్కువజాతివారగు ఇండో నేసియనులలోకూడా ప్రభుత్వం యెడల అసంతృప్తిని కలిగించింది. వీటన్నిటినిమించి డచ్చిప్రభుత్వం ఇండోనేసియాలో 'వలసరాజ్య రాబడిపన్ను' అను ఒకకొత్తరకపు రాబడిపన్నును ప్రజలపై విధిం చింది. ఇది ఇండోనేసియాలో సభ్యులు చెల్లించవలసి వున్నది. కూలి తెచ్చుకొనువాడుకూడా నూటికి మూడువంతులుపన్నుగా చెల్లించాలి. చివరకు గృహసేవకులుకూడా ఈపన్నును చెల్లించక తప్పదు.

ఇన్నివిధములుగా డచ్చిప్రభుత్వం ఇండోనేసియనుల ఆర్థిక సంపదలను దోచుకొనడంవల్ల వారుగర్భదరిద్రులుగా మారి పోయారు.

ఇండోనేసియనులలో నూటికి తొంబదిమంది పల్లెలలోనే నివ శిస్తారు. యూరోపియనులలో నూటికి ఎనుబదిమంది పట్టణాలలో నివసిస్తారు. జావాలో నూటికి డెబ్బదిమంది యూరోపియనులు ఇటుకలతోకట్టిన ఇండ్లలో నివసిస్తారు. ఇండోనేసియనులలో నూటికి నల్గురకుమాత్రమే అట్టిఇటికఇండ్లు వున్నాయి. పట్టణాలలో యూరోపియనులుండు తావులకున్న సదుపాయాలు తదితరులుండు చోటులకు ఉండవు. పల్లెల తలప దుర్భరంగావుంటాయి. పూరి ళ్ళు, మట్టికొంపలు బురదనేలలు దారిద్ర్యమే జీవనవస్తువుగా

పల్లెలను ఆవరించివుంటుంది. విద్యాసౌకర్యాలుగాని, వైద్యసదుపాయాలుగాని గ్రామాలలో సకృత్తు. అసలు డచ్చిప్రభుత్వం ఏటి విషయమై ఎన్నడును యోచించి యెరుగదు.

మూడు వందల సంవత్సరాల వ్యవధిలో డచ్చివారు ఇండోనీసియాను ఎన్ని విధాలుగా దోచుకొన వీలున్నదో అన్నివిధములా దోచుకొనడానికే ప్రయత్నించారు. దోపిడీవిధానాన్నే ప్రధానంగా లక్ష్యించిన డచ్చిప్రభుత్వానికి ఇండోనీసియన్ ప్రజలకు మధ్య అన్నిటా అంతరం ఏర్పడింది రానురాను ఒక అగాధంవలె మారిపోయింది. పట్టణానికి గ్రామానికి, పరిశ్రమలకు, వ్యవసాయానికి, పెట్టుబడిదారునికి, శ్రామికునకు, ఐశ్వర్యవంతునికి, పేదవానికి, తెల్లజాతులకు, నల్లజాతులకు, ప్రభుత్వానికి ప్రజలకు మధ్య భిన్నాశయాలు మొలకెత్తి అనుక్షణసంఘర్షణలకు ఆలవాలమైపోయాయి. ఈ భిన్నాశయాలు చివరకు ప్రాచ్యులకు, అప్రాచ్యులకు నడుమ జరుగు సంఘర్షణలుగా పరిణమించుచున్నవికూడ...!



# డచ్ పరిపాలన

ఇండోనేసియాను పర్యటించి వచ్చిన ఒక అమెరికన్ వణి జాడు తిరిగి అమెరికా వెళ్ళి, తన ప్రాచ్య దేశానుభవాలను గురించి పత్రికలలో వ్రాస్తూ ఒకచోట ఇలా అన్నాడు.

"...ఇండోనేసియా అనేది నేడొక పెద్దబందెలదొడ్డి. బందెలదొడ్డిలోని పశువులయెడకంటె ఇండోనేసియనులయెడ డచ్చివారు ఎక్కువనీచంగా ప్రవర్తిస్తూవున్నారు. మానవపరిపాలన అనేది అచటవున్నట్లు నాకుకనపడలేదు. అసలు అచటవున్నది ఒక 'పరిపాలనావిధానం' అని అనడానికే వీలులేదు. రక్తాన్ని త్రాగే రాక్షసితరగూరు చేసుకొన్న ఒకలోహఘయంత్రం అచట పనిచేస్తూన్నది. 'ఇచ్చిపుచ్చుకోనే' పవిత్రమైన వ్యాపారధర్మాన్ని నెరపడానికైనా మానవత్వం వున్నవ్యక్తి ఎవరైనా, మరి ఇండోనేసియాకు పోలేడు..."

ఇండోనేసియాలో డచ్చిపరిపాలనా విధానాన్ని సూక్ష్మంగా ఈ వ్యాసభాగం నిర్వచిస్తున్నది.

డచ్చివారికి 'ఇండోనేసియా' అనేది ఒక 'ఐశ్వర్యఖని' గా లభించింది. ఆగనినుండి భాగ్యభోగ్యాలను దోచుకొంటూ దానిని పాలెంపుకు చేరవేసుకోనడానికే డచ్చివారు అచట ప్రవేశించారు. ఈ దోపిడీవిధానానికి అన్ని సౌకర్యాలను సమకూర్చుకోనడానికే ఒక 'రాజ్యాంగం' అనే తంత్రాన్ని వారచట ప్రవేశపెట్టారు. 1830 సంవత్సరం తరువాత ఇండోనేసియాలో డచ్చివారు తమప్రభుత్వాధికారాన్ని స్థాపించినప్పటినుండి వారచట అమలుపరచిన రాజ్యాంగవిధానాన్ని సమీక్షించి చూచినట్లయితే ఈ పైసత్యం ధృవపడుతుంది.

డచ్చిసార్వభౌమునిచే నియమింపబడిన ఒక గవర్నర్ జనరల్ ఇండోనీసియాపై సర్వాధికారాలను కలిగివుంటాడు. అతని ఉద్యోగకాలపరిమితి ఐదుసంవత్సరాలు. నిజానికి అతడు భారత దేశంలోని వైస్రాయికంటె ఎక్కువఅధికారాలను కలిగివుంటాడు. అంతేకాదు హాలెండుపై డచ్చిరాజుకుగల అధికారాలకంటె ఇండోనీసియాపై గవర్నర్ జనరల్‌కు ఎక్కువ అధికారాలు వున్నదనడంలో అత్యుక్తిలేదు. అతనిసాలుసరివేతనం 1,25,000 డాలర్లు. ఇంతపెద్ద మొత్తాన్ని వేతనంగా ఆర్జించేవ్యక్తి హాలెండులో వేరొకడులేడు.

ఇతనికి పరిశీలనలో సలహాలు ఇవ్వడానికిగాను 'రాడ్ వాన్ ఇండియా' అనుపేర ఒక సలహాసంఘం పనిచేస్తూవుంటుంది. కేవలం 'సలహా' ఇవ్వడంతప్పతే ఈ సంఘానికి ఇతర అధికారాలు ఏమీనియమితమై వుండలేదు. ఈ సంఘంలో సాధారణంగా ఐదుగురు సభ్యులు వుంటూవుండేవారు. ఈసభ్యులు సాధారణంగా హాలెండునుండియే దిగుమతి అవుతూవుండేవారు. ఇండోనీసియా దేశపరిస్థితులెట్టివో తెలియనివీరు పరిపాలనా ప్రయత్నాన్ని చేకొనడంవల్ల ఇండోనీసియనులకంటె డచ్చిప్రజాక్షేమము, హాలెండు దేశప్రయోజనాలు ఎక్కువగా కాపాడబడుతూ వుండేవి. ప్రభుత్వంలో ఇండోనీసియనులకు ఎట్టిబాధ్యతాయుతమైన స్థానమున్నూ లేనందున ప్రజలలో అసంతృప్తి జనించి దేశంలో తీవ్రమైన ఆందోళన బయలుదేరింది. ఫలితంగా 1930 లో సలహాసంఘంలోని సభ్యులసంఖ్య ఐదునుండి ఏడువరకు పెంచబడింది. హెచ్చుచేయబడిన ఆరెండుస్థానాలకు ఇండోనీసియనులనే నియోగించి అందొకరిని ఆసలహాసంఘానికి ఉపాధ్యక్షునిగా నియమించడానికికూడా డచ్చిప్రభుత్వం అంగీకరించింది. అట్లునియమింపబడే సభ్యులు సాధారణంగా ప్రభుత్వోద్యోగాలలో తలనెరిసినవారుగానే వుంటూవుండేవారు. వారికికూడా ఉద్యోగకాల పరిమితి ఐదుసంవత్సరాలు మాత్రమే.

ప్రభుత్వపరిపాలన లో ప్రధానమైనవి మొత్తంఎనిమిదిశాఖలు:- యుద్ధశాఖ, నౌకాశాఖ, ఆర్థికశాఖ, అంతరంగిక వ్యవహారశాఖ,

విద్యాశాఖ, న్యాయశాఖ, పబ్లిక్ వర్క్సుశాఖ, రవాణాశాఖ. ప్రతియొక్కశాఖను ఒకడైరెక్టర్ ప్రధానాధికారిగా నియమింపబడుతాడు. ఇతడు జబాబుదారీ వహించవలసినది గవర్నర్ జనరల్ కుగాని, శాసనసభకు, సలహాసంఘానికి మాత్రంకాదు.

పరిపాలనలో ప్రజాభిప్రాయానికిగాని, ఎన్నికవిధానాలకుగాని చోటులేకపోవడంవల్ల ప్రథమప్రపంచ మహాసంగ్రామానికి పూర్వంనుండి ఇండోనీసియనులు ఆందోళన చేయనారంభించారు. యుద్ధంప్రారంభమైనతరువాత డచ్చిప్రభుత్వం 1916 డిసెంబరు 16వ తేదీని ఇండోనీసియాపరిపాలనకు సంబంధించినఒకచట్టాన్ని తయారు చేసింది. ఆచట్టంప్రకారం 'వాక్సరాడ్' అనుపేర ఒకప్రజాసభను ఏర్పరచడానికి ప్రభుత్వం అంగీకరించింది. ఈసభకు 'సలహా' నిచ్చు అధికారాలు మాత్రమే వుంటాయి. గవర్నర్ జనరల్ తనకు ఆవసరమైన వాటినిగురించి అనగా 'బడ్జెట్' విషయంలో ఈసభయొక్క సలహాలను వింటూవుంటాడు. సంవత్సరానికి రెండు పర్యాయములు ఈసభ సమావేశమవుతుంది; ఒకతూరి బడ్జెట్ ను ఆమోదించడానికి, రెండవతూరి తదితరవిషయాలను గూర్చిచర్చించడానికిని.

ఈచట్టాన్ని అనుసరించి 1819 సం॥ లో మొట్టమొదటగా ఇండోనీసియాలో 'ప్రజాసభ' 'వాక్సరాడ్' సమావేశమైంది. కాని ఆసమావేశంలో సభ్యులు ప్రభుత్వవిధానాన్ని తీవ్రంగా విమర్శించారు. ప్రజాసభకు 'సలహా' ఇచ్చుటకంటె ఎక్కువఅధికారాలు వుండాలని వారుసూచించారు. శాసనాలను చేయడానికైనా ఆసభకు అధికారాలు లేకపోవడంవల్ల దానిప్రయోజనం ఏమీవుండదని, శాసనాలను చేయనధికారంలేని 'అశాసనసభ' తమకు అంగీకారంకాదని వారు అసంధిగ్ధంగా ఉద్ఘాటించారు.

ఇండోనీసియాలో ప్రజాసభయందు ఇట్టిఅసంతృప్తి విమర్శనలు బయలుదేరిన దానికితోడుగా అటుహాలెండుకూడా సోషలిష్టువర్గంవారి అల్లరులు పొడసూపినవి. హాలెండుఅంతటా ప్రజలు తిరుగబడి ప్రభుత్వంతో పెక్కుసంఘర్షణలకు తలపడ్డారు.

హాలెండులోని ప్రజాందోళనయొక్క ప్రతిధ్వనులు ఇండోనీసియాలోకూడా బయలుదేరవచ్చునని భయపడి డచ్చిగవర్నర్ జనరల్ 'ప్రజాసభ' యెడల సమాధానభావంతో ప్రవర్తించాలని తాపత్రయపడ్డాడు. 'రాజ్యాంగసంఘర్షణల' ద్వారా ప్రజలకు ఇంకాఅదనపు సౌకర్యాలు కలుగచేయడానికి తాను సంసిద్ధుడనై వున్నట్లు ప్రజాసభకు వాగ్దానమిచ్చాడు. అతడు సూచించిన సంస్కరణలు స్థూలంగాఇవి:

నెదర్లాండ్స్ (హాలెండు) రాజ్యాంగచట్టంలోని 'వలస దేశాల' కు సంబంధించిన సూత్రాలు సంస్కరించబడతాయి.

'వలసదేశాల'కు సంబంధించినసూత్రాలు సంస్కరించబడతాయి. ఇందువల్ల తూర్పుఇండియా దీవులకు 'వలసలు' అనేపేరులేకుండా పోతుంది. ఇండోనీసియా పరిపాలనకు సంబంధించిన అంతరంగిక వ్యవహారాల నన్నింటిని ఇండోనీసియా ప్రభుత్వ గవర్నర్ జనరల్ తనఇష్టమొచ్చినట్లు సరిచూచుకోనడానికి అంగీకరింపబడింది కాని ఆయామార్పులను అంగీకరించు అధికారంమాత్రం హాలెండు ప్రభుత్వానికివుంటుంది. ఇకనుండి డచ్చిస్టేట్సుజనరల్ ఇండోనీసియాకు వలసిన శాసనాలను తయారుచేయడానికి సర్వాధికారాలను కలిగివుంటాడు; కాని, ఆశాసనాలను చేయడానికి ముందుగా అతడు 'వాక్సరాడ్' అనే ప్రజాసభకు వాటిని నివేదించి సభ్యుల అభిప్రాయాలను కూడా స్వీకరిస్తాడు.

1925 లో తయారుచేయబడిన తూర్పుఇండియా ప్రభుత్వ చట్టం సవరించడానికి కూడా డచ్చిప్రభుత్వం అంగీకరించింది. ఇందువల్ల హాలెండులోని వలసరాజ్యమంత్రితో నిమిత్తంలేకుండా ఇండోనీసియా గవర్నరుజనరల్ స్వతంత్రంగా వ్యవహరించవచ్చు. 'రాడ్ వాన్ ఇండియా' అనే సలహాసంఘానికి సలహాలిచ్చు అధికారాలుకూడా పరిమితంచేయబడ్డాయి. 'వాక్సరాడ్', అనే ప్రజాసభకు స్థానికపరిపాలనకు సంబంధించినంతవరకు శాసన నిర్మా

ణాధికారాలు ఇవ్వబడినవి. ప్రజాసభలో ఇండొనీసియన్ సభ్యుల సంఖ్య పెంచబడింది. ఇండొనీసియాను కొన్ని రాష్ట్రాలుగా విభజించడానికికూడా ఏర్పాటుఐంది. వాక్సరాడ్ సభ్యత్వం 49 నుండి 60 వరకు పెంపుచేయబడింది. ఓటింగుహక్కు నూటికి ఒకటిగావుండునట్లు కూడా నిర్ధారితమైంది.

డచ్చిగవర్నర్ జనరల్ రాజ్యాంగంలో ఈ పైమార్పులను కొనితేవడానికి అంగీకరించినట్లుగా ప్రకటించి దేశంలో అలజడులు పొక్కకుండా శాంతిని కాపాడవలెనని ప్రయత్నించాడు. కాని ప్రజాసభ ఈ సంస్కరణలనుకూడా ఆమోదించలేదు.

ముఖ్యంగా ప్రజలలో ఇందువిషయమై అమితమైన అసంతృప్తి బయలు దేరింది. వాక్సరాడ్‌లో ఇండొనీసియనులకు సంబంధించిన సభ్యత్వపుసంఖ్య అల్పసంఖ్యాకంగా వుండడం అనగా 60 లోను ఇండొనీసియనులకు 25 సభ్యత్వస్థానాలు వుండం వారికి అంగీకారంకాలేదు. అందువల్ల దేశంలోపెద్ద ఆందోళన బయలు దేరింది. ప్రజలతిరుగుబాట్లు ఒకవంక, ఉద్యమాలు వేరొకవంక చెలరేగి పరిపాలనలో ఇంచుమించుగా ప్రతిష్టంభన ఏర్పడింది. 'వాక్సరాడ్' లోని ఇండొనీసియన్ సభ్యత్వస్థానాలసంఖ్య ఇంతపరిమితంగా వుండడం ఇండొనీసియనులకు మాత్రమేగాక ఇండొనీసియాలోని డచ్చిప్రజలకుకూడా అంత న్యాయమైనదిగా గోచరించలేదు. అంతటవారుకూడా ఈ అన్యాయ విధానాన్ని బహిరంగంగా విమర్శించ నారంభించారు. ఫలితంగా 1929 లో వాక్సరాడ్‌లోని ఇండొనీసియన్ సభ్యులసంఖ్య 25 నుండి 30 వరకు పెంపుచేయబడింది. ఈ సంస్కరణమున వాక్సరాడ్ లోని మొత్తం 60 సభ్యత్వస్థానాలలోను 30 ఇండొనీసియనులకు, మిగిలిన 30 లోను 25 యూరోపియనులకు, నాలుగు చైనీయులకు, 1 అరబ్బులకు ప్రత్యేకించ బడినవి.

శాసనసభలో ఇండొనీసియనులకు అధిక ప్రాతినిధ్యం లంభించడంతో దేశంలో ఒకింతశాంతి నెలకొన్నది. ప్రజావర్గా

లలో శాసనసభాజీవితం ప్రారంభమైనందువలన రాజకీయంగా ప్రజలహక్కుకు కొంతవిలువ లభించింది. కాని ఆశాసనసభవలన ప్రజలకుకలిగిన అధిక ప్రయోజనాలుమాత్రం నామమాత్రమే. కారణం? శాసనసభకు నొసగబడిన అధికారాలు చాలాపరిమితమైనవి. రాజకీయ ప్రయోజనాలను ఆసభ ఏకొలదిపాటుగానో సాధించగలిగినదిగాని ప్రజలఆర్థికస్థితిని అభివృద్ధిపరచే సౌకర్యాలను ఏమాత్రమూ చేయలేకపోయింది.

ముఖ్యంగా ప్రభుత్వయంత్రంలోగలలోపం ద్వంద్వప్రభుత్వవిధానం. చిన్నచిన్నరాజులు, జమీందారీలు, భూస్వాములు ఇండోనీసియాఅంతటా చెల్లాచెదరుగావున్నారు. వీరిద్వారాడచ్చిప్రభుత్వం రాజ్యపాలన చేస్తూవుంటుంది. రాజకీయమైన ఏసంస్కరణ కొని తేవడానికైనా ఈ జమీందారీ, భూస్వామివర్గాల అవరోధం మిక్కిలిగా వుంటూవుంటుంది. డచ్చిప్రభుత్వం అయినదానికీ, కానిదానికీకూడా ఈ భూస్వామివర్గాలను అడ్డుగాపెట్టుకొని ప్రజల రాజకీయాభివృద్ధిని అరికట్టుతూవుంటుంది. ఈ విధంగా సుమారు 20 సంవత్సరాలు గడిచినప్పటికిని ఇండోనీసియన్ ప్రజానీకం రాజకీయంగాకూడా విశేషఫలితాలను ఆర్జించలేక పోయారు.

దీనికితోడుగా వివిధరాష్ట్రాల పరిపాలనలో కూడా ఒకే ఒక విధమైన పరిపాలన ఏర్పడలేదు. దేశంఅంతా రాష్ట్రాలుగా విభజింపబడినందువలన ఒకొక్క రాష్ట్రానికి ఒకొక్క గవర్నరో, లేక రెసిడెంటో అధికారం వహిస్తూవుండేవాడు. డచ్చిపాలకుల ఆర్థికప్రయోజనాలకు అనుగుణమైన పరిపాలనా విధానం ఆయారాష్ట్రాలలో అములుజరుగుతూ వుండేది. ఈ పరిపాలనలో భూస్వామివర్గాల ప్రత్యేకాధికారులు ప్రజలకు నిత్యనూతనమైన ఇక్కట్టులను కొనితెస్తూవుండేవారు.

ఈ రాష్ట్రాలవిభజన, అందు భూస్వామివర్గాలద్వారా జరుగుతూ వుండిన ద్వంద్వప్రభుత్వ విధానము ప్రజలకు సంతృప్తిలేయ

లేదు. అందువలన తిరిగి దేశంలో ఆందోళన బయలు దేరింది. ఫలితంగా 1938 లో డచ్చిప్రభుత్వం మరికొన్ని నూతన సంస్కరణలను అమలుపరచింది.

వివిధ రాష్ట్రాలనన్నిటిని రద్దుచేసి ఉయోగ వర్నర్లను, రెసిడెంట్లను తొలగించి ఇండొనీసియానంతను మూడు పెద్దరాష్ట్రాలు గా డచ్చిప్రభుత్వం పునర్విభజనచేసింది. మూడురాష్ట్రాలకు ముగ్గురు గవర్నరులు పరిపాలనా బాధ్యతను నిర్వహిస్తూవుంటారు. ఈ నూతనవిధానంవలన ఇండొనీసియనులకు చిల్లరగవర్నర్ల అధికారము, భూస్వాముల పీడతొలగిపోవడమేగాక పరిపాలనలో కూడా కొంత అధికమైన పాలు లభించింది.

పరిపాలనలో ఇండొనీసియనులకు వెనుకటికంటె అధికమైన పాలు లభ్యమైనప్పటికిని అది అధికార, బాధ్యతలు అంతగాకలిగినవి కాక కేవలము గుమాస్తా తాహతువంటిది కావడంవల్ల ఇండొనీసియనులకు ఆశించినంతగా రాజకీయ ప్రయోజనాలు లభించలేదు.

శాసనసభ వుండినప్పటికి, దానికి స్థానికమైన కొన్ని శాసననిర్మాణాధికారాలు ఉండినప్పటికి ప్రజలకు సరియైనరాజకీయోన్నతి కలుగకపోవడానికి గవర్నర్ జనరల్ కుఉన్న 'సలహాసంఘం' ప్రధానకారణంఐవుంది. ప్రజలపై పరిపాలనసాగించు ప్రజామంత్రులు లేరు. శాసనసభచేసిన చిన్నశాసనాలను అమలుపరుచునది గవర్నర్ జనరల్, అతని సలహాసంఘమును. శాసనసభచేసిన శాసనాలను అమలుపరచడానికి శాసనసభకు బద్ధులైన మంత్రులుగాని, శాఖాధిపతులుగాని లేకపోవడంవల్ల శాసనసభ నిష్ప్రయోజనమైనది; ప్రజలు నోరులెనివారైపోయారు. ఇందువల్ల గవర్నర్ జనరల్ నియంతృత్వం పేరుకేగాని, కార్యరూపేణా ఏమాత్రమూ తగ్గలేదు. 'ప్రజాస్వామ్య సూత్రాలను' అమలు పరచినామని పైకి ప్రకటించి డచ్చిప్రభుత్వం కార్యరూపేణా వాటిని వమ్ముచేసింది. 'శాసనసభ' అనుదానిని ఏర్పరచి దానిఅధ్యక్షుణ్ణి ఆసభ్యులు ఎన్ను

కొనడంకాకుండా హాలెండుప్రభుత్వమే అధ్యక్షుణ్ణినియమించి, సభ్యులహక్కులను హరించింది. 'శాసనాలు' చేసుకోవచ్చునని శాసనసభల ఏర్పరచి వాటికి చిల్లరశాసనాలను చేసుకొనే హక్కును మాత్రమేఇచ్చి, అసలైనశాసనాలను హాలెండునుండియే దిగుమతిచేసి డచ్చిప్రభుత్వం "శాసనసభ, ప్రజాస్వామ్యము" అనువాటినే హాస్యాస్పదం చేసివేసింది.

డచ్చివారు ఇండోనీసియాలో రాజకీయంగా కలుగజేసిన 'ఉన్నతి' ఇంతటి 'నేతిబీరకాయ' వంటిది. రాజకీయంగా ఇట్టి అల్పమైన అభివృద్ధిని పొందినట్లుగానే ఇండోనీసియనులు డచ్చి పరిపాలన విద్యా, ఆర్థిక, సాంఘిక వృత్తులలో పొందినదుర్దశ ఒకిపాటిదికాదు; వర్ణింప నశక్యమైనదది...!

## * విద్య

డచ్చిసామ్రాజ్య విధానానికి గురియై పతనమైపోయిన వాటిలో ప్రప్రథమంగా పేర్కొనదగినది ఇండోనీసియనుల విద్యా విధానం:—

విద్యాశాఖ అనునది ప్రభుత్వప్రధాన శాఖలలో ఒకటి. కాని ఈశాఖ ఇండోనీసియనులలో ఉత్తమవిద్యా ప్రబోధానికి కృషి చేయడానికిబదులు, వారివిద్యనే అరికట్టివేసింది. అసలు ప్రాథమిక విద్యావిధానమనునది లేనేలేదు. మారుమూలల పల్లెలలో తరతరములనుండి అనుసృతంగా వస్తూవుండిన ఆచారాలనుబట్టి ఏఒకటో రెండో వీధిబడులున్నప్పటికిని,వాటికి ప్రభుత్వపోషణలేమ ప్రజలలో ఆర్థిక దారిద్ర్యం విరివిగా వుండటంవల్ల వాటికీవిద్యా విధానంపై ఆశక్తినశించింది. ఆర్థికపుష్టిగల్గిన భూస్వాములకీ ప్రమేయమేలేదు. అందువల్ల సాధారణప్రజలలో విద్యాగంధమేలేదు. బాలుడైనా, బాలికయైనా, పుట్టిననాటినుండి పొట్టకొరకు ఊడిగములను చేయడంతోటే సరిపోతున్నది.

ఇక ప్రభుత్వంకూడా ప్రజలలో నిర్బంధవిద్యావిధానాన్ని ప్రవేశపెట్టలేదు. ఇండోనీసియన్ ప్రజలు తప్పనిసరిగా చదువుకోవలెనన్న నియమంలేదు. కాని, డచ్చివారి బిడ్డలకుమాత్రం విధిగా చదువుచెప్పే ఉచితపాఠశాలలు వలసినన్ని నెలకొల్పబడినవి. ఏమాత్రపు సంపన్నగృహస్థుడైనా తనబిడ్డలకు చదువుచెప్పించవలెనని మంచిపాఠశాలలకు వారినిపంప యత్నించినట్లయితే అందుకు స్థానికమైన బండెడు అవరోధాలు వున్నాయి. డచ్చి ప్రభుత్వోద్యోగులు ముందుగాఆబిడ్డల తల్లిదండ్రుల రాజకీయాశయాలను గురించి కొంతకాపీతీసి, వారినడవడి ప్రమాదకరమైనది కాదనే ధృవపత్రం ఇవ్వవలసివుంటుంది. ఆధృవపత్రం లభించి, అమితమైనవ్యయాన్ని భరించి చదువుచెప్పించడానికి తల్లిదండ్రులు సమ్మతించిననేగాని ఇండోనీసియన్ బిడ్డలకు ఉత్తమవిద్యాసంపర్కం లభించదు. ఇన్ని చేసినా ఇండోనీసియన్ బిడ్డలకు ప్రవేశం లభించేది 'సెకండర్ గ్రేడ్' పాఠశాలలో మాత్రమే...! ఇక అట్టిసెకండర్ గ్రేడు పాఠశాలలు' కూడా వలసినన్ని లేవు. పట్టణములు అనుకున్న వాటిలోనే ఇట్టిపాఠశాలలు అరుదుగా నెలకొల్పబడినవి.

ప్రభుత్వం నిర్వహించే విద్యావిధానంలో రెండు ప్రధానమైన శాఖలున్నవి; ఒకటి యూరోపియన్లకు, వేరొకటి ఇండోనీసియన్లకును. యూరోపియన్లకు చెప్పేచదువంతా పాశ్చాత్యవిద్యావిధానాన్ని పోలివుంటుంది. అందు అన్ని తరగుతుల విద్యాపద్ధతులున్నవి. కాని ఇండోనీసియనులకొరకు తయారుచేయబడిన విద్యావిధానంలో ఇట్టిఅవకాశాలు ఏమాత్రమూ లేవు. అసలు ఆవిద్యావిధానమంతా ఇండోనీసియనులను 'బానిసలు' గా వుంచడానికే ఉపకరించునట్టిదిగా వుంటుంది.

ఇక ఇండోనీసియనులకు గరపే విద్యావిధానంలోకూడా రెండుతరగతులున్నవి. అందు మొదటితరగతి విద్యావిధానంలో ఐదేండ్లు చదువుపద్ధతి ఒకటి వున్నది. ఈ చదువువల్ల విద్యార్థి ఉద్యోగానికిగాని, వర్తకంచేసుకొనడానికిగాని తగిన

అర్హతలను పొందుతాడు. రెండవతరగతి విద్యావిధానం ఒకమాదిరి ప్రయిమరీ విద్యావిధానాన్ని పోలివుంటుంది. దీనివలన ప్రయోజనం కూడా అంతంతమాత్రంగానే వుంటున్నది.

గుమస్తాగిరికి వలసిన ఉన్నతవిద్య యూరోపియన్ పాఠశాలలో మాత్రమే లభిస్తుంది. ఈవిద్య నభ్యసింపవలెనంటే అది వ్యయప్రయాస కరమేకాక, డచ్చిభాషాప్రవేశంకూడా వుంటేనే గాని వీలుపడదు. దీనివలన ఇండోనీసియనులు ఇట్టిచదువులకుచాలా స్వల్పంగా వస్తూవుంటారు. విద్యావిధానంలో ఇట్టితంత్రాలన్నీ ఏర్పరచడంవల్ల ఇండోనీసియనులకు అదిఅందని ద్రాక్షపండై వారిలో విద్యాప్రభోధం దానంతట అదేతరిగిపోయింది. ఫలితంగా వారిలో చదువుయెడల అభిలాషవున్నా చదువుకున్నవారిసంఖ్య క్రమేపీ క్షీణించిపోయింది.

ఇండోనీసీయాలో ఈనాడు చదువుకొన్న ఇండోనీసియనులు 37,46,000 మాత్రమే; అంటే మొత్తంజనాభాలో నూటికి 6 . 4 వంతులుమాత్రమే నన్నమాట. కాని, విద్యాసౌకర్యాలు వుండటం వల్ల యూరోపియన్లలో విద్యబాగాపెంపొంది వున్నది. వారిలో నూటికి 75 . 2 వంతులవరకు చదువుకున్నవారున్నారు.

అయితే డచ్చిప్రభుత్వం దామాషాను మనిషి 1 కి అర్థ రూపాయి చొప్పున విద్యకొరకు వెచ్చిస్తూవున్నట్లు చెబుతూవుంది. అంటే ఈ ధనమంతా ఇండొనీసియాలోని యూరోపియన్ల విద్య కోసమే డచ్చిప్రభుత్వం వినియోగిస్తూవున్నదని తేలుతూవుంది.

## * వైద్యం

విద్యవలెనే ప్రజారోగ్యశాఖకూడా డచ్చిపరిపాలనలో పూర్తిగా అలక్ష్యించబడింది.

ఇండోనీసియాలో పట్టణాలకంటె పల్లెలేఎక్కువ. పట్టణాలు, ఏఒకటో, రెండోతప్ప మిగిలినవన్నీ అనారోగ్య నిలయాలుగా వుంటాయి. ఇకపల్లెలు కేవలం నరకకూపాలే. ఇండోనీసియా

అంతటా ఏటికేడాది వర్షాలువుండటంవల్ల గ్రామాలన్నీ బురద ఓడుతూవుంటాయి. ఇందువల్ల ఇచట మలేరియా వ్యాధితరచు భీభత్సస్వరూపం దాల్చుతూవుంటుంది. ఈ మలేరియావ్యాధిని నిర్మూలించడానికి డచ్చిప్రభుత్వం విశేషమైన ధనాన్ని వ్యయపరచింది. కాని ఫలితం నామమాత్రమే. "గ్రామాలు ఆరోగ్యనిలయాలు కానంతవరకు మలేరియా నిర్మూలనం జరగడం అసంభవం" అని ప్రజానాయకులు గగ్గోలు పెడుతూవున్నా డచ్చిప్రభుత్వం గ్రామ సీమల ఊసుపట్టించుకోదు.

ప్రజారోగ్యం హీనదశలో వున్నప్పటికిని ప్రభుత్వం తగినన్ని సౌకర్యాలను సమకూర్చలేదు. ఇండోనేసియా అంతటా 667 గురు వైద్యులువున్నట్లే, 384 ఓషధీ ఔషధ శాలలకంటె ఎక్కువలేవు; 700 మంది మంత్రసానులకంటె అధికంలేరు. ఔషధశాలలన్నీ యూరోపియన్ల చేతిలోనే వుంటవి. వారురాత్రులప్పుడు ఆశియా జాతులవారికి మందులు కావలసినా అమ్మరు. ఏదైనా అత్యవసరంగా మందుకావలెనంటే యూరోపియన్ వైద్యునివద్దనుండి ధృవపత్రంవుండాలి. డాక్టర్లుకూడా సాధారణప్రజలకు అందుబాటులోవుండరు. రోగియింటికి రావాలంటే వైద్యుడు ఒకొక్క సారి నూరునుండి రెండునూర్ల రూపాయలవరకు రుసుముక్రింద వసూలుచేస్తాడు. అందువల్ల డాక్టర్ల సౌకర్యాలు ఏధనస్వామికో కాని సాధారణ తరగతులవారికి లభించవు.

### * ఆర్థికరంగం

"...ప్రపంచంలోకెల్లా ఐశ్వర్యవంతమై, పాడిపంటలకు, ఖనిజ, వృక్షసంపత్తికి నిలయమైవున్న ఇండోనేసియాలో ఇండోనేసియనులకు నేడు కడుపునిండా కూడు వంటినిండా బట్ట లేదు; వారుకేవలం బానిసలు...మానవునిచే చేయబడిన బానిసలు. డెబ్బదిలక్షలమంది డచ్చివారి భాగ్యభోగ్యాలకోసము, కేళీవిలాసమయజీవనంకోసం ఏడుకోట్లమంది ఇండోనేసియనులు బానిసజీవనం గడుపుతున్నారు..."

ఇండోనేసియా జాతీయనాయకుడొకడు ఇండోనేసియనుల దారిద్ర్యాన్నిగూర్చి ఒకసారి ఇట్లు ప్రకటించాడు. ఇండోనేసియనుల ఆర్థికపుస్థితిగూర్చి చెప్పుకొనవలెనంటె ఇంతకంటె అర్థవంతమైన ప్రకటన వేరొకటి వుండదు.

ఐశ్వర్యసంపన్నమైన ఇండోనేసియాపాలిట జలగలా డచ్చి పరిపాలనావిధానం అచట పనిచేస్తున్నది. ఇండోనేసియా ఐశ్వర్యాన్ని జలగ రక్తం పీల్చినట్లు డచ్చివారు పీల్చుకుంటున్నారు.

వాణిజ్యమే ప్రధానమైన ప్రభుత్వధర్మం రాజ్యపరిపాలనా విధానం వాణిజ్యాన్ని ప్రధానంగా లక్ష్యించేది కావడంమాత్రమే గాక దేశంలోని సర్వవిధములైన వృత్తులను డచ్చివారు ఆక్రమించుకున్నారు. ప్రధానమైన వాణిజ్యసంస్థల మొదలుకొని తమలపాకుల అంగడివరకు ఇండోనేసియాలోని వర్తకాన్ని అంతనూ డచ్చివారు గుత్తకుపుచ్చుకున్నారు. డచ్చివణిజులకు 'మాడోరా' ఉప్పుకొటారుల నుండి అపారమైనలాభాలు లభిస్తూవుంటాయి. ఇవికాక నల్లమందు పొగాకుఅంగళ్ళు, క్వినైన్, టేకు, రబ్బరు, పెట్రోలు, తగరము, కొబ్బరి, సింకోనా, వరి, చెరుకు, వెండి, బంగారము మొదలైనవన్నీ ప్రభుత్వం తరఫుననూ లేక, ప్రభుత్వ ప్రోత్సాహంవున్న ప్రత్యేక యూరోపియన్ వాణిజ్యసంస్థల ద్వారానో నిర్వహింపబడుతూవుంటాయి. వీటికితోడు తపాలా, టెలిగ్రాఫ్, టెలిఫోన్, రైల్వేలు, హార్బర్లు, రహదారులు మొదలైనవన్నీ డచ్చివారి ఆధీనంలోనేవుండి అపారమైన ధనాన్ని దోచుకుంటూ వుంటాయి.

ఆర్థికరంగమంతా డచ్చివారికి కైవశమై వుండటంవల్ల ఇండోనేసియనుల ఆదాయం చాలా హీనమై పోయింది. 1939 లెక్కలప్రకారం ఒకఇండోనేసియన్ ఆదాయం రోజుకి 9 పైసలు.

ఈ తొమ్మిది పైసలతోను ఇండోనేసియన్ వ్యక్తిదామాషా జీవితం ఒక ప్రత్యక్షనరకం-అతడు ఒకజీవచ్ఛవమై బ్రతుకుతూ వున్నాడు....!

## * న్యాయం

విద్యావిధానంవలెనే ఇండోనేసియాలో డచ్చివారికి ఒకన్యాయశాస్త్రము, ఇండోనేసియనులకు వేరొకన్యాయశాస్త్రము అమలులోవుంది.

యూరోపియన్‌లను విచారించే న్యాయస్థానాలు వేరు; ఇండోనేసియన్‌లను విచారించే న్యాయస్థానాలు వేరు. యూరోపియన్ న్యాయస్థానాలలో ఇండోనేసియన్ న్యాయవాదులకు, న్యాయమూర్తులకు ప్రవేశంలేదు; కాని ఇండోనేసియన్ న్యాయస్థానాలలో యూరోపియన్ న్యాయమూర్తులకు, న్యాయవాదులకు ప్రవేశముంది. ఇండోనేసియన్ న్యాయస్థానాలలో ఇండోనేసియన్ న్యాయమూర్తులే న్యాయవిచారణ చేస్తారు. వారుఅనుసరించే న్యాయశాస్త్రం పూర్వంనుండి ఇండోనేసియాలో ఆచారపరంపరగా వస్తున్నదానిని అనుసరించివుంటుంది. కాని డచ్చిన్యాయస్థానాలలో అనుసరించే న్యాయశాస్త్రం అంతా హాలెండులో తయారై వచ్చినదే. ఈ న్యాయస్థానాలకు అధికారాలు చాలా తక్కువ. కాని ఇండోనేసియన్ న్యాయస్థానాల చర్యలుమాత్రం యమదండనలను పోలివుంటాయి.

అసలు ఇండోనేసియాలో డచ్చిన్యాయస్థానాలు అనుసరించే విధానమంతా పరికిస్తే అదిన్యాయశాస్త్రమో, లేక ఒకలాంఛనమో అని తోచకమానదు. డచ్చివారుతమ సౌకర్యాలకు అనుగుణంగా కష్టాలులేనట్లుగా; తమకుతోచినరీతిని న్యాయసూత్రాలను తయారు చేసికొన్నట్లుగా కనబడుతుంది.

అచటిన్యాయస్థానాల ధోరణినిగురించి 'విల్లీస్' అను ఆంగ్ల ప్రముఖుడు వ్రాసిన ఒకటిరెండు విషయాలను గూర్చి మచ్చుగా చెప్పుకోనడం ఈ తరుణలో ఉచితమైవుంది.

ఒక డచ్చిఅపరాధిని వేరొక డచ్చి న్యాయాధికారి డచ్చి న్యాయస్థానంలో విచారణచేస్తాడు. 'విచారణ' కూడా చాలా స్వల్పకాలంలో ముగిసిపోతుంది. ఈ తతంగం అంతాఅయిన తరువాత 'శిక్ష' ను చెప్పిన్యాయాధికారి "శిక్షితుడు తనశిక్షను ఎప్పటి

నుండిఅనుభవించడానికి నిశ్చయించుకొన్నదీ తెలియచేయమని" అతణ్ణి అడుగుతాడు. అప్పుడాడచ్చి శిక్షితుడు "రేపు నాకు తీరదు; బుధ గురువారాలలో నా ఇంట కొంతమందిమిత్రులకు నా భార్య విందు చేస్తుంది. శుక్రవారంనాడు నా బంధువుల దినవారాలకు వెళ్ళ వలసివుంది; అందువల్ల శనివారంకూడా రాలేను..." అంటూ వారంపొడుగునా వున్న తన అభ్యంతరాలను ఏకరువెడతాడు. అంతట న్యాయాధికారి దీర్ఘాలోచనచేసి "అట్లయితే శనివారము ఒంటిగంట అయినతరువాతవచ్చి, సాయంత్రం వెళ్ళిపోయి, తిరిగి సోమవారంనాడు హాజరై సాయంకాలం వెళ్ళిపో. అంతటితో నీకు విధించినశిక్ష పూర్తిఅయిపోతుంది. నీపనులు చూచుకుంటూనే శిక్షను అనుభవించాలి. మనంన్యాయశాస్త్రాన్ని ధిక్కరించకూడదు సుమీ..." అని అతడికి చక్కగా బోధిస్తాడు.

ఇండోనేసియాలో డచ్చివారి న్యాయచట్టాలు ఇంత మెత్తగా, చాకగా డచ్చివారిపట్ల పనిచేస్తున్నాయి. ఇది ఆశ్చర్యకరంగా వుండవచ్చునుగాని ఇండోనేసియాలో యదార్థంగా డచ్చి పాలకులు తమజాతివారిఎడ అమలుపరచిన న్యాయచట్టాలుమాత్రం ఇట్టివిగా వున్నాయి.

అయితే ఇండోనేసియాలో నివసిస్తూవున్న డచ్చివారు మినహాగా తదితర ఆసియాజాతులవారిపట్ల ఇట్టిన్యాయచట్టాలు అమలుకావు. వారికొరకై ప్రత్యేకంగా హాలెండులో తయారు కాబడిన చట్టాలు ఇండోనేసియాకు దిగుమతిఅయి అమలు జరుగుతూ వుంటాయి. చట్టాలు అతిచురుకుగా అతివేగంగా పనిచేస్తూ వుంటాయి. ఇందుకు ఒకఉదాహరణ:

డచ్చివారు సైకిళ్ళమీదపోయేరోడ్డు చెడిపోయింది. సైకిళ్ళ మీదపోతూ డచ్చివారు రోడ్డుమీదవున్న పోలీసులకు కనుసౌజ్ఞచేస్తారు. వెంటనే ఆరోడ్డుమీదపోయే ఇండోనేసియన్లను చైనీయులను పట్టుకొని పోలీసులువారిని న్యాయాధికారివద్దకుతీసుకొని పోతారు. ఆన్యాయాధికారి "డచ్చివారు సైకిళ్ళమీద పోయే రోడ్లను పాడుచేశారు; అని వారిపై నేరారోపణచేసి 'ఆరోడ్డు

నంతా మరమ్మత్తు చేయడమే దానికిశిక్ష' అని తీర్పుకూడా చెప్పే స్తాడు. తీర్పుప్రకారం వారారోడ్డును మరమ్మత్తు చేసితీర వలసినదే...!

డచ్చివారిదగ్గర పనిచేసే ఇండొనేసియన్ నౌకరు, తనయజమాని పెట్టేయాతనలను భరించలేక అతనిపై ఫిర్యాదుచేయవలెననే కోరికతో డచ్చిన్యాయాధికారివద్దకు పోతాడు. ఆనౌకరు తనవద్దకు ఎందుకువచ్చాడో ఆన్యాయాధికారి త్రుటిలో గ్రహించి అతణ్ణి జైలుఖానావద్దకు తీసుకుపోయి 'ఎందుకువచ్చావు?' అని ప్రశ్నిస్తాడు. ఆనౌకరుకొండంతఆశతో తనయజమానునిపై ఫిర్యాదునంతా న్యాయాధిపతికి నివేదించుకుంటాడు. అంతట ఆన్యాయాధికారి ఎగాదిగాచూచి, సరే...విన్నానుగదా, నీవికవెళ్ళు-మంచిగావుండు. కష్టపడి పనిచేస్తే నీకేలాభం. అవసరమైతే నిన్ను పిలుస్తానులే...'' అని చెప్పి వాణ్ణిపంపించివేస్తాడు. ఆనౌకరు జైలు మొదలయినవాటినన్నిటిని పరకాయించి, డచ్చియజమాని మీద ఫిర్యాదు చేసినందుకు తననాజైలులో పెట్టకుండా విడిచిపెట్టినందుకు సంతోషంగానే వచ్చేస్తాడు. తరువాత అవసరమని తోస్తే న్యాయాధికారి ఆడచ్చియజమానిని పిలుస్తాడు. న్యాయాధికారి ఆడచ్చియజమాని ఇద్దరూకలసి ఆజైలుఆవరణలో ఒకచోట కూర్చుని ఇష్టాగోష్టిగా మాట్లాడుకుంటారు. ఇంతపాగాకుపొగను తాగడమో, లేక చిటికెడు ముక్కుపొడుమును పీల్చడమోచేసి ఇరువురు కాస్సేపు ముచ్చటించుకుంటారు. అంతట డచ్చియజమాని మెల్లగా యింటికివెళ్ళిపోతాడు. కొన్నిరోజులైనతరువాత ఆన్యాయాధికారి నౌకరును పిలవనంపుతాడు. అతడు రాగానే, న్యాయాధికారి అతణ్ణి గట్టిగామందలించి, కొట్టిపంపివేస్తాడు. ఇంటికివచ్చినతరవాత యజమానికూడా తనపై ఫిర్యాదు చేసినందుకుగాను మరికొన్నిదెబ్బలు కొడతాడు. ఈ విధంగా ఆనౌఖరు చేసిన పిర్యాదు సమాప్తపుతుంది.

డచ్చివారు ఇండొనేసియాలోప్రవేశపెట్టిన న్యాయచట్టాలవరస ఇట్టిదిగావుంటుంది. డచ్చివారిని ఆచట్టాలు కాపాడతాయి; ఇండొనీసి

యనులను శిక్షిస్తూవుంటాయి. డచ్చివారిపట్ల అన్యాయసూత్రాలు కితాబులవలె పనిచేస్తూవుంటాయి: ఇండోనేసియనులపట్ల అవి ముండ్లగోలుసులవలె పరిణమిస్తూవుంటాయి.

## * సాంఘికవ్యవస్థ

హాలెండులో ఒకసామెతవుంది: 'చచ్చి స్వర్గానికి పోలేక పోతే బ్రతికివుండి జావాకుపో...' అనిదానిభావం.

పక్కలోనిబల్లెంవలె చెంతనున్న జర్మనీవలన భయంతో హాలెండు అనునిమిషభీతితో బ్రతుకుతూవుంటుంది. అందుచేత హాలెండులోవుండి, శత్రువుకుచిక్కి మరణించి స్వర్గానికి వెళ్ళ దల్చుకోక పోయినట్లయితే బ్రతికివున్న నాలుగురోజులు జావా దీవిలోవుండి హాయిగా మరణించడంమేలు అని హాలెండు ప్రజలు భావిస్తూవుంటారు. ఇండోనేసియాకు వచ్చిన వెంటనే, నిర్విచారంతో సౌఖ్యభరితంగా కాలంవెళ్ళబుచ్చవలెనని వారు అందుకు వలసిన సదుపాయాల నన్నిటిని కలుగజేసుకుంటారు. ఇట్టి విచిత్రమనః ప్రవృత్తి పెరిగిన డచ్ వారు ఇండోనేసియాలో ప్రవర్తించే విధానం చూస్తే చిత్రంగాను, ఆశ్చర్యంగాను, ఉంటుంది.

ఈ సందర్భంలో డబ్లియు. యస్. పిల్లీస్ అనునతడు "ట్రూత్" (*Truth*)అనుఆంగ్లపత్రికలో వ్రాసిన ఒక వ్యాసంలోని ఈ దిగువ హంశాలను గమనించినట్లయితే ఇండోనేసియాలోని డచ్ వారి చిత్తవృత్తి, ప్రవర్తన బాగావిశదమవుతుంది:—

ఇండోనేసియాలోవుండేడచ్చివానికంటె పని పాటూలేనివాడు ఈ విశాలవిశ్వంలో వేరొకడు కనిపించడు. అతనికి ఏవిూబాధ్యత ఉండదు. ఏదీఅతణ్ణి బాధించదు. పైగా దీనికిఅతడు బాధపడడు కూడాను. ఏమంటే దేనికిన్నీ అతడు బాధపడ నవసరంలేదు. ఒకరోజున ఏపని నైనాచేయలేక పోతే డచ్చివాడు దానిని మరునాడు చేదామనుకొంటాడు. మరునాడున్నూ అదిసాధ్యం కాకపోతే ఆపనిని అతడు చేయటమే మానివేస్తాడు. ఎన్నాళ్ళు గడచిపోయినా, ఒకసారి ఒదలిపెట్టిన పనిని డచ్చివాడు తిరిగి తలపెట్టడు.

జావాలో డచ్చివాడు తన యిష్టం వచ్చినప్పుడు అంగడి తెరుస్తాడు. తన చిత్తం వచ్చినప్పుడు కొట్టుకట్టివేస్తాడు. బటేవియానగరంలో సాధారణంగా ఉదయం 8 గంటలకు డచ్చివారు అంగళ్ళన్నీ తెరుస్తారు; సురబాయాలో 9 గంటలకు తెరుస్తారు; ఇతర తావులలో వారికి వలయునప్పుడు తలుపులు తెరుస్తారు. దానికి ఓ నియమము; నిర్ధారణ అంటూ లేదు. కొన్ని ప్రదేశాలలో డచ్చివారు ఉదయం పన్నెండు గంటలవరకు కొట్టు తెరచి వుంచి, పిమ్మట కట్టివేసి, తిరిగి సాయంకాలం నాలుగంటలకు అంగడి తలుపులు తెరుస్తారు. ఇట్లాగెందుకు చేస్తారంటే డచ్చివారు మధ్యాహ్నమప్పుడు నిద్రపోవాలి! డచ్చివారికి నిద్ర పిలిస్తే పలుకుతుంది ...మరి...!

నాల్గు గంటలకు అంగడితలుపులు తెరచిన డచ్చివాడు చీకటి పడుతూవున్నదనగా కొట్టుకట్టివేసి ఏ పెద్దహోటలుకో పోతాడు. అక్కడ ఆరుబైట నుండు పడకకుర్చీలో వెన్నువాలుస్తాడు. బీరుబుడ్లు ఖాళీచేయటము, పొగత్రాగడము, బ్యాండు వాయిద్యం శ్రావ్యంగా వినడము, మొదలైనవాటితో అర్ధరాత్రి వరకు హాయిగా కాలక్షేపంచేసి ఇంటికి వస్తాడు. అప్పుడు భార్యతో సుఖంగా అనుభవిస్తాడు. లేక, జావాస్త్రీని ఉంచుకొన్న వాడయినట్లయితే - ఆమెచేత ఒళ్లు పట్టించుకుంటాడు. ఆమెతో చక్కగా అనుభవించడానికి హుషారు కావలెనట! అందుకోసమే ఆమెచేత అట్టి సపర్యలు చేయించుకొంటాడట!! ఇది జావాలో డచ్చివాని దినచర్య...!!

ప్రాచ్యదేశాలకు వచ్చిన పాశ్చాత్యజాతులవారు 'భాషల' విషయమై అనుసరించు పద్ధతిలో ఒకింత వ్యత్యాసమున్నది. బ్రిటిషువారు తమ భాషను నేర్చుకొనమని దేశీయులను బలవంతపెడతారు. ఫ్రెంచివారు తమ భాషను తమ వలసదేశీయులను నేర్చుకోనీయరు. కానిడచ్‌వారు మాత్రం వలస దేశాలలోని భాషలను బాగా అభ్యసిస్తారు. ఈమూడు జతులవారికిని భాషాసాంప్రదాయాలలోవున్న తేడా ఇది. - ఇందువలన మలయా దేశంలో ఇంగ్లిషు భాష వికృతరూపంపొంది, ఇంగ్లీషువారికి దేశీయులకున్న మధ్య

ఎంతో అంతరం ఏర్పడ్డది. ఇండో చైనాలో దేశీయులకు ఫ్రెంచివారికి మధ్య ఎట్టి సంపర్కము లేక ఒక అఖాతమే ఏర్పడింది. కాని-ఇండోనేసియాలో డచ్చివారికి దేశీయులకుమధ్య ఇట్టితేడా అంతగా లేదు. ఇండోనేసియాలో ప్రతిడచ్ వాడున్ను దేశీయభాషలను ముందుగా నేర్చుకుంటాడు. అతివేగముగా ఆదేశ భాషలలో మాట్లాడుతాడు; అంతచురుకుగానే వాటిని వ్రాస్తాడు. అదేవిధంగా జావానీయులతో సంపర్కాన్ని పెంచుకుంటాడు. ఇందువల్ల డచ్చివారిలో నూటికి 90 మందికి ఇండోనేసియనులతో సాంగత్యంఏర్పడింది. ఈ సంపర్కము వల్ల ఏర్పడిన జనాభా అంతాకూడా సంకరమైన తెల్ల జాతిగానే అచట భావించబడుతూవుంది. ఈ సందర్భంలో-జావాస్త్రీలయెడల డచ్చివారి ప్రవర్తనను గురించి ఒకింత తెలుసుకొనడం అవసరమైవుంది.

జావాస్త్రీలు సహజంగా కష్టపడి పనిచేసే అలవాటుకలవారు. డచ్చివారు ఏపనిచేయరు; సోమరిపోతులు. బీరుబుడ్లు త్రాగుచూకాలాన్నిపుచ్చుతూవుంటారు. జావాస్త్రీలను తమవిలాసార్థము తమచిత్తము వచ్చినరీతిగా తమఖర్చులకు బద్ధులై వుండునట్లుగా చేస్తారు. ఇందుకువ్యతిరేకించేవారిని, వారునిర్దాక్షిణ్యంగా కొరడాలతో కొడతారు. నిర్వ్యాపారానికి యథేశ్చాశృంగార విలాసానికిడచ్ వారిలో పెద్దవారు మార్గదర్శకులు. పెద్దవాళ్ళ ప్రవర్తనలను చూచి చిన్నవాళ్లుతయారౌవురతూవుంటారు.

జవాస్త్రీలు తామరవర్ణంగా, కుసుమకోమలంగా వుంటారు. అట్టివారుడచ్చిగారికిదాసీలుఐపోయినారువారు ఎంతోఓర్పు,నిదానములు కలవారు. అయినా ఎల్లప్పుడూ ఏదోదుఃఖ భారంతో క్రుంగిపోతువున్నట్లు కనబడుతారు, సత్ప్రవర్తనులు; ఏకజ్జాలకూ రారు అనుకూలదాంపత్యం, మాతృత్వధర్మాలే వారి పరమ లక్ష్యాలని పరిశీలించినట్లయితే తేటతెల్లమవుతుంది. అట్టి జవాస్త్రీలు తరుచుగా డచ్చివారి ఇండ్లలో తల్లులు అవుతూవుంటారు. కాని డచ్చి వారు వారిని పెండ్లిచేసికుని, భార్యలుగామాత్రం వుంచుకోరు.

జావాస్త్రీని ఉంచుకోదలచుకొన్న డచ్చి వాడు ముందుగా కొంతకాలం ఆమెను నిర్బంధంలో వుంచుతాడు. అట్లానిర్బంధంలో వుంచితేనేగాని జావా పడుచు డచ్చివారిఇష్టానిష్టాలననుగ్రహించి వారిని సరిగా సేవించలేదని డచ్చివారి అభిప్రాయం డచ్చివాని తలతిక్కలన్నిటికి కట్టుబడిన్న తరువాత, జావాస్త్రీకి నిర్బంధంతీరిపోతుంది. అంతట ఆమె బయటకుపోవచ్చు, తిరిగిరావచ్చు. తనస్థితిని తెలుసుకొన్న జావాస్త్రీ తనకింటె అందకత్తెఅగు మరొకస్త్రీని యజమానికి వప్పగించి, ఆకొత్తదాని తాపత్రయంలో డచ్చివాడువుండగా తానుతప్పించుకొని పారిపోతుంది. డచ్చివానినుండి తప్పించుకొని పోవలెనంటే ఇనొక్కటేమార్గం...!

ఇండోనీసియనులను తమ యిచ్చవచ్చినరీతిగా ఉపయోగించుకొనుటకుగాను, డచ్చివారు అచట 'బానిసవ్యాపారాన్ని' ప్రవేశపెట్టారు. 'బానిసవ్యాపారం' ప్రపంచమంతటా నేడు నిషిద్ధమైనప్పటికిని-జావాలో డచ్చివారు ఆవ్యాపారాన్ని పెంచి పోషించారు. ఒకయువతిని అచట ఇరవైగిల్డర్లకు కొనుకోవచ్చును. బానిసచేయవలసిన అన్ని పనులను ఆపడుచుది చేయవలసివుంటుంది. ఆయువతి కొంచెంఅందంగా, ఆకర్షనీయంగావుంటే, డచ్చివారామెను చీకటిపడగానే ఒకగదిలోపెట్టి తాళమువేసి నిరాటంకంగా ఉపయోగించుకొంటారు.

చాలావరకు పడచులను కొనడమనునది అనేదేలేదు. తల్లిదండ్రుల వద్దనుండి బలవంతముగా వారిని డచ్చివారు తీసికొనిపోతారు. ఒకొక్కపిల్లకు ఇంతరొక్కము ఇస్తామని చెప్పితీసుకొనిపోయి, వ్యభిచార గృహాలలోనైనా వుంచుతారు; లేక కావలసినవారికైనా వప్పగిస్తారు. ఈవిధముగా డచ్చివారు అచట వ్యభిచార గృహాలను సాగిస్తూ వున్నారు. ఇట్టి వ్యాపారంచేసి డబ్బుసంపాదించేవారు జావా డచ్చివారిలో చాలామందివున్నారు.

డచ్చి ప్రభుత్వం బహిరంగ వ్యభిచారాన్ని అంగీకరించింది. వ్యభిచారంచేయడానికి ప్రభుత్వం 'లైసెన్సు' ఇస్తుంది. ఇందుమూలకంగా ప్రభుత్వానికి కొంత ఆదాయంకూడా లభిస్తూవుంది.

కాగా, దానిని నియమబద్ధము చేయవలెననే తలంపు ప్రభుత్వానికి కలుగలేదు. ఇందువల్ల ప్రభుత్వానికి సాలీనా ఏమాత్రం ఆదాయం వస్తూవున్నదనే లెక్కలను మాత్రమే ప్రభుత్వం చూచుకుంటూ వుంటుంది.

జావాలో దచ్చిసైనిక పటాలాలకు ప్రభుత్వోత్తరువుల ప్రకారం కన్నెపడుచులు సరఫరా అవుతూవుంటారు. ఆసరఫరా జరిగేపద్ధతి ఈ విధంగావుంటుంది——

ఒక "మాండర్" అనగా తలారివంటి అధికారి బయలుదేరి వరిసాగుచేసే పల్లెప్రాంతాలకు పోతాడు ఆమాండర్‌ను గ్రామీణులు అతిమర్యాదగాచూస్తారు. ఎవరినైనా మర్యాదగాచూచి, భోజనం పెట్టి గౌరవించడం ఇండోనీసియనులకు సహజస్వభావం.

ఆమాండర్ రాత్రిభోజనం చేసినతరువాత అతనిచుట్టూ ఊరి వారంతా చేరుతారు. "బటేవియా" మొదలైన పెద్దపెద్దపట్టణాలలో (ప్రభుత్వ క్షేత్రాలు)ని వైభవమూ, అచటివారు అనుభవించే సౌఖ్యాలూ, మొదలైనవన్నీ ఆమాండర్ వారికి వినసొంపుగా వినిపిస్తాడు. అక్కడి స్త్రీలు అనుభవించేసుఖాలు, కట్టుకొనేదుస్తులు, పెట్టుకొనేనగలు మొదలైనవాటిని గురించి, ఆపల్లెస్త్రీలకు, అందులోను యువతులకు అతడు బాగానచ్చచెబుతాడు. ఇక ఆమాండర్ మాటలకు పడుచుకన్నెలు భ్రమసిపోయూరా తల్లిదండ్రులు సందేహించినా ప్రయోజనముండదు. వారిని, నిరాటంకంగా ఆమాండర్ తీసికొనపోగలుగుతాడు. ఏమంటే అతడు ప్రభుత్యోగస్థుడు...!

ఆపడుచులు మాండర్‌తో రావడానికి అంగీకరించినట్లయితే ఒక ఖరారునామా వ్రాస్తారు. ఆఖరారునామాలో ఆపిల్ల, పిల్లతండ్రి, మాండార్ ముగ్గురున్నూ సంతకాలుచేస్తారు. అట్లుఖరారునామాలను వ్రాసిన ఆడపిల్లలనందరను ఆమాండర్ ప్రభుత్వఖర్చులమీద బటేవియాకు తీసుకొనివస్తాడు. అచట విరామగృహాలలోవుంచి వారిని బాగామురస్తాబుచేసి మిలటరీ పరిశీలనకు తీసుకొనివస్తారు. వారిలో అందముగా వున్నవారిని మిలటరీఆఫీసర్లును తీసుకొంటారు. మిగిలిన

వాళ్ళను సిపాయిలను, తదితరులను వప్పగిస్తారు. ఈ విధంగా ఇండోనేసియన్ యువతులు డచ్చిప్రభుత్వ పరిపాలనలో సిపాయీల విలాసాలకాహుతియై ధ్వంసమైపోతూ వున్నారు. ఆయువతులు సైనికులను సుఖపెట్టునంతకాలమూ వారు నిర్బంధంలో వున్నట్లే.

ఏపనునుఅయినా తిన్నగా ప్రవర్తించకపోయినా, కొంచెంఅవిధేయతకనపరచినా, లేకఏఒక్కనిమీదనైనాఎక్కువమక్కువ చూపించినా ఆమెనువెంటనే బయటకు గెంటివేస్తారు. బయటకు అంటే ఎక్కడకోగాదు; మిలటరీకొలువునుండి వ్యభిచార గృహాలలోకి అన్నమాట! అందువల్లవారు వ్యభిచార గృహాల్లో ఆయువతులు యావజ్జీవమూ కట్టుబడిపోవలసి వుంటుంది. ఆబంధము, దుర్దశ మరణాంతంతో పోవలసినదేగాని, గత్యంతరంవుండదు. ఇవీ డచ్చి పాలనలో జావానీయులు నేడున్న నిస్సహాయ స్థితిగతులు...!

జావాలో ప్రతిపట్టణపు వీధులలోను సైనికులు వదలివేసిన స్త్రీలు వందలాదిగ కనపడుతు వుంటారు. ఈ మాదిరిగా విచ్ఛిన్న జీవితమైన స్త్రీలు బాటేవియా నగరంలో విరివిగా కనిపిస్తారు. ఎంత మనోధార్ఢ్యము కలవారైనా ఆ స్త్రీల స్థితిని జూచి చలించక మానడు. బాటేవియాలోని ఒక ప్రశిద్ధ వైద్యుడు- ఆపట్టణ వీధులలో సంచారము చేసే స్త్రీలలో నూటికి తొంభైఅయిదు మంది సుఖవ్యాధులతో బాధపడుతున్నారని ప్రకటించాడు. వారిలో నూటికి నలభైమంది స్త్రీలు నయముగానిరోగాలతో కుములుతున్నారని కూడ అతడుఅన్నాడు. ప్రపంచంలో ఎక్కడా లేనంత విరివిగా సుఖరోగాలతో జావా స్త్రీలు మరణిస్తున్నారు! జావాలో ప్రభుత్వ లైసెన్సు పొందినవ్యభిచార గృహాలలోనేకాక, ప్రతిపట్టణంలోని ప్రతిహోటలులోను జావానీ స్త్రీలను వ్యభిచారం కొరకు పిలిపించుకోవడం జగద్విఖ్యాతమైన విషయం. ఏహోటలులో నైనాసరే ఏసామాన్లగదిలో పెట్టించేసరికి- ఒకమొద్దుమొహం వెయిటరు, తయారవుతాడు. 'పిల్లకావలెనా?' అని వెంటనే అడుగుతాడు. చేతులు కడుగుకోనకపోయినా, ముఖం కడుగుకోనక పోయినా, మీగుడ్డలు బాగుచేయడానికి మిమ్ములను సుఖపెట్టడానికి, మీరుఅంగీకరిస్తే ఒక

చక్కని చుక్కను పంపుతాను' అంటూ అతడు వెంటబడి వేధిస్తాడు. ఈ విధంగా కన్నెపడుచులను వప్పగించి, అందుల కగు రుసుమును 'హోటలు బిల్లు'లో వేయడం జావాలో ఆచారం! ఇది డచ్చిప్రభుత్వమువారు ఆమోదించిన ఆచారము! ఆ స్త్రీకిగాను హోటలువారు వేసే రుసుము ఎనిమిది గిల్డర్లు. ఆస్త్రీ అదృష్టవంతురాలైతే ఆ ఎనిమిది గిల్డర్లలో అర్ధవంతు ఆమెకు ముడుతుంది. జావాదేశం వచ్చే ప్రతిడచ్చివాడున్నూ ఒక జావా స్త్రీని దుబాషిగా వెంటతీసికొనిక పోయినట్లయితే - అతడు ఒట్టి మూర్ఖుడుగా భావిస్తారు. ఆదేశభాషను నేర్చుకొనడానికికూడా ఒక స్త్రీని చేరదీయడం నాగరికతకులక్షణం అని డచ్చివారు అభిప్రాయపడతారు.

— ఇండొనేసియాలో డచ్చివారి నీతినియమాలు ఇంతపతనావస్థలో ఉన్నప్పటికిని-వారు తమ వలసదేశాన్ని గురించి బ్రహ్మాండంగా వర్ణించుతూ మురిసిపోతుంటారు.

## విధి నిషేధాలు

ఇండొనేసియాలో డచ్చి పరిపాలనలో ఉన్న దేశీయప్రజలు కొన్ని నిబంధనలకు తప్పక లోబడి వుండాలని డచ్చిప్రభుత్వము కొన్ని విధినిషేధాలను అమలు పరిచింది. —

జావా ద్వీపములో ఉండే యే జాతివాడున్ను 'బూట్సు'ను తొడుగుకొనకూడదు; 'హాట్' ధరించకూడదు. 'ట్రౌజరు' (గుండీలు ఉండు లాగును) తొడుగుకొనకూడదు. ఒకవేళ లాగు తొడుగుకొన్నట్లయితే దానిచుట్టూలుంగీ వంటి గుడ్డ తప్పక ఉండాలి. నడుముకు పెట్టుకొనే పటకా బయటికి కనుపించునట్లుగా పొట్టికోటు ధరించవచ్చునుగాని, పొడుగుపాటికోటు తొడుగుకొనడానికి సుతరామూ వీలులేదు. అసలు యూరపియన్ ఆచారవ్యవహారాలను దేశీయులు యేమాత్రం అనుకరించరాదు. ఇండొనీసియన్ జాతీయుడు డచ్చివాని యెదుట కూర్చొనకూడదు. డచ్చివారిని డచ్ భాషలో ఇండొనీషియన్ వ్యక్తి

పలుకరించడంకూడా ఒక అమర్యాద క్రింద భావించ బడుతుంది. ఇందుకు మూడేండ్లు శిక్ష, కొరడా దెబ్బలు విధించవలసి వుంటుంది. డచ్చిన్యాయస్థానములో ఇండొనీషియనులు మాత్రమే కాదు, ఆసియా జాతివారెవరయినాసరే నిలుచుని వుండరాదు. ఒక వెదురుచాపమీద కూర్చొనివుండాలి. అలాకూర్చొనక, డచ్చివారివలె కుర్చీలలోకూర్చుంటానని అన్నట్లయితే-అతనికి కొరడాదెబ్బలు తగులుతాయి. పూర్వం డచ్చివాని కెదురుగా ఆసియా జాతీయుడు దారిలోనడవడానికికూడ సాహసించేవాడు కాదు. కాని, నేడు యెచ్చటనైనా డచ్చివారికి ముందుగా దారి విడువవలెనని ప్రభుత్వం శాసిస్తుంది. ఇది అంతా 1878 సం|| చట్టం ప్రకారం డచ్చిపాలకులు ఇండొనీసియాలో అమలు పెట్టారు. ఇండొనీసియన్‌లను కడు నీచంగా చూస్తూ వారిచే సకల -చాకిరీ చేయించుకొనవలెనని డచ్చివారు వీటినన్నిటిని యెంతో పట్టుదలతో ఆచరణలో పెడుతూవుంటారు.

ఇండొనీసియనుల యెడలమాత్రమే కాదు; డచ్చివారికి జావా ఏయితర దేశీయుడన్నా అనుమానము భయము కలుగుతూ ఉంటుంది. జావాదీవిలోని ప్రకృతి సౌందర్యాలనుచూచి రావలెననే ఆశతోనైనా విదేశీయులగు స్త్రీలు గాని, పురుషులు గాని, పిల్లలు గాని వచ్చినట్లయితే-అచటికి చేరిన మూడురోజులలోగా వారివారి పేర్లను 'రిజిష్టరు' చేసుకొనితీరాలి. అలా రిజిష్టరు చేయించుకొనడానికి గాను మనిషి 1కి రెండు షిల్లింగులన్నర చెల్లించాలి. ఆవిధముగా రుసుము చెల్లించి పేర్లురిజిష్టరుచేయించుకొనకపోయినట్లయితే అపరాధంక్రింద ఒక నూరు గిల్డర్లు డచ్చి పాలకులు వసూలుచేసి తీరతారు. డచ్ వాడు లండన్ నగరంగాని, భారతదేశంగాని వస్తే దగ్గిరలోవుండే డచ్చిబసకు మూటముల్లె మోయించుకొని పోవడానికి గాను ఒకటిన్నర షిల్లింగులు చెల్లించవలసి వుంటుంది. కాని ఈ కాస్త ఖర్చుకే డచ్చివాడు తనను బ్రిటిష్‌రాజ్యంలో చాకిరీ చేసినట్లుగా గోలపెడతాడు. అంతేకాదు; తన డచ్చిప్రభుత్వానికి ఇదొక అన్యాయంగా వర్ణించి మహాజర్లుకూడా పెట్టుకుంటాడు. జావాదేశానికి వర్తకానికి వచ్చే ప్రతిచైనా దేశీయుడున్ను ముందుగా డచ్చిప్రభుత్వం అనుజ్ఞను

పొందవలసి వుంది. ఇంగ్లీషువారు ఎగుమతి దిగుమతులు చేయించుకొనే సరుకులనుగూడ 'రిజిష్టరు' చేయించుకొనవలసి వుంది. ఇది అంతా డచ్చి పరిపాలనలో ఇండొనీసియాలో సాగిపోతూ వుంటే - అట్టి నిర్బంధాలను మరేదేశంలోనైనా తనయెడల అమలుజరిపినట్లయితే డచ్చివాడు పెట్టేగోల యింతా అంతా కాదు...!

## సైనిక శాఖ

డచ్చి పరిపాలకులు ఇండొనీసియాను పలుభంగులుగా అణిచిపెట్టి, వివిధరీతులలో కొల్లగొట్టుకొంటూన్న కథనం చెప్పుకొన వలెనంటే అదిఅపారము అనంతము అవుతుంది. నిస్సహాయులు, అమాయకులు, ఆత్మరక్షణోపాయమూరులు అయిన ఇండొనీసియనులలో ప్రతీకారవాంఛ పొటమరించగలదేమో నను భీతితో, వారని డచ్చి ప్రభుత్వము తన సైనికబలంతో కట్టిపేసింది.

'దేశ రక్షణ'కు డచ్చి ప్రభుత్వం పెద్ద సైన్యాన్ని ఇండొనీసియాలో పోషించుతూవుంది. ఈ సైన్యంలో యూరోపియనులు, ఇండొనీసియనులుకూడావున్నారు. వారిలో డచ్చిజాతీయులు అధిక సంఖ్యాకులు. ఈ సైనిక దళాల నన్నిటిని డచ్చి ప్రభుత్వం జావాలోను, తదితర దీవులలోను పంచి, వుంచింది.

ఇక సైనిక తరిఫీదు విషయంలోకూడా డచ్చి ప్రభుత్వం యూరోపియనులకు,ఇండొనీసియనులకుమధ్య రేటంతో అంతరంచూపిస్తున్నది. యూరోపియనులకు పాశ్చాత్యదేశములలోని సైనికపద్ధతులనన్నిటినీఅలవరుస్తుంది. కాని,ఇండొనీసియన్ సైనికులకు అట్టి శిక్షణ ఆవంతయును లేదు. ఇండొనీసియన్ సైనికులు చివరకు 'మర తుపాకీ' (మిషన్ గన్) నికూడా ముట్టుకొనడానికివీలు లేదు! ఇండొనీసియనులు సాధారణ సైనికులుగాను, సైనికశాఖలో బండచాకిరీ చేసే చిల్లర పనివారుగాను మాత్రం వుండాలి...!

ఈసైనికశాఖకాక, దేశరక్షణ సిబ్బందిఅను 'ఫీల్డుపోలీస్' శాఖ వేరొకటి కూడా డచ్చి ప్రభుత్వానికి వున్నది. ఈ శాఖకు

'మోటారు' వంటి వాహనయంత్రాలు బాగా చేర్చబడినవి. సుమారు 1000 మోటారు సైకిళ్ళతోను, 10,000 మర బైస్కిళ్ళతోను, సాయుధ పోలీసులు గట్టి తరిఫీదు నందినవారు ఈ శాఖలో వున్నారు. అన్ని దీవులయందు వీరు విచ్చలవిడిగా తిరుగుతూవుంటారు. రోడ్ల వెంట ఆ యంత్రవాహనాలమీద ఇటుఅటూ తిరుగుతూ ఆపోలీసులు, గ్రామ గ్రామాలలోని ప్రజలను విషపు కంటితో కనిపెడుతూ వుంటారు. వారికి అదే ఉద్యోగం; వృత్తి...!

సామ్రాజ్యతృష్ణతో-స్వర్ణదీవుల ఐశ్వర్యాన్ని త్రాగడానికి, ఎన్ని విధములైన దోపిడీవిధానాలను అమలు పరచవీలున్నదో అన్నిటినీ అమలుపరచి- డచ్చిసామ్రాజ్యవాదులు, పాపభీతి లేని పరిపాలనా విధానాన్ని, నీతినియమాలు లేని విధి నిషేధాలను 'రాజ్యపరిపాలనాతంత్రం' పేరిట అనుసరిస్తూ- ఈఇరువదవ శతాబ్దపు నాగరికతా ప్రపంచంలోకూడా రాతియుగముల నాటి అమానుషపద్ధతులను అవలంభిస్తూ ఇండోనేసియాలో మూడుపువ్వులు, ఆరుకాయలు కాచిపోయారు! సుమారు మూడు వేలద్వీపసంచయాన్ని, ఏడు కోట్ల ప్రజానీకాన్ని బానిససంకెళ్ళలో బంధించివేసి, వేయికండ్లతో వాటిని కాపాడుకుంటూ వచ్చారు...!

కాని- ఇండోనేసియాలో స్వాతంత్ర్యవాంఛ, ఆత్మశక్తి కుంభించుకొనిలేచి, అంబరచుంబితములైనాయి! వాటిముందు డచ్చి సామ్రాజ్యవాదం కళవెళపడక తప్పినదికాదు...!

# ఇండోనీసియా స్వాతంత్ర్యోద్యమం



ప్రాచ్యఖండం సుమారు ఒక శతాబ్దిగా స్వాతంత్ర్యోద్యమాలతో సంక్షుభితమవుతూవుంది.-

విధివశాన పాశ్చాత్యసామ్రాజ్య జాతుల దౌష్ట్యపరంపరలను లోగినారిఐశ్వర్యతృష్ణకు గురియై, జీర్ణశిథిలములైన ప్రాచ్యదేశాలు దీర్ఘసుషుప్తినుండి మేల్కొన్నవి. విజ్ఞానఖనులు, ఐశ్వర్యసంపన్నులు ధర్మపథగాములు అగు ప్రాచ్యప్రజలు, తమపతనావస్థనుగుర్తించుకొని పాశ్చాత్య సామ్రాజ్య మదహంకారులపై తిరుగబడ నారంభించారు. ప్రాచ్యజాతులలో ఈనవ్యచైతన్యాన్ని కలిగించడానికి భారత స్వాతంత్ర్యోద్యమం తొలికోడి ఐనది...

పంధొమ్మిదవ శతాబ్దం పర్యవసిస్తూవుండగా ఇటుభారత దేశంమొదలుకొని- అటుమలయా, ఇండోనీసియా, ఇండోచైనా ఫిలిప్పయినులవరకు- ఇంచుమించుగా ఒకేఒక ఆశయాన్ని ప్రధానంగాగల స్వాతంత్ర్యవిప్లవోద్యమాలు తలఎత్తినవి. ప్రతిదేశంలోను ప్రజావిప్లవతరంగాలు పెల్లుబికి, రక్తపుటేరులు ప్రవహించినవి. ఒకదేశం వేరొకదేశాన్ని ఆదర్శంగాపెట్టుకొని స్వాతంత్ర్యభావ పులకితమై కదనరంగమునకురికి, తెల్లజాతులపై కత్తులుదూసినవి కాని- ఇట్టితీవ్రప్రజోద్యమాలు, రక్తబలిదానాలు, ఆదిలో అంతగా రుచిచూడనిది ఒక్క 'ఇండోనీసియా' మాత్రమే...!

ఇండోనీసియాలో యదార్థమైన ప్రజావిప్లవం ఈఇరువదవ శతాబ్ది, మొదటిదశాబ్దిలో గానిమొలకెత్తనేలేదు, కాని అట్టివిప్లవ పొంగులు వారడానికి ముందుగా కొంతకాలంనుండి ఇండోనీసియాలో ప్రజాప్రబోధం జరుగుతూవచ్చింది. సాంఘికరంగములో ఇట్టి ప్రబోధంప్రారంభమై ఆర్థికరంగంలో ప్రతిధ్వనించి, రాజకీయ రంగంలో అదినిజమైనరూపురేఖలను దిద్దుకొన్నది-

ఇండోనేసియాలో జాతీయోద్యమానికి వేగుచుక్క 'కార్తినీ' అను పదహారేండ్ల యువతి!

ఇండోనేసియనులు తమస్వాతంత్ర్యదేవతగా, భాగ్యవిధాత్రిగా పూజించే ఈమె 1879లో జాపరార్ జెంటు తనయగా జన్మించింది. విద్యాబుద్ధుల విషయమైఇండోనేసియన్ స్త్రీలలో ఆనాడు వుండిన మూఢాచారాలనన్నిటినిధిక్కరించి, ఈమె 1895లో అనగా తనపద హారవయేట బటేవియా నగరానికిపోయి, ఉన్నతవిద్యల నభ్యసింప మొదలుపెట్టింది. బటేవియాలో ఆమె విద్యాభ్యసనానికి ప్రభుత్వ విద్యాశాఖాధికారి ప్రాపులభించడంతో ఆమె అతనిఇంట నేనివాస మేర్పరచుకొని ఐదేండ్లలో ఉన్నతవిద్యలను అభ్యసించింది. చదువు పూర్తికాగానే తన జీవితాన్ని ప్రజాసేవకై వినియోగించాలని సంక ల్పించుకొని ఒక యువతీ విద్యాలయాన్ని ప్రారంభించి, ఇండోనేసి యన్ మహిళా ప్రపంచంలో అమె ఒక నూతన చైతన్యాన్ని కలిగిం చింది. ముందుగా స్త్రీలలో ఈమె కలిగించిన జాగృతి క్రమేపి పురుషుల అజ్ఞానాన్నికూడా తొలగించింది. సాంఘిక రంగంలో ముఖ్యంగా విద్యాప్రబోధంలో కార్తినీ కొనితెచ్చిన జాతీయభా వాలు, ఇండోనేసియనుల స్వాతంత్ర్యోద్యమాలకు తొలిబీజములు అయినవి. అందువలననే ఇండోనేసియనులు 'కార్తినీ'ని తమ జాతీ యత పాలిట భాగ్యదేవతగా గౌరవిస్తూ వుంటారు.

మిస్ కార్తినీ కృషి ఫలితంగా ఇండోనేసియనులలో తమ విద్యావిధానం యెడల, సాంఘిక దుస్థితి యెడల కొంత క్రొత్తచైత న్యము కలిగింది. గాని అది ఒక ఉద్యమరూపాన్ని మాత్రం పొంద లేదు. అందువలన దేశీయులలో ఇట్టి ప్రబోధం జరిగినగాని దేశం జాతీయ జాగరితం కాదని గ్రహించి డా|| వైడిన్ సోదిరా ఓసాడా అను ప్రముఖుడు 'బోడీ ఓటోమో' అనుసంఘాన్ని స్థాపించి కృషి చేయనారంభించాడు.

డా|| ఓసాడా ప్రభుత్వోద్యోగంలో చిరకాలం వైద్యవృత్తిని నిర్వహించి, విశ్రాంతివేతనం తీసుకొంటూ, దేశసేవలో నిమగ్నుడై

నాడు. ప్రజలలో సాంఘిక, ఆర్థిక, రాజకీయ పునర్నిర్మాణం జర గడానికి తగినవాతావరణం వున్నదో లేదో, తెలుసుకోనడానికి, అతడు ముమ్మందుగా ఇండోనీసియా అంతటా సంచారం చేశాడు. ఆ సంచారంలో అతనికి సర్వత్రా ప్రజోత్సాహం, ప్రజాసహకార భావము ప్రతిఫలించినది. వెంటనే 1908 లో అతడు "బోడీఓ టోమో" అను సంఘాన్ని స్థాపించి, దానికి వివిధతావులలోను అను బంధసంఘాల్ని నెలకొల్పినాడు. ఆ సంవత్సరమే బటేవియాలో ఆ సంఘం అధ్వర్యాన ఒక 'కాంగ్రెస్' జరిగింది. దేశంలోని ఇండో నీసియన్ ప్రముఖులు పలువురువిచ్చేసి ఆ కాంగ్రెస్ లో పాల్గొన్నారు.

జావా జాతీయోద్యమము పేరిట ఇండోనీసియాలో మొట్ట మొదటగ జరిగిన దేశీయ మహాజన సమావేశం ఇదే. అయితే ఈ సమావేశంయిచ్చిన సందేశందేశంలోని అగ్రవర్గాలరవకు మాత్రమే ప్రాకిందిగాని, సర్వప్రజాళీని అది ఆకర్షించలేక పోయింది. ప్రథమ ప్రపంచసంగ్రామం ప్రారంభం అగువరకు ఈ ఉద్యమము కొద్దికొ ద్దిగా జావాదీవి అంతటా పాకుతూ వచ్చింది. విద్యాధికులు, ధన స్వాములు అగు ఇండోనీసియన్ ప్రముఖులు దీనికి అండగా నిలిచి ప్రజలలో సాంఘిక రాజకీయ ప్రబోధం చేయసాగారు. కాని, యుద్ధానంతరము 'బోడీఓటోమో' యొక్క ప్రచారం ఇండోనీసియా లోని యితరదీవులకు కూడా కొంచెం వ్యాపించింది. దేశీయుల అభి వృద్ధికి ఇట్టి సంఘం ఒకటి వుండి కృషి చేయవలసిన అవసరము వున్నదని మాత్రం ఇండోనీసియన్ అగ్రవర్గాలు, ప్రభుత్వముకూడ గుర్తించాయి. —

ఇండోనీసియన్ అగ్రతరగతులవారు, ధనికులు, ప్రభుత్వో ద్యోగులు మాత్రమే, 'బోడీఓటోమో'లో సభ్యులుగా వుండటం వలన ఆసంఘంకేవలం ఒక 'మితవాద' వర్గముగా తయారు అయింది. దానిద్వారా ప్రజలలో ఆశించదగినంతగాఫలితాలు లభించలేదు. ప్రజానీకాన్ని యావత్తునూ కదల్చివేయగల కార్యక్రమం ఆ సం ఘముద్వారా లభ్యం కాలేదు.

అయితే దేశంలోమాత్రం వెనుకటికంటె తీవ్రమైన జాతీయ భావాలు ఉత్పన్నము లయినవి. ద్వితీయప్రపంచ మహాసంగ్రామ కృతంగా ప్రపంచ మందంతటా కలిగిన కొత్తమార్పులు ఇండోనేసి యనులను మేల్కొలిపి వారిలోకూడ నూతనభావాలను పెంపొం దించాయి. 1905 లో రష్యాపై జపాన్ ఆర్జించిన విజయం, తదుపరి జపానులో కలిగిననూతనఆర్థికరాజకీయ పునర్నిర్మాణము, 1912 లో చైనా రిపబ్లిక్ స్థాపనము, 1917లో రష్యా విప్లవము, ఫిలిప్పయిన్ రాజకీయోద్యమము, భారతస్వాతంత్ర్యోద్యమము — మొదలయిన ప్రపంచ సంఘటన లన్నీ ఇండోనేసియన్ జాతీయవాదులపై కూడ తమవిప్లవముద్రలు వేశాయి. ముఖ్యంగా ఇండోనేసియయువకవర్గాలు తీవ్రమైన రాజకీయభావోద్రేకు లైనవి.

దీనికితోడు యుద్ధానంతరం డచ్చిప్రభుత్వ పరిపాలన- ఇండో నేసియాలో మరింత బిగువుకాజొచ్చింది. ప్రజలరాజకీయ భావా లన్నిటిని బిగించి పట్టుకొనవలెననే యత్నంతో డచ్చి ప్రభుత్వము కొత్తకొత్త శాసనాలను అమలుపరుప జొచ్చింది. ప్రజలలో చీలి కలు పెంచి, మతదృష్ట్యా, వర్తకరీత్యా ఇండో నేసియనులను విభిన్న కూటాలుగ విడదీయవలెనని డచ్చిప్రభుత్వం పలువిధాల తాపత్రయ పడ సాగింది.

ఇట్టిసమయములో 'సార్వజనీనకమైన ఒక సంస్థ అవసరం' అని భావించే ఇండోనేసియన్ ప్రముఖులుకొందరు 'సరికత్ ఇస్లామ్' అనుపేర ఒక నూతన సంఘాన్ని స్థాపించి, "ఇండోనేసియనులలో మతైక్యతను, ఆర్థిక సహకారమును, రాజకీ యౌన్నత్యమును, పెంపొందించుటకే ఈ సంస్థ కృషి చేస్తుంది" అని ఆ సంఘం ఆశ యాలను గురించి ప్రచారము చేశారు.

'సరికత్ ఇస్లామ్' సంస్థ స్థాపించబడునాటికి - డచ్చి వారి వాణిజ్యతంత్రాలకు చిక్కి ఇండోనేసియన్ ఆర్థికరంగం చితికి పోయింది. ముఖ్యంగా 'బాటిక్' పరిశ్రమల సందర్భములో ఇండో నేసియన్ పారిశ్రామికులు మిక్కిలిగా నష్టాలకు పాల్పడి వున్నారు.

'ముస్లిం వాణిజ్య సంఘాలను' స్థాపించి ఇండొనేసియన్ పారిశ్రామికులు కలిసికట్టుగా కృషి చేసినప్పటికి ఫలితం లేకపోయింది. అందువలన ప్రజలలో డచ్చి వర్తకవిధానము యెడల అమితమైన అసంతృప్తి జనించింది. దీనిఫలితంగా జావాలోని ప్రధాన నగరాలలో ప్రజలకు ప్రభుత్వ అధికారులకు మధ్య సంఘర్షణలు బయలుదేరాయి. డచ్చిప్రభుత్వం నిర్బంధ దమన విధానాన్ని అనుసరించినప్పటికీని ప్రజలలో ఆగ్రహం చల్లారలేదు. ఈ తిరుగుబాట్లను పురిగొల్పి, 'సరికత్ ఇస్లామ్ సంస్థ' విప్లవకరమైన పాత్రను నిర్వహించింది. ఆర్థిక సమస్యను పురస్కరించుకొని 'సరికత్ ఇస్లాం' సంస్థ రాజకీయ రంగంలో ప్రవేశించి అశాంతిని రెచ్చగొడుతున్నదనే మిషతో డచ్చిప్రభుత్వం 'సరికత్ ఇస్లామ్‌ను' నిషేధించింది. కాని అచిరకాలములోనే ప్రజాందోళన ఫలితంగా ప్రభుత్వం తన నిషేధాలను ఉపసంహరించుకొన్నది. వెంటనే ద్విగుణీకృతమయిన శక్తితో 'సరికత్ ఇస్లాం' ఇండోనేసియా అంతటా వ్యాపించింది. స్వల్పకాలములోనే ఆసంఘ సభ్యులసంఖ్య వేలకొలది పెరిగిపోయింది.

'సరికత్ ఇస్లాం' ప్రజలలో బాగా వ్యాపించడానికి పత్రికలపై డచ్చి ప్రభుత్వం విధించిన ఆంక్షలను రద్దు చేయడంకూడా మిక్కిలిగా దోహద మిచ్చింది. జాతీయపత్రికలు డచ్చి ప్రభుత్వం యెడల ప్రజల అసంతృప్తిని బాగా బహిర్గతం చేస్తూ వచ్చాయి. 'డౌవెస్ డెక్కర్' అను ఒక ఇండొనేసియన్ పత్రికా రచయిత ప్రజలలో జాతీయచైతన్యం అభివృద్ధి చెందడానికి అనేకవ్యాసాలు వ్రాస్తూ పత్రికల శక్తిని బాగా వినియోగపరిచాడు.

ఇట్టి సమయంలో జావాలోని 'యూరపియన్ మెడికల్ అసోసియేషన్' వారు ఇండొనేసియన్ వైద్యులను కించపరుస్తూ ఒక విషప్రచారం లేవదీశారు. 'బోడీఓటోమో సంస్థస్థాపకులలో ఒకడైన డా॥ టిప్టో అను ఒక ఇండొనేసియన్ వైద్యప్రముఖుడు కూడా ఈ యూరపియన్ వైద్యసంఘం చేత అవమానింపబడ్డాడు. అందుచేత అతనుకూడా డెక్కర్‌తో చేతులుకలిపి, డచ్చి జాత్యహంకారాన్ని

విమర్శిస్తూ పత్రికలలో వ్యాసాలు వ్రాయ నారంభించాడు. ఇతనికి తోడుగా 'సోవార్డి సోర్యానిన్ గ్రాట్' అను ఇరువదేండ్ల యువకుడుకూడా డెక్కర్‌కు తోడుపడ్డాడు. ఇతడు ఒక రాజవంశీయుడైనప్పటికీ, తన ఐశ్వర్యాన్ని కోల్పోయి ఒక 'కంపాజిటర్'గా కాలంగడుపుతూ, జాతీయభావోపేతుడై, డెక్కర్‌చే ఆకర్షింపబడ్డనాడు. ఈముగ్గురుచేరి పత్రికలసహాయంతో డచ్చిప్రభుత్వంపై ప్రజలలో ద్వేషభావాన్ని బాగా రెచ్చగొట్టారు. డెక్కర్ ప్రచారాన్ని గమనించి డచ్చిప్రభుత్వం అతణ్ణి ఖైదుచేసింది. కాని తదుపరి అతనిని హాలెండుకు పంపించివేసింది. అతనివెంట డా॥ టిప్టో, సోవార్డిలుకూడ హాలెండు వెళ్ళారు. అక్కడకూడా ఆ ముగ్గురు ఊరకుండక 'ఇన్‌సులైండ్' అను ఒక సంఘాన్ని స్థాపించి, హాలెండు ప్రజలలో కూడా ఇండొనీసియా యెడల సద్భావాన్ని పెంపొందించడానికి కృషిచేశారు. —

హాలెండు వచ్చికూడా డెక్కర్ తన ఉద్యమాన్ని విరమించనందున ప్రభుత్వం అతనిని తిరిగి ఇండొనీసియాకు పంపించి వేసింది. జావాకు రాగానె డెక్కర్ 'నేషనల్ ఇండియన్ పార్టీ' అనుపేర ఒక సంఘాన్ని స్థాపించి ప్రజలలో జాతీయ స్వాతంత్ర్య ప్రచారం చేయ నారంభించాడు. ఇండొనీసియా అంతటా జాతీయ ప్రబోధితులయిన పిన్నలు పెద్దలు ఇతని ఉద్యమానికి చేయూత నిచ్చి, వివిధ జాతీయ సంఘాలను స్థాపించి స్వాతంత్ర్య పోరాటాన్ని ఉద్దీపింప జేశారు.

ఇండొనీసియనులలో జాతీయ భావం పలుభంగులుగా ప్రజ్వరిల్లుతూవున్నందువలన, డచ్చిప్రభుత్వానికిమాత్రమే గాక అదియూరోపియన్ జాతీయు లందరికీకూడా కంటగింపు కలిగించింది. ఇండొనీసియన్లు జాతీయ ప్రబోధితు లయినట్లయితే, తమ వాణిజ్య వ్యాపారాల కెచట ముప్పు వాటిల్లుతుందో నని వారు భయపడసాగారు. అందువల్ల ఈజాతీయ ప్రచారాన్ని అరికట్ట వలసినదిగా ప్రభుత్వముపై ఒత్తిడి తే నారంభించారు. ప్రభుత్వం ఏలాటి చిన్న

సంస్కరణలను తలపెట్టినా యూరోపియన్ జాతీయులు దానిని పూర్తిగా వ్యతిరేకించి అడ్డు పడడం మొదలు పెట్టారు. చివరకు విద్యాసంస్థలను స్థాపించడానికి ప్రభుత్వం తలపెట్టినా యూరోపియన్ వర్గాలవారు వాటిని కొనసాగనియ్యలేదు. అందువలననే 1909 సంవత్సరం వరకు ఇండోనీసియాలో న్యాయశాస్త్ర కళాశాల నెలకొలపబడలేదు; 1913 సంవత్సరంవరకు వైద్యకళాశాల స్థాపించబడలేదు.

విద్యాలయాలు మొదలుకొని రాజకీయ సంస్కరణల వరకు ఇండోనీసియాలోని యూరోపియన్ వర్గాలవారు ప్రతి అంశంలోను ప్రభుత్వానికి ప్రతిబంధకాలను ప్రయోగిస్తూ, దేశీయుల అభ్యున్నతిని అరికట్టుతూ వున్నప్పటికిని డెక్కర్, టిప్టోవంటి దేశసేవకులు ప్రజలలో జాతీయప్రబోధం చేయగలిగారు. వ్యవసాయము గనులు వర్తకము మొదలయినవాటి విషయములలో ప్రభుత్వము కొనితెచ్చిన స్వల్పసంస్కరణలు అసంతృప్తిపూరితాలైవున్నందువల్ల వాటియెడల అసమ్మతిని చూపుతూ, ఆందోళనలను లేవనెత్తడంలో డెక్కర్ ప్రముఖపాత్రవహించాడు. దేశవ్యాపితమైన ఆందోళనలను, ఉద్యమాలను నడిపించడంలో 'సరికత్ ఇస్లామ్' తిరిగి మహత్తరమైన పాత్రను నిర్వహించింది. సాంఘిక ఆర్థిక, రాజకీయ, వృత్తాలలో 'సరికత్ ఇస్లామ్' స్పృసించని సమస్య లేదు; ఆందోళన చేయని అంశం లేదు. అందువలన 'సరికత్ ఇస్లామ్' ఇండోనీసియా ఆశయాల కన్నిటికి ప్రాతినిధ్యం వహించగల ఒక జాతీయసంస్థ ఐంది.

'సరికత్ ఇస్లామ్' 1916లో జరిపిన మొదటి కాంగ్రెసు సమావేశములో దేశములోని వివిధతావులనుండి వచ్చిన 86 ఉపసంఘాలు సుమారు 4 లక్షలమంది జాతీయవాదులు పాల్గొన్నారు. ఆ సమావేశానికి డెక్కర్ కోరికపై అధ్యక్షత వహించిన 'జోక్రో' మహాశయుడు 'దేశీయులను ఒక ప్రవృద్ధకరమగు నొక జాతిగా తయారు చేయడమే తన ఆశయ'మని ప్రకటించాడు. తన ఆశయాన్ని సఫలీకృతంచేసికొనడానికిగాను ప్రభుత్వ సహకారాన్ని పొంది, న్యాయ

మైనపద్ధతుల నే అనుసరించి, ప్రభుత్వ న్యాయ చట్టాలకు వ్యతిరేకంగా పోనిమార్గాలలో కృషి చేయనున్నానని కూడా అతడా సమావేశములో ఉద్ఘాటించాడు.

జోక్రో, డెక్కర్ ల సారథ్యంలో 'సరికత్ ఇస్లాం' ఉద్యమము దేశమంతటా అంకపొంకాలుగా అలుముకొని పోతున్నది. కాని ఇంతలో ప్రథమ ప్రపంచమహాసంగ్రామం ప్రారంభము కావడంవల్ల జాతీయోద్యమము ఒకింత వెనుకబడక తప్పలేదు. యుద్ధంప్రారంభము కాగానే, ఇండోనీసియనుల తోడ్పాటునుకూడా పొందవచ్చననే ఆశతో, హాలెండులోని డచ్చిప్రభుత్వం యుద్ధానంతరం ఇండోనీసియా స్వపరిపాలనకు వలసిన సంస్కరణలను అమలు పరచెదమని ప్రకటించింది. 'ప్రజలు సద్భావంతోను, పరస్పర విశ్వాసముతోను వుండినట్లయితే చట్టరీత్యా సంస్కరణలను అమలు పరుసుకొంటూ ఇండోనీసియా స్వపరిపాలనాగమ్యాన్ని చేరగలుగుతుంది,' అంటూ డచ్చి స్టేట్సుజనరల్ హాలెండునుండి ఇండోనీసియనులకు విజ్ఞప్తి చేశాడు. —

అయితే విజ్ఞప్తులు అందలి సద్భావాలు యుద్ధానంతరం మటుమాయమై పోయినాయి. భారతదేశానికి కూడా యుద్ధకాలములో అనేక వాగ్దానాలు చేసి, బ్రిటిష్, యుద్ధానంతరం వాటిని మట్టిపెట్టినట్లుగానే ఇండోనీసియా యెడల డచ్చిప్రభుత్వం కూడా ప్రవర్తించింది. సద్భావాల పేరుతోనే పాశ్చాత్య సామ్రాజ్యవాదులు పాలితుల యెడల దుర్మార్గంగా ప్రవర్తించారు. పరస్పర విశ్వాసం అనేముసుగుతోనే వలసదేశ ప్రజలను మోసం చేశారు.

యుద్ధానంతరం ఇండోనీసియాలో 'వాక్సురాడ్' అను పేర ఒక ప్రజాసభను నెలకొల్పడమే తన ఆశయమని డచ్చిప్రభుత్వం ప్రకటించింది. 1918 లో వాక్సురాడ్ స్థాపింప బడినప్పుడు 'సరికత్ ఇస్లాం' దానియెడ తీవ్రఅసమ్మతిని, అసంతృప్తిని ప్రదర్శించింది.

రాజకీయ సంస్కరణల విషయంలో ప్రభుత్వాన్ని ఎదుర్కొంటూవున్న 'సరికత్ ఇస్లాం' మరుసటిసంవత్సరములోనే ఇంకా తీవ

మైన ఆశయాలను అనుసరించింది. పెట్టుబడిదారీ విధానాన్ని నిరశించడము, విప్లవమార్గాలలో ప్రజలను నడపడము-అనే రెండు ఆశయాలను వెల్లడించి, 'సరికత్ ఇస్లాం' తీవ్రమైన ఆందోళనలను ప్రారంభించింది. కాని ఈ రెండు ఉద్యమాలను నడపడంలో అధ్యక్షుడు 'జోక్రో' అనేకమైన ప్రతిబంధకాలకు లోనుకావలసి వచ్చినది. 'సరికత్ ఇస్లాం'ద్వారా ప్రజోద్యమాలను నిర్వహించడానికి వలసినధనసహాయాన్ని అతడుకొద్దిమందిఇండోనీసియన్ ధనస్వాముల ద్వారా పొందుతూ వున్నాడు. అసలు ఇండోనీసియనులలో నే పెట్టుబడిదారులు, ధనస్వాములు స్వల్పాతి స్వల్పంగా వున్నారు. వున్న అకొలదిమందిని అర్థవిముక్తులను చేయడం జాతీయత పరంగా నష్టదాయకమే అవుతుంది. అందువలన అతడు 'పెట్టుబడి దారీవిధానాన్ని నశింపు చేయడం' అనే ఆశయాన్ని 'పాశ్చాత్య పెట్టుబడి దారీ విధానాన్ని నాశనం చేయడం' అనునినాదంగా మార్చివేశాడు 'విప్లవమార్గాలను అనుసరించడము' అనె కార్యక్రమాన్ని కూడా అతడు 'ప్రభుత్వం ప్రజావాంఛను మన్నించకపోతేనే సరికత్ ఇస్లాం ప్రజలను విప్లవోన్ముఖులను చేస్తుంది' అను విధంగా మార్చి, ప్రజలలోను, ప్రభుత్వంలోను ఒకరకమైన సమాధాన భావాన్ని పెంపొందించడానికి ప్రయత్నించాడు.

అయినా అతని ప్రయత్నం ఫలించలేదు. వాక్సురాడ్ కు జరిగిన ఎన్నికలలో వోట్లు గలవారందరు ప్రభుత్వోద్యోగులే అయినందువలన 'సరికత్ ఇస్లామ్‌కు స్థానం లభించ లేదు. అందుచేత గవర్నర్ జనరల్ జోక్రోనువాక్సురాడ్ లోసభ్యునిగానియమించాడు.

జోక్రో అనుసరిస్తూవుండిన సమాధాన విధానము యెడల సరికత్ ఇస్లాంలోని సభ్యులుకొందరికి అసంతృప్తి జనించింది. వెంటనే వారు, తమ నాయకులమీద, ప్రభుత్వంమీద అవిశ్వాసాన్ని ప్రకటించి, వారిని ఎదుర్కొనవలె ననే అభిప్రాయాన్ని సూచించి, అందుకు తీవ్రంగా దేశంలో ప్రచారం చేయనారంభించారు. రాజకీయ స్వత్వాలన్నీ ప్రజలపరం కావాలనీ, పెట్టుబడిదారీ వర్గాన్ని

సమూలముగా స్వరూపనాశనంచేసివేయాలనీ వారుఆందోళన చేయ నారంభించారు. —'సరికత్ ఇస్లాం' ద్వితీయ కాంగ్రెస్ సమావేశ ములోనే అధికసంఖ్యాకులగు సభ్యులు ఈ ఆందోళనను కోర కొన్నారు.

1918 లో జరిగిన తృతీయ కాంగ్రెస్ సమావేశములో ఈ ఆందోళన తీవ్రమైన ఆర్థిక సమస్యాస్వరూపాన్ని ధరించి,సోషలిస్టు లను కమ్యూనిస్టులను వేరుక లెక్కించింది. సరికత్ ఇస్లామ్ సభ్యు లకు సామ్యవాద సిద్ధాంతాల యెడల ఆకాంక్ష అధికతరం కావ డానికి ప్రధాన కారణం ఆనాడు రష్యాలో బయలుదేరిన ప్రజావిప్ల వము, తదుపరి స్థాపించబడిన సోషలిస్టు రిపబ్లిక్ ప్రభుత్వమూ ఐవుంది. ఇండోనేసియన్ ఆర్థికరంగమంతా పాశ్చాత్య పెట్టుబడిదారీ విధానం క్రింద నలిగిపోతూవున్న సమయంలో సరికత్ ఇస్లామ్ సభ్యులలో తీవ్రమైన సోషలిస్టు భావాలు రేకెత్తి, వారు ఎటువంటి విప్లవకర మార్గాలనైనా అనుష్టించడానికైనా సంసిద్ధులైనారు.

సభ్యులలోను, ప్రజలలోను ప్రతిఫలిస్తూవున్న, ఈ తీవ్రాశ యాలను గుర్తించి, అంతవరకు సమాధాన విధానాన్ని అనుసరిస్తూ వుండిన జోక్రో, నూతనమార్గాన్ని అవలంబించకతప్పలేదు. వెంటనే అతడు ఒక తీర్మానాన్ని తయారుచేశాడు. "శ్రామికుల జీతాలను పెంచి దానికొక కనీసప్రమాణాన్ని నిర్ణయించడము, రోజుకు పని చేయుకాలాన్ని పరిమితం చేయడము, స్త్రీ శ్రామికులకు రక్షణలను కల్పించడము, బాలురచే కాయకష్టం చేయించడాన్ని నిషేధించ డము, వృద్ధాప్యంలో శ్రామికులకు తగు ఆర్థిక వసతులకు హామీ యివ్వడము — మొదలయిన సంస్కరణలను ప్రభుత్వము వెంటనే అమలుపరచాలి. ఇది జరుగకపోయినట్లయితే సరికత్ ఇస్లామ్ తన స్వంతపూచీ మీద ప్రతిద్వంది ప్రభుత్వాన్ని నెలకొల్పుతుంది..." అంటూ ఆ తీర్మానంలో ప్రభుత్వాన్ని జోక్రో హెచ్చరించాడు.

జోక్రో చేసిన ఈ హెచ్చరికకు సభ్యులలోను, ప్రజలలోను ఉత్సాహపూరితములయిన ప్రతిధ్వనులు వెలువడినాయి. 'హాజీ

ఆగోస్ సాలిమ్ అను ఒక వృద్ధ రాజకీయవేత్త జోక్రో తీర్మానమును బలపరిచాడు. ఇతనికి ఇండోనీసియనులలో విశేషమైన పలుకుబడి వున్నది. "ఇండోనీసియన్ పితామహుడు" అని ఇతనిని ఇండోనీసియనులు పూజిస్తూ వుంటారు. 'బాటావీష్ - నీయస్వ్యాస్ బ్లాడ్' అనే పత్రికకు సంపాదకుడుగా అతడు దేశీయులలో బ్రహ్మాండమైన జాతీయ ప్రబోధం చేశాడు. ముఖ్యంగా జావాలో 'ట్రేడ్ యూనియన్' ఉద్యమాన్ని నిర్మించి శ్రామికుల ఆదరాభిమానాన్ని ఇతను విశేషంగా చూరగొన్నాడు. అట్టి హాజీ ఆగోస్ సాలిమ్-జోక్రో తీర్మానాన్ని బలపరచడం చేత ప్రజలలో 'సరికత్ ఇస్లామ్' సంస్థయెడల, దానినాయకులయెడలద్విగుణీకృతమైన గౌరవ ప్రపత్తులు పునరుద్ధరితములైనవి. వెంటనే దేశంలో ఇరవై ట్రేడ్ యూనియన్ సంఘాలు నెలకొల్పబడినవి. రైలు, ట్రామ్, సుగర్ యూనియనులు బయలుదేరాయి. వాటి సభ్యత్వమున్నూ సుమారు 80,000 వరకు పెరిగిపోయింది.

'సరికత్ ఇస్లామ్' దేశంలోని శ్రామికవర్గాల కష్టనిష్ఠురాల నివారణకై కంకణం కట్టుకోవడంతో ఆసంఘపు సభ్యత్వంకూడా నాల్గవకాంగ్రెసు సమావేశంనాటికి 25,00,000 వరకు అభివృద్ధి చెందింది.

ఇండోనీసియాలో ఇట్లు సరికత్ ఇస్లామ్ ద్వారా ప్రజలలో సామ్యవాదభావాలు బహుళప్రచారం జరుగుతూవుండినట్లే అటు హాలెండులోకూడాసామ్యవాదవర్గాలు విజృంభించి డచ్చి ప్రభుత్వముపై తిరుగుబాట్లు లేవనెత్తినవి. సమ్మెలు, సంఘర్షణలు పొక్కి, హాలెండుదేశమంతా అశాంతికి ఆకరమైపోయింది. హాలెండులోని అశాంతియొక్క కీసీడలు ఇండోనీసియాకుకూడా ప్రాకు సూచనలు గోచరమైన వెంటనే డచ్చి గవర్నరు జనరల్ భయపడి, వెంటనే ఇండోనీసియా రాజ్యాంగంలో కొన్ని సంస్కరణలను చేయ నుద్యమించినట్లు,వాగ్దానం చేశాడు. కాని ప్రజలకు ఆసంస్కరణలు సంతృప్తిని ఈయలేదు. అందువల్ల దేశములో ఉద్యమాలు మొలకెత్తినవి. అశాంతి సర్వత్రా అలుముకొన్నది. ఫలితంగా డచ్చి ప్రభుత్వం

మరికొన్ని సంస్కరణలను ప్రవేశపెట్టింది. కాని అవన్నీ ప్రజలను తృప్తిపరచలేక పోయినవి. తిరిగి దేశమంతా ఆందోళన అగ్ని పర్వతమువలె భుగభుగ మన్నది. అంతట డచ్చిప్రభుత్వం తిరిగి మరకొన్ని అదనపు సంస్కరణలను ప్రవేశపెట్టినది.

ఇట్టి అందోళనలతోను స్వల్ప సంస్కరణలతోను రాజకీయ రంగం అస్థిమితం కావడంతో, సరికత్ ఇస్లామ్‌లోని సోషలిస్టులు, కమ్యూనిస్టులు, మితవాదులు మొదలయిన వారిలో అభిప్రాయ భేదాలు బాగా పెరిగిపోయాయి. కాని ఐదవ కాంగ్రెసు సమావేశమునాటికి అధ్యక్షుడు జోక్రో సరికత్ ఇస్లామ్‌లోని వివిధ వర్గాల వారి నందరిని కూడగట్టు కొనడానికి గాను ప్రధాన ఉద్యమాన్ని "ఇస్లామ్ జాతీయత" యెడల మరల్పజూచినాడు. కాని మతంగొందల అంతగా పట్టింపు లేని కమ్యూనిస్టులు సరికత్ ఇస్లామ్‌నుంచి విడిపోయినారు.

జోక్రోకు తోడుగా హాజీ ఆగోస్ సాలిమ్ కూడా సరికత్ ఇస్లామ్‌కు నాయకుడై ప్రధాన కార్యక్రమానికి సారధ్యం స్వీకరించాడు నాడు మెక్కా, కైరోనగరాలలో సమకూడిన "ఇస్లామిక్ కాంగ్రెస్" ఇచ్చిన సందేశాన్ని అందిపుచ్చుకొని, సరికత్ ఇస్లామ్ నడకనుకూడా అందుకు అనుగుణంగా అనువర్తించి - దేశీయులలో మతరాజకీయాల పరంగా ఒక విధమైన ఐక్య భావాన్ని ఉద్ధరించి సాలిమ్ సరికత్ ఇస్లామ్‌కు నూతనజవజీవాలను కలిగించాడు. అంతట ఆ ఐకమత్యాన్నే బలముగా తీసుకొని, అతడు సుమత్రాలోని యూరపియన్ భూస్వాములపై ప్రజోద్యమాలను పంపి, కొన్ని ఫలితాలను ఆర్జించాడు.

కాని, ప్రథమప్రపంచ మహాసంగ్రామము ముగిసిన తరువాత ప్రపంచములో బయలుదేరిన ఆర్థిక సమస్యలు ఇండోనీసియాను పీడించడము ఇంకా మానలేదు. అందువల్ల దేశంలో శ్రామికవర్గాలు సామ్రాజ్యవాదుల ఆర్థికపు దోపిడీ విధానానికి గురియై చితికిపోతూ వుండినారు. దేశమంతటా సమ్మెలు బయలుదేరాయి. ముఖ్యంగా 'రైల్వే సమ్మె' ఇండోనీసియానంతనూ కదిపివేసింది. డచ్చి ప్రభు

త్వము నిర్దాక్షిణ్యంగా తనబలసంపత్తి నంతనూ ప్రయోగించి ఈస మ్మెను అణచివేసింది. 1923 లో సమకూడిన సరికత్ ఇస్లామ్ కాంగ్రెసు ఈ విషయమై తీవ్రంగా చర్చలు సాగించింది. 'సమ్మె' లను ఆధారంగా చేసుకొనిన కమ్యూనిస్టులు తిరిగి సరికత్ ఇస్లామ్ నాయకత్వాన్ని ఆక్రమించుకోనవలె నని జాతీయ నాయకులపై దుష్ప్రచారము చేయడంవంటి పలు ప్రయత్నాలు చేసి విఫలులై నారు. ముఖ్యంగా వారి విజాతీయ విధానం యెడల ప్రజలకు సాను భూతి లేకపోవడంతో వారికి పలుకుబడి లభించ లేదు. కాగా, వారు సరికత్ ఇస్లామ్‌ను విడనాడి, ప్రత్యేకమగు సంస్థను నెలకొ లుపుకొన్నారు. దానికి 'రెడ్ సరికత్ ఇస్లాం' అని నామకరణం చేశారు. దాని నాయకులలో ఒకడైన 'సెమోన్' అను నతడు మాస్కోనుండి తిరిగివచ్చి, నాయకత్వాన్ని స్వీకరించి, కమ్యూనిస్టు లను నడపసాగినాడు. కాని, ప్రధాన రాజకీయపక్షమైన సరికత్ ఇస్లామ్ పలుకుబడినిగాని, రాజకీయ కార్యక్రమాన్నిగాని, కమ్యూ నిస్టులు ఏవిధంగాను అవరోధించి, ఇండొనేసియన్ స్వాతంత్ర్య సమ రాంగణం ముందడుగు వేయలేక పోయారు. ప్రజాభ్యున్నతికి అనుగుణ్యమైన సామ్యవాదసిద్ధాంతాలను ప్రధానాశయాలుగా సరి కత్ ఇస్లామ్ కృషిచేయడంవల్ల, కమ్యూనిస్టులు దానినేవిధంగాను దుర్బలపరుచలేక పోయారు.

సరికత్ ఇస్లామ్‌నుండి కమ్యూనిస్టువర్గం విడివడిపోయినా, ఇతరవిధములయిన అభిప్రాయభేదాలు సభ్యులలో వ్యాపించివుండినా సరికత్ ఇస్లామ్ నాయకులు తమ ప్రజోద్యమాలను విరమించ లేదు. — "ఈస్టు ఇండియా చట్టం" మార్పులు కోనితేనున్నా మని డచ్చిప్రభుత్వం ప్రకటించింది. కాని ఆమార్పులు మేడిపండు వంటివే అయినవి. 'వాక్స్‌రాడ్' అనే ప్రజాసభలో అధికసంఖ్యా కమైనసభ్యత్వస్థానాలనుఇండోనేసియనులకు లభించగలవని ఆశించిన ప్రజలకుఆశాభంగమైంది. ఫలితంగా తిరిగి దేశమంతటా సమ్మెలు సాగిపోయాయి. 1926 సంవత్సరము నాటికి ఇండోనేసియా అంత టాఅశాంతి సెగలు తిరుగసాగింది. ముఖ్యంగా సుమత్రాదీవిలో

ప్రజలు ప్రభుత్వంపై తిరగబడి సాయుధ సంఘర్షణలకే తలపడినారు. టెలిగ్రాఫ్ తీగెలను త్రెంచడము, ప్రభుత్వ కచేరీలను స్వాధీనపరచు కొనడము, యూరపియన్ భూస్వాములను చెర గొనడము మొదలయిన సంఘటనలు విరివిగా జరిగిపోయాయి. ఇండోనీసియనులు ఇట్టి విప్లవ కార్యాలను చేయగలరనికూడా ప్రభుత్వం తలపెట్టియుండ లేదు. కాని డచ్చిప్రభుత్వం చివరకు ప్రజలయెడ క్రూరంగా ప్రవర్తించి నది. సాయుధసైన్య బలగంతో ప్రజల నెదుర్కొని రక్తపు టేరు లను ప్రవహింపజేసింది. సుమారు వేయిమంది విప్లవకారులను చెర బట్టి "నూ గినియా ప్రవాసం పంపినది.

దేశీయులను స్వాతంత్ర్య యోధులను పట్టి పలు బాధలను గుదుపడానికి డచ్చి న్యూగినియా దీవిలో డచ్చిప్రభుత్వంకొన్ని ప్రవా సకేంద్రాలను నెలకొల్పి వుంచింది. 'తానమరా' 'తనతింగి' అనే ఆ రెండు ప్రవాసకేంద్రాలు కేవలం భూతల నరకాలు. ఈ కొంపు లలో అసువులను గోలుపోయిన దేశీయ స్వాతంత్ర్య యోధులు అసంఖ్యాకులుగ వున్నారు. 1931 నుండి 1939 వరకు ఈ కేంద్రా లకు పంపబడినవారు సుమారు ఐదువేలకు పైబడివున్నట్లుగా ప్రభు త్వపు లెక్కలు తెలుపుతూ వున్నాయి. ఈ కేంద్రాలకు పంపబడను వ్యక్తి తిరిగిరావడం సకృత్తు. అచట దిక్కులేక మరణించిన దేశ భక్తుల దీనచరిత్రలు వర్ణించనలవి కానివి; తలప నశక్యము లయి నవని ఇండోనీసియన్ జాతీయచరిత్రలో అవి విసాద గీతికల నాలా పిస్తుంటవి... స్వాతంత్ర్య పిపాసులను మేల్కొలుపుతూవుంటః వవి!

1926 నుండి సుమారు రెండేండ్లవరకు సాగిన ఈ స్వాతంత్ర్య సమరంయెడ డచ్చిసామ్రాజ్యప్రభుత్వం అవలంభించిన రాక్షస విధా నము ఫలితంగా ప్రజలలో ఒక విధమైన నిరాశాభావము పొడ చూపింది. నిర్వేదము నిరుత్సాహము ఎల్లెడల నెలకొన్నది. ఆ జా తీయ పోరాటాన్ని నడపడానికి ప్రధానంగా సారధ్యం వహిం చిన సరికత్ ఇస్లామ్ విషమ విమర్ణతకు లోనుగాక దేశీయులను వేరొక కార్యరంగములోనికి దింపింది. జాతీయవిద్య, జాతీయసా

మాజిక పునర్నిర్మాణము మొదలయిన నిర్మాణ కార్యక్రమాలను చేకొని సరికత్ ఇస్లామ్ నాయకులు ప్రజలను సవ్యరీతులలో మరి యొక స్వాతంత్ర్యసమరానికి తయారుచేయ నారంభించారు.

సరికత్ ఇస్లామ్ ఉపక్రమించిన ఈనూతన కార్యక్రమానికి ప్రజలు ఉత్సాహపూరితంగా తోడ్పడ్డారు. ముఖ్యంగా ఇతర దేశా లలో విద్యలు ముగించుకొని స్వదేశానికి తిరిగివచ్చిన ఇండోనీసియన్ యువకులు ఈ కార్యక్రమానికి విశేషంగా చేయూత నిచ్చారు. ఫలితంగా ఇండోనీసియా అంతటా సుమారు 40 జాతీయ విద్యా లయాలు నెలకొల్పబడినవి. మతము, సాంఘికము, ఆర్థికము — మొదలైన వివిధ వృత్తులలో నిపుణులయిన వారి పర్యవేక్షణలో ఈవిద్యాలయాలు ప్రజలలో నవ్యశక్తులను ప్రబోధించాయి. వీటికి "అడివి విద్యాలయాలు" అని డచ్చి సామ్రాజ్య వాదులు నామకరణము చేశారు. భారతదేశంలో రవీంద్రనాథటాగూర్ తన శాంతినికేతనంలో ఎట్టి విద్యావిధానాన్ని అమలు పరిచినాడో అట్టి పద్ధతుల ననుసరించి ఈ విద్యాలయాలు పనిచేయసాగినవి. వీటివలన ప్రభుత్వవిద్యాలయాలు మూలబడినవి. వాటిలోచదువుకొను దేశీయ బాలబాలికల సంఖ్య చాలా వరకు తరిగిపోయింది. —

విద్యాలయాలవలెనే సహకారసంఘాలు కూడా దేశీయ నాయకుల అధ్వర్యాన స్థాపించబడినవి. వీటికితోడు డా॥సోటోమో యను జాతీయప్రముఖుడు "ఇండోనీసియన్ బ్యాంకు"ను, 'ఇండో నీసియన్ ఇన్సూరెన్సు కంపెనీ"నికూడా స్థాపించి ప్రజలలో స్వీయ ఆర్థిక శక్తులనుకూడా వృద్ధి చేశాడు. ఇటులనే దేశీయము లైన వైద్యాలయాలు, వాణిజ్యసంస్థలుకూడ నెలకొల్పబడినవి. సుమారు ఐదేండ్లవ్యవధిలో రాజకీయరంగంలో లేకపోయినా - తదితర విధములుగా సరికత్ ఇస్లామ్ ఇండోనీసియాలో ఒక బలమైన జాతీ యోద్యమాన్ని నిర్మించ గలిగింది. —

ఈసమయములోనే ఇండోనీసియనులు భారత స్వాతంత్ర్యో ద్యమాలనుండి నూతన శక్తి యుక్తులను ఆర్జించి, వాటిని తమస్వా

తంత్ర్యోద్యమంలో అనువదించుకొన్నారు. వాండర్ బోష్ అను ఒక డచ్చిప్రముఖుడు ఈ సందర్భములో ఇట్లు వ్రాసివున్నాడు. "భారతదేశంలోని ఉద్యమాలు తూర్పు ఇండియా దీవులలోని ఉద్యమాలకు మాతృకలు. భారతస్వాతంత్ర్య సమరవిధానాలనుండి ఇండొనేసియనులు 'సహాయ నిరాకరణము' 'కాంగ్రెస్' 'స్వదేశ' మొదలయిన పదాలను, నినాదాలను గ్రహించి, అనుసరించారు...." భారతజాతీయనాయకులయిన మహాత్మాగాంధి, జవహరిలాల్ నెహ్రూ మొదలయిన ప్రముఖులు వ్రాసిన గ్రంథాలను, డచ్చిప్రభుత్వము నిషేధించినా, రహస్యంగా తెప్పించుకొని ఇండొనేసియన్ యువకవర్గాలు కంఠస్థం చేస్తూవుండినారు. సర్వవిధములా జాతీయ పోరాటం భారతజాతీయ పోరాటంను అనుకరించింది; అనుసరించింది.

1928 సం॥ ప్రాంతంలో సరికత్ ఇస్లామ్ తిరిగి రాజకీయాలలో ప్రవేశించింది. దేశమంతటా 'సహాయ నిరాకరణోద్యమాన్ని' నడుపవలెనని నాయకులు ప్రయత్నించారు. కాని ఆప్రయత్నాలను భగ్నం చేయవలెనని డచ్చిప్రభుత్వం మిక్కిలి పాటుబడి, చివరకు 'వాక్సరాడ్'లో జోక్రోకు తిరిగి ఒక సభ్యత్వాన్ని ఇచ్చి, దాని కతనిని ఉపాధ్యక్షునిగాకూడా చేయ సంకల్పించినట్లు ప్రకటించింది. కాని 'సరికత్ ఇస్లామ్ ప్రభుత్వ ప్రతిపాదనను తిరస్కరించింది. అంతేగాదు; 'ప్రభుత్వంపై తిరుగబడిన గాని, సామ్రాజ్యవాదులు లొంగుబాటుకు రారు' అనే హెచ్చరిక చేసి, సరికత్ ఇస్లామ్ నాయకులు 1929 లో దేశవ్యాపితమైన ఉద్యమాన్ని ఆరంభించారు. శాంతియుతమైన పద్ధతులలో ప్రారంభమైనప్పటికిని ఆ ఉద్యమం అచిరకాలంలోనే హింసాయుతమైన విధానాలను అనుసరించింది. జోక్రో, సాలిమ్‌లకు తోడుగా, డా॥జిప్టో, డా॥ హట్టా, డా॥సోకర్నో, సోమంత్రి, బోర్హా మొద్దీన్ మొదలగు యువనాయకులు కూడా ఆమహోద్యమ సారథులైనారు. ఇండొనేసియాలోని ప్రతిదీవియందు ప్రభుత్వంపై తిరుగుబాట్లు బయలుదేరినవి. వెంటనే డచ్ ప్రభుత్వం తనమామూలు దమనవిధానాన్ని

అవలంబించింది. జాతీయ కార్యాలయాలను అన్నిటిని ఆక్రమించి వాటిని బంధించింది. జాతీయనాయకులను వడివడిగా నిర్బంధించి, కారాగారాలలో బిగించింది. వారిలో డా॥ జిప్టో, హిట్టా, సోకర్నో, సోమంత్రి మొదలైనవారు ప్రధానులు. నాయకులనే కాక, సాధారణ ప్రజలనుకూడా పెక్కుమందిని ఖైదులలో బంధించింది డచ్చిప్రభుత్వం. సుమారు అనుమాసములపాటు ఈనిర్బంధ దమన విధానాన్ని అనుసరించి, దేశమంతటా సైనికశాసనాన్ని అమలుపరచి, డచ్చిప్రభుత్వం ఉద్యమాన్ని అపుడులోనికి తెచ్చుకొన్నది.

ఉద్యమంతా తాత్కాలికంగా ఉపశమించినదిగాని-దేశీయులలో ప్రభుత్వంయెడల కలిగిన విద్వేషభావాలు నివురుగప్పిన నిప్పువలె లోలోన రాజుకొంటూ నేవున్నవి. సరికత్ ఇస్లాం ఇంతకుపూర్వం నుండీ ప్రబోధించిన సమాధానభావాలనుదాటి, ప్రజలలో ముఖ్యంగా యువజనులలో, తమతమ రాజకీయ భవిష్యత్తును గురించి తీవ్రమైన భావాలు పొడసూపినవి. భావాలుమారినట్లే, ప్రజలకు నూతన నాయకత్వాలమీద, నాయకులమీద ఆసక్తిఇనుమడించింది. ఈ సందర్భంలో ప్రజలను అమితంగా అకర్షించినవాడు డాక్టర్ అబ్దుల్ రహామాన్ సోకర్నో-అను ముప్పదియేండ్ల యువకుడు...!

సరికత్ ఇస్లామ్‌లోని యువకవర్గాలకు నాయకత్వం వహించి డా॥ సోకర్నో ఒక అపూర్వమైన విప్లవశక్తిని ప్రకోపింపజేశాడు. రాజకీయ కార్యక్రమాలకు మతమనునది ఒక ప్రతిబంధకం కారాదని అతడు "పార్టై నేషనల్ ఇండోనీసియా" అను పేర ఒకనూతన సంస్థను స్థాపించి "ఎన్నిమతములున్నా దేవుడు ఒక్కడే అని, అన్ని మతములవారికి జాతీయత అనునది సమానంగా పూజనీయమైనదని, విశ్వసోదరభావం, ప్రజాస్వామ్య సిద్ధాంతం, సాంఘిక స్వాతంత్ర్యం మొదలైనవాటిని సర్వులు సంపాదించుకొనవలెనని" ప్రబోధిస్తూ, అతడు 'జావా'లోని ముస్లిములను, 'బాలి' లోని హిందువులను ఐకమత్యంతో ప్రబోధితులనుచేసి, వారి తోడ్పాటును

సరికత్ ఇస్లామ్‌కు అమితంగా అర్జించినాడు. సగం ఎరుపు, సగం తెలుపు రంగులుగల జెండానొకదానిని సృష్టించి—దానిని ఇండోనేసియన్ జాతీయపతాకంగా ప్రకటించినాడు. 'ఇండోనేసియరాజా' అను ఒకజాతీయగీతాన్ని రచించి, దానితో అపూర్వమైన జాతీయ ప్రబోధం చేశాడు.—1927 లో సరికత్ ఇస్లామ్ ప్రారంభించిన మహోద్యమానికి ఇతడుకూడా సారథ్యంవహించి, డచ్చిప్రభుత్వంపై హింసాయుతమైన విప్లవాన్నే రెచ్చగొట్టాడు. "రహస్యవిప్లవాన్ని పురిగొల్పుతున్నాడు" అనేసాకుపై డచ్చిప్రభుత్వం ఇతణ్ణి నాల్గు సంవత్సరాలు శిక్షవిధించి 'ప్లోర్సు' ద్వీపానికి ప్రవాసిగా పంపించింది.—

మతసామరస్యాన్ని, ఆర్థికసమానత్వాన్ని, ప్రజాస్వామ్య భావాలను ప్రబోధిస్తూ యువజనులనందరను ఆకర్షించి ఆమోఘమైన జాతీయ సమరశక్తులను నిర్మించగలిగిన డా॥సోకర్నోపై ప్రజాభిమానం అత్యల్పకాలంలోనే పెంపొందినది. కాని, డచ్చిప్రభుత్వాఘ దమన విధానానికి గురియైన ఇండోనేసియనులు తిరిగి నిరాశకు లోనై పోయారు. దీనికితోడు 1920-30 సంవత్సరాలలో ప్రపంచాన్ని ఆవరించిన ఆర్థికదుస్థితి ఇండోనేసియనులను మరింతకృంగదీసింది. ఆర్థికసమస్యలే ప్రధాన రాజకీయసమస్యలైనవి. ఇంతలో, డా॥ సోకర్నో, తదితర నాయకులు విడుదలనంది, దేశంలో ఆర్థిక పునర్నిర్మాణానికై విశేషంగా కృషిచేయనారంభించారు. కాని, ప్రతిఅడుగులోను, డచ్చిసామ్రాజ్యవాదుల స్వార్థపరత్వాలు వారికి పెద్ద ప్రతిబంధకాలైపోయాయి. అందువల్ల తిరిగి దేశవ్యాపితమైన ప్రజోద్యమాన్ని నడపినగాని, దేశీయులకష్టాలు అంతరించవనే అభిప్రాయం జాతీయవర్గాలలో ఆంకురించి, క్రమేణా బలపడ దొడగినది. పరిస్థితులువిషమిస్తూవున్న అదనుచూచి, డచ్చిప్రభుత్వం తిరిగి నిర్బంధవిధానానికి దొరకొన్నది. తీవ్రవాదులగు ఇండోనేసియన్ నాయకులను ఒకవంక నిర్బంధిస్తూ-వేరొకవంక, స్వల్పములైనరాజకీయ సంస్కరణలను అమలుపరచడంకూడా డచ్చిప్రభుత్వం ప్రారంభించింది.

వాక్సురాడ్ లోని మొత్తం 60 స్థానాలలోను ఇంతకుపూర్వం ఇండోనేసియనులకు ప్రత్యేకింపబడిన 24 స్థానాలను 30 వరకు డచ్చిప్రభుత్వం పెంపుచేసింది. పరిపాలనలో ఇండొనేసియనులకు అధికమైన ప్రవేశాన్ని ఈయడానికి ప్రభుత్వం అంగీకరించింది. కాని, ఇదేసమయంలో ప్రభుత్వం విద్యా ప్రచారానికగు ఖర్చును చాలా తగ్గించివేసింది. ఈమార్పులన్నీ జాతీయవాదులకు రుచించలేదు. కాగావారు ఏదోఒక రూపాన ఆందోళన చేస్తూనేవుండినారు.

శాసనసభలోను, ప్రభుత్వపరిపాలనలోను, ఆర్థికవిషయాలలోను ఇండోనేసియన్ జాతీయవర్గాలు తమ అసంతృప్తిలను వెల్లడిస్తూ ఆందోళన చేస్తూవుంటే - డచ్చిప్రభుత్వం ఒకవిషయములో సంస్కరణలను ప్రవేశపెట్టి, మరియొక సందర్భంలో క్రొత్త ఇక్కట్టులను కల్గించసాగినది. ఆ ఇక్కట్టును గురించి ప్రజలు ఆందోళన చేయగా డచ్చిప్రభుత్వం తిరిగి అందుచిన్న సంస్కరణలను తలపెట్టి, వేరొకవిషయంలో క్రొత్తచిక్కులను కల్పింప దొడగినది. ఈవిధంగా ఒకదానిలో కొంచెం ఆశపెడుతూ వేరొకదానిలో కఠినతనంచూపుతూ డచ్చిసామ్రాజ్యవాదులు ఆసాంతము ఇండోనేసియనులతో చెరలాటాలను ఆడారు; పేరుకేగాని, ఫలరూపాన ఇండోనేసియనులకు ఏమాత్రపు రాజకీయ స్వత్వాలనైనా ప్రసాదించకుండా డచ్చివారు సుమారుపాతికేండ్ల పాటు ఇండోనేసియన్ జాతీయతతో మోసపుక్రీడలను నెరపినారు.

1930 సంవత్సరం మొదలుకొని - ద్వితీయప్రపంచ మహాసంగ్రామం ప్రారంభ మగువరకు ఇండొనేసియాలో డచ్ వారు అభివృద్ధి చూపిన రాజకీయ సమస్యలేదు; ఆర్థిక విశేషంలేదు. సరికత్ ఇస్లామ్ అనుసరిస్తూవుండిన స్వాతంత్ర్య సమర విధానాల యెడల ప్రజలకు విశ్వాసం లేకపోలేదు గాని అతృప్తులైన కొందరు జాతీయవాదులు అందుండి విడివడి భిన్నమార్గాలను అనుసరించ నారంభించారు. సుమారు అర్థశతాబ్దిగా ఇండొనేసియా జాతీయపోరాటాన్ని తీర్చిదిద్దిన సరికత్ ఇస్లామ్ 1930 తదనంతరం ప్రధానమైన మూడు పక్షాలుగా చీలిపోయింది, 1. ఇండొనేసియన్ పార్టీ,2. పర్తై

బాంగ్సా ఇండోనీసియా, 3. పర్ సైరాజత్ ఇండోనీసియా అనే మూడుపక్షాలు వేరువేరుగా ఇండోనీసియన్ రాజకీయాలను నడుప దొడగినవి. వీటిలో ఇండోనీసియన్ పార్టీ ఎప్పుడూ ప్రభుత్వంతో సహాయనిరాకరణం చేయడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకొన్నది. పర్ సైబాంగ్సా ఇండోనీసియాపక్షం కొన్నిహామీలను కోరుతూ, ప్రభుత్వంతో సహకరించడమే ఆశయంగా కలిగివున్నది. మూడవదైన పర్ సైరాజత్ ఇండోనీసియాపక్షం - ప్రభుత్వంతో చేతులుకలిపి, వీలైనంతవరకు సంస్కరణలను సంపాదించడమనే విధానాన్ని అవలంబించింది; అనుచరులేలేరు.

మార్గాలుభిన్నమైనా ఈమూడుపక్షాలు - ఇండోనీసియాకు స్వాతంత్ర్యం సంపాదించవలెననే పరమాశయంతోనే కృషిచేయ సాగినవి. కాని డచ్చిప్రభుత్వం ఈమూడు వర్గాలమధ్య పాచికలు ఆడుతూ, తన సామ్రాజ్యవిధానాన్ని నిరాటంకంగా అనుసరించ సాగినది. అయినా 1936 సంవత్సరంలో వాక్సురాడ్ సమావేశం లో ఒక ప్రధానమైన తీర్మానం ఆమోదింపబడినది. "ఇండోనీసి యాకు వెంటనే అధినివేశ స్వాతంత్ర్యాన్ని డచ్ ప్రభుత్వం అంగీక రించాలి" అనే తీర్మానం ఆమోదింపబడినప్పటికిని డచ్ ప్రభుత్వం దానిని పట్టించుకోలేదు. శాసనసభ ఆమోదించిన ఆతీర్మానం ఒక వ్యర్థ వ్యవహారమే అయిపోయింది. అంటే నోరులేనిశాసనసభగా అది మారిపోయినదన్నమాట! శాసనసభ పేరిట చెల్లుబాటుఅవుతూ, కార్యరూపాన దేనినీ సాధించలేని అట్టి సభతో డచ్ సామ్రాజ్య వాదులు ఇండోనీసియన్ జాతీయవాంఛను అవహేళనచేసి, తను అధికారాన్ని చెలాయించుకొన సాగినారు.

పాతికేండ్లపాటు, ధనప్రాణాలను ధారపోసి ఇండోనీసియన్ దేశభక్తులు స్వాతంత్ర్యసమరాంగణంలో సర్వత్యాగాలు చేసినా, డచ్చిసామ్రాజ్యవాదులు చలించలేదు. ఆదలా వారెట్టి దోపిడీ విధానాన్ని అనుసరించారో, దానినే వేయిరీతులుగా అనుసరించ సాగినారు. ఆధునిక ప్రపంచంలో అన్నిదేశాలు, తుదకు అస్వా

తంత్ర్య దేశాలుకూడా, రాజకీయార్థికరంగాలలో కొంతవరకైనా ప్రగతిగాములు కాకపోలేదు. - కాని - డచ్చిప్రభుత్వపరిపాలనలో ఇండోనీసియా అట్టి ఛాయలలో ఆవంతైనా అడుగిడలేదు; సాధారణ పౌరసత్వాలే అచట కరువైపోయాయి.

ద్వితీయప్రపంచ మహాసంగ్రామం బ్రద్దలై—జపాను ఇండోనీసియాను ఆక్రమించుకొను నాటివరకు ఇండోనీసియాలోని డచ్చి సామ్రాజ్యవాదుల జడస్వరూపం ఈవిధంగానే వున్నది.



# డచ్ సామ్రాజ్యపతనం

సామ్రాజ్యవాదులకు పుట్టినిల్లయిన ఐరోపాఖండం ద్వితీయ ప్రపంచ సంగ్రామాగ్నిగుండంలో చిక్కుకున్నది. జర్మన్ నియంత హిట్లరు హాలెండుపై తనయుద్ధరథాన్ని నడిపించినాడు. 1939 సెప్టెంబరు 3 వ తేదీని బ్రిటన్ అమెరికాలు హిట్లరుపై యుద్ధాన్ని ప్రకటించాయి. కాని హాలెండులోని డచ్చిప్రభుత్వం హిట్లరు నెదుర్కొనగల శక్తిలేమిచే తాటస్థ్యాన్ని ప్రకటించింది. అయినా హిట్లరు తనసైనికదళాలను హాలెండుపై దుమికించాడు. యుద్ధం చేయకుండానే హాలెండు హిట్లరుకు దాసోహమన్నది. వెంటనే డచ్చిరాణి 'విల్ హెల్మినా' తన ప్రభుత్వాన్ని ఇంగ్లండుకు మార్చి వేసుకున్నది.

హాలెండు హిట్లరుచే ఆక్రమింపబడిన వెంటనే డచ్చి వలస రాజ్యాలలో ఆందోళన బయలుదేరింది. స్వాతంత్ర్యోత్సుకులైన ఇండోనీసియనులు ఈఅవకాశాన్ని వినియోగించుకొని డచ్చిప్రభుత్వం పైతిరగపడతారని-డచ్చిసామ్రాజ్యవాదులు భీతిలినారుగాని, ఇండో నీసియనులు అట్టి అధర్మానికి ఒడిగట్టలేదు. పైగావారు ప్రభుత్వంతో సహకరించి, శత్రువును నిర్జించడానికి ఆయత్తులైనారు.

లండన్‌లోనున్న డచ్చి కాందిశీక ప్రభుత్వం ఇండోనీసియనుల సహాయసంపత్తినంతను కూడగట్టుకొను ఆశతో - వెంటనే ఇండోనీసియా ప్రభుత్వంలో తీవ్రమైన మార్పులను కొనితేవలెనని, అందుకు అవసరమైన చర్యలను గైకొనవలసినదని, డచ్చి గవర్నరు జనరల్‌కు హుకుములిచ్చింది. ఫలితంగా ఇండోనీసియన్ నాయకులు ప్రభుత్వంలో బాధ్యతాయుతమైన పదవులను తాత్కాలికమైన ఏర్పాటులుగా స్వీకరించారు. సరికత్ ఇస్లామ్ నాయకులలో ఒకరైన సాలిమ్ ప్రభుత్వప్రచారశాఖలో సలహాదారు పదవిని స్వీకరించి - పనిచేయ నారంభించాడు.

జావాలో వలసినంత అంగబలమున్నది. వీరినికూడ గట్టు
కొని సైనికశిక్షణ నిచ్చినట్లయితే డచ్చిప్రభుత్వం శత్రువు నెదు
ర్కొనగలశక్తినిసంపాదించగలుగుతుంది. ఇంతేగాదు;ఆయుధనిర్మా
ణానికివలసిన ముడిపదార్థాలుకూడా జావాలో అపారంగా లభ్యం
అవుతాయి. అయితే - డచ్చి ప్రభుత్వం ఇదివరకెన్నడూ అట్టి ప్రయ
త్నాలను చేసివుండలేదు; కనీసం ఇండోనేసియా రక్షణకొరకైనా
దేశీయులకు సైనికశిక్షణనీయలేదు; ఆయుధనిర్మాణ యంత్రా
గారాలను స్థాపించలేదు. కాని యుద్ధపువెల్లువలు పైబడి ముంచు
కొని పోతూవున్న తరుణంలో - డచ్చి ప్రభుత్వం కళ్ళుతెరిచి
హుటాహుటిగా అట్టి ప్రయత్నాలను చేయదొడగినది. రాగి,ఉక్కు
అల్యూమినియమ్, రసాయనికద్రవ్యాలు మొదలైన వాటిని తయారు
చేసేయంత్రాలను నెలకొల్పి ఆదరాబాదరా డచ్చిప్రభుత్వం పని
ప్రారంభించింది. కాని - అప్పటికప్పుడే అంతామించిపోయింది
పడిన శ్రమఅంతా గతజలసేతుబంధనం వంటిదే అయిపోయింది.

యుద్ధ ప్రయత్నాలు ఈవిధంగా నిష్ప్రయోజనాలైనట్లే
లండన్‌లోని డచ్చి కాందిశీక ప్రభుత్వానికి ఆర్థికవడగాడ్పులు
కూడా తీవ్రంగా సోకనారంభించాయి.

తననే రక్షించుకొనజాలని డచ్ ప్రభుత్వం ఇండోనేసియాను
మాత్రం ఏమి రక్షించగలుగుతుంది? అందువలన ఇండోనేసియా
రక్షణకొరకు ఇండోనేసియాలోని డచ్ పౌరులందరూ నూటికి
తొంభైవంతులు ఆదాయప్పన్ను చెల్లించవలెనని డచ్ కాందిశీక
ప్రభుత్వం విజ్ఞప్తిచేసింది. దీనికితోడు అమెరికా, బ్రిటనుల
తోడ్పాటు తనకున్నదనికూడా వారికి ధైర్యవచనాలు పలికింది.
అయినా దేశరక్షణకు సరిపడు సహకారం ప్రజలనుండి లభించ
లేదు. ఇందుకు వేరొకకారణంకూడా లేకపోలేదు.

ఐరోపాలో హిట్లరుబారినుండి తనకు విముక్తికలిగించుకొన
డానికి హాలెండు బ్రిటన్‌పై ఆధారపడక తప్పనట్లే ప్రాచ్యఖం
డంలో జపాన్‌నుండి తనవలసదేశాలకు ఎట్టి ప్రమాదము వాటిల్ల

కుండా చేసికొనడానికికూడా డచ్ ప్రభుత్వం బ్రిటన్, అమెరికాల నాశ్రయించక తప్పలేదు. ఇందుకు మలయాలోని సింగపూర్ నౌకాకేంద్రంపై బ్రిటన్ వలెనే హాలెండుకూడా పెద్దఆశలు పెట్టుకొన్నది. అట్టి సింగపూర్‌కు వలసిన సైనికశక్తిని సమీకరించుకొనడానికి బ్రిటన్‌కు సర్వసదుపాయాలను కలిగించవలసివుంది. ఇందుకు అనుగుణంగా హాలెండు ప్రభుత్వం 1939 నవంబరు 4 వ తేదీని ఒక ప్రకటనచేస్తూ, ఇండోనేసియాకూడా ఈ యుద్ధంలో తాటస్థ్యాన్ని వహిస్తుందని, అయినప్పటికిని మిత్రరాజ్యాల యుద్ధ నౌకలు, సైనిక సంచారానికి ఇండోనేసియా ఎట్టి ఆటంకాలను కలిగించదని తెలియజేసింది. దీనివలన 'సుండాజలసంధి' మిత్రరాజ్యాల యుద్ధనౌకలకు మంచిరహదారిగా ఏర్పడింది.

సింగపూర్ ప్రాచ్యఖండంలో మిత్రరాజ్యాలకొక దుర్భేద్యమైన సైనిక దుర్గంగా ఏర్పడివుండడం వలన ఇండోనేసియాలోని డచ్ ప్రభుత్వం ఒక విధమైన అలసోకభావాన్ని వహించింది. కాగా డచ్ ప్రజలనుండి గాని; దేశీయులనుండిగాని, లండన్‌లోని డచ్ కాందిశీక ప్రభుత్వం ఆశించిన సహకారం లభించలేదు.

ఇట్టి విపరీత పరిస్థితులలో, డచ్‌రాణి 'విల్‌హెల్‌మినా' తన సామ్రాజ్యాన్ని పునర్నిర్మాణం చేసినగాని, భద్రమైన భవిష్యత్తు లేదని గ్రహించి సామ్రాజ్య ప్రజలనుద్దేశిస్తూ ఒక ప్రభుత్వ ప్రకటన జారీచేసింది. ఆ ప్రకటనలోని సారాంశం క్లుప్తంగా ఇది.

(1) యుద్ధానంతరం ఇండోనేసియా స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పొందుతుంది; తన రాజ్యాంగాన్ని తానేనిర్మించుకొని పరిపాలన సాగించగలుగుతుంది.

(2) ఇండోనేసియాలో, హాలెండుదేశాల సంబంధబాంధవ్యాలు "సమానహోదా"లో కొనసాగగలవు.

(3) ఏదైనా ఒక కేంద్ర ప్రభుత్వం స్థాపింపబడినట్లయితే హాలెండు ప్రభుత్వంతో సరిసమానమైన స్థానాలు ఇండోనేసియాకు కూడా లభించగలవు.

—ఈముఖ్యమైన మూడువాగ్దానాలనుచేస్తూ డచ్ రాణి, ఇండొనీసియనుల సహకారసానుభూతులను అర్థించి, యుద్ధవిజయానికి తోడ్పడమని కోరింది. కాని ఇండొనీసియన్ స్వాతంత్ర్యవాదులకు ఈ వాగ్దానాలు రుచించలేదు. ఇదివరలో డచ్ ప్రభుత్వం చేసిన కపట వాగ్దానాలను ఎరిగివున్న మీదట భారతదేశంలో కూడా బ్రిటిష్ సామ్రాజ్య వాదులు ఇట్టి కూటతంత్రాలను అనుసరిస్తూ వుండడం గమనించినమీదట ఇండొనీసియన్ జాతీయవాదులు డచ్ ప్రభుత్వ ప్రకటనను విశ్వసించలేక పోయారు.

ఇట్టిపరస్పర అవిశ్వాస పూరితమైన వాతావరణంలో - ఇండొనీసియా రక్షణకు వలసిన సైనికసంపత్తిగాని; తదితర ఆయుధబలాలుగాని ఏర్పాటుకాలేదు. ఇంతలోతూర్పుదిక్కున జపాన్ యుద్ధపుచిచ్చు ముట్టించింది. పెర్ల్ హార్బర్, ఫిలిప్పయినులు ఇండోచైనాలను దిగమ్రింగి - జపాన్ ఇండొనీసియాపైననే విరుచుకొని పడింది. బోర్నియోదీవిని బాంబుదెబ్బలతో చితకగొట్టి, 1942 ఫిబ్రవరి 20 వ తేదీని జపాన్ సైన్యాలు 'బాలీ' దీవినిగూడా ఆక్రమించాయి. మార్చి 6 వ తేదీని జావాలోదిగి బటేవియాలో తమవిజయపతాకాన్ని ఎగురవేశాయి.

డచ్చిప్రభుత్వం ఇంచుమించుగా యుద్ధమే చేయలేదు. వుండిన కొలది సైనికదళాలు అస్త్రసన్యాసంచేసి జపాన్‌కు లొంగిపోయాయి. డచ్చి ఇండొనీసియన్ ప్రభుత్వాన్ని చంకనుపెట్టుకొని అప్పటిడచ్చిగవర్నర్ జనరల్ వాన్ మూక్ డచ్ న్యూగినియాకు,పిమ్మట ఆస్ట్రేలియాకుపరుగెత్తితలదాచుకున్నాడు. ముఖ్యులైన డచ్చిఅధికారులు,పౌరులు ఖంగారుగా ఇండొనీసియాను వదలి స్వదేశానికిపారిపోయారు.మిగిలినవారు ప్రాణాలను అరచేత పట్టుకొనిజపాన్ సైనిక ప్రభుత్వానికి దాసోహమన్నారు. అసలుఈపరాజితప్రక్రియనంతా, దుర్బలులగు చిన్నచిన్న డచ్చి మిలటరీ ఉద్యోగులే సాగించినారు. డచ్చి ప్రభుత్వపు యుద్ధనాయకులు ఏమైపోయారో కన్పించలేదు తుపాకీగుండ్లను పేల్చనవసరం లేకుండానే జపాన్ డచ్చిప్రభుత్వాన్ని

లోబరచుకుంది; ఇండోనేసియానంతనూ ఆక్రమించుకొన్నది. - అతి సునాయాసంగా, మున్నెన్నడును ఆశించివుండనివిధంగా జపాన్ - ఇండోనేసియాలో డచ్చిసామ్రాజ్యానికి చరమగీతంపాడింది. ఇండోనేసియనుల స్వాతంత్ర్యాన్ని హరిస్తూ వారిభాగ్యభోగ్యాలను కొల్లగొట్టుకుంటూ కైపుఎక్కివున్న డచ్చిసామ్రాజ్యప్రభుత్వం క్షణాల వ్యవధిలో ఇండోనేసియాలో అస్తమించిపోయింది....

ద్వితీయ ప్రపంచమహా సంగ్రామం ఆరంభ దశలోనే ఇండోనేసియాలో డచ్చిసామ్రాజ్యం పతనమైంది. యుద్ధమధ్యంలో జపాన్ ఆక్రమణప్రభుత్వం ఇండోనేసియాలో ఆరంభమైంది ఇండోనేసియాలో ఒక పాశ్చాత్య సామ్రాజ్య ప్రభుత్వం అస్తమించగానే - దానిస్థానంలో వేరొక ప్రాచ్య సామ్రాజ్య ప్రభుత్వం ఉదయించి - తన పడగను విప్పింది.

# జపాన్ ఆక్రమణ

ఇండోనేసియనులు సంపూర్ణస్వాతంత్ర్యంకోసం అర్ధశతాబ్దిగా డచ్చిసామ్రాజ్యవాదులతో పోరుతూవున్నారు. అంగబలము వలసినంత వారికివున్నవి. ఐశ్వర్యానికికూడా వారికి ఎట్టిలోటునున్న లేదు. రాజకీయ పంథాలలో స్వల్పములైన భేదములున్నప్పటికిని వారందరి ఆశయమున్ను స్వాతంత్ర్య సంపాదనమే ఐవుండడంవల్ల వారిలో మంచి ఐకమత్యమున్నది. కాని, డచ్చిసామ్రాజ్యాన్ని పారద్రోలగల ఆయుధబలంలేదు. అందువల్ల వారుసర్వత్యాగాలనుచేస్తూ అహింసాయుతంగా, ఆందోళనరూపంలో మాత్రమే డచ్చిసామ్రాజ్యవాదులతో పోరాటంజరుపుతూ వున్నారు.

కాని, ఇంతలో డచ్చిసామ్రాజ్యప్రభుత్వం జపాన్‌చేతిలో హీనమైన పరాజయమంది, ఇండోనేసియానంతను జపాన్‌సైనికాధికారులకు వప్పజెప్పింది. దీనితో ఇండోనేసియాపై డచ్చిసామ్రాజ్య ప్రభుత్వప్రాబల్యానికి ఆశ్వాసారితమైపోయినట్లే. కాని, ఇండోనేసియాకు డచ్చివారిస్థానే మరొకసామ్రాజ్యవాద ప్రభుత్వపు అధికారం ప్రాప్తించింది. ఇండోనేసియనులు తమనూతనాధికారి జపాన్‌తో ఇకపోరాడవలసివున్నదిజపాన్‌నుండిఅధికారాన్నిలాగుకొన్నట్లయితే ఇండోనేసియనులకు సంపూర్ణ స్వాతంత్యం లభిస్తుంది. ఇకముందు దానికెట్టి అవరోధమున్ను ఏర్పడజాలదు. కాగా ఇట్టిఆశతో ఇండోనేసియనులు జపాన్‌తో తమ వ్యవహారమును చక్కబెట్టుకొనవలెనని ప్రయత్నించసాగారు.

ఇండోనేసియనులు జపాన్‌నుండి తమచిరవాంఛితాన్ని ఈడేర్చుకొనగలమని ఆశించారు. కారణం? యుద్ధాన్ని ప్రారంభిస్తూ జపాన్ ప్రకటించిన యుద్ధాశయాలు; ప్రాచ్యఖండంలోని అస్వతంత్ర్యజాతులనందరిని ప్రలోభపెట్టినవి.

"ఆసియా ఆసియావాసులకే..." "పరస్పర సహకారం" "పరస్పరఐశ్వర్యాభివృద్ధి" "నవ్యప్రపంచవ్యవస్థ" అంటూజపాన్

ప్రకటించిన ఆశయాలనువిని - ఇండోనేసియనులు తమఆశలు ఫలించగలవని తలచి జపానుకు సర్వవిధములా సహకారమీయ సంకల్పించుకొన్నారు. కాని, ఇండోనేసియాలో జపాన్ అడుగు పెట్టిన తదుపరి దానిప్రవర్తనను గమనించి, ఇండోనేసియనులు తమ అభిప్రాయాన్ని అచిరకాలంలోనే మార్చుకొనకతప్పలేదు.

అయితే జపాన్ కూడా ఇండోనేసియానుండి విశేషమైన సహకారాన్ని ఆశించివుంది. ఇండోనేసియా అంగబలాన్నిఅంతనూ, చక్కగా తరిఫీదుచేసి, తనసామ్రాజ్యయుద్ధాన్ని కొనసాగించుకొన వలెనని, ఇండోనేసియాలోని సహజసంపదనంతనూ వినియోగపరుచు కొని, ఆయుధశక్తిని నిర్మించుకొనవలెనని - జపాన్ అందుకు అవ సరమైన పథకాలనన్నిటిని వేసుకొన్నది. ఇండోనేసియనులు కొన్ని దశాబ్దులుగా చేస్తూవున్న స్వాతంత్ర్య పోరాటాన్ని గమనించి వుండటంవలన అట్టి ప్రజలతో వివాదు పెంచుకొనడంకంటె, వారితో స్నేహంగానే మెలగి, తనఆశయాలను సఫలీకృతం చేసికొనవలెనని జపాన్ భావించింది. ఇందుకు అనుగుణంగా జపాన్ ప్రధానమంత్రి హెడేకేటోజో, "చిరకాలంలోనే ఇండోనేసియా సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని బడయగలదు..." అంటూ ఆనెలోనే ఒక ప్రక టన చేశాడు. ఇండోనేసియా ఐశ్వర్యాన్ని అనుభవించవలెనంటే - అది ఇండోనేసియన్ నాయకులద్వారానే బాగుగాజరగగలదని అతడు ఇండోనేసియన్ జాతీయనాయకుల నందరిని కూడగట్టు కొన్నాడు.

జపాన్ ఇండోనేసియాను ఆక్రమించునాటికి ఇండోనేసియన్ యువనాయకులలో అగ్రేసరుడైన డా॥ అబ్దుల్ రహమాన్ సోకర్నో సుమత్రాదీవిలో దచ్చివారిచే నిర్బంధింపబడి వున్నాడు డా॥ మహమ్మద్ హట్టా అంబోయినాలో కారాగార బంధితుడై వున్నాడు. వీరిరువురిని విడుదలచేసి. జపాన్ అధికారులు వారిని రాజగౌరవాలతో సన్మానించారు. "ఏడుకోట్ల ఇండోనేసియనుల ఏకైకనాయకుడు" అని కీర్తిస్తూ డా॥ సోకర్నోను మిలటరీ అధి కారులు జపానుకు తీసుకువెళ్ళారు. టోకియోనగరంలో బ్రహ్మాండ

మైన సభచేసి - జపాన్ చక్రవర్తి అతనికి "ఆర్డర్ ఆఫ్ది రైజింగ్ సన్" అను పతకాన్ని బహూకరించి, సత్కరించాడు.

డా॥ సోకర్నో ఇండొనీసియాకు తిరిగివచ్చిన వెంటనే - జపాన్ ప్రధాని టోజో ఒక సెంట్రల్ కౌన్సిల్ను స్థాపించి, దానికి డా॥ సోకర్నోను అధ్యక్షునిచేశాడు. తరువాత, పశ్చిమజావాకు, మధ్యజావాకు ఇరువురు ఇండొనీసియనులు గవర్నర్లుగా నియమింపబడినారు. జపాన్ మిలటరీ అధికారుల అజమాయిషీలో ఇండొనీసియాకు జాతీయప్రభుత్వం లభించింది. ఆప్రభుత్వం నెరవేర్చవలసిన విధులుగా నూతనమైన జాతీయసైన్యాన్ని నిర్మించడము, కార్మిక శక్తిని పూర్తిగా సంఘటితపరచడము, యుద్ధకాలపు ఆర్థిక విధానాన్ని బాగాఅమలుపరచడము - అన్ని ఉత్పత్తులను విరివిగా అభివృద్ధిపరచి, యుద్ధనిర్వహణకు తోడ్పడడము - మొదలైనవాటిని నిర్దేశిస్తూ, జపాన్ ప్రభుత్వం ఇండొనీసియా జాతీయప్రభుత్వానికి బాగాతోడ్పడింది.

ఇండొనీసియాను కొల్లగొట్టుకొనవలెననే ఉద్దేశ్యముతో జపాన్ జాతీయనాయకులచే అన్ని ఉత్పత్తులను పెంపుచేస్తూవుంటే-ఇండొనీసియన్ జాతీయనాయకులు ఆరహస్యాన్నిగ్రహించి, వాటిని తమ స్వాతంత్ర్యపోరాటానికి అనుగుణంగా వాటిని మార్చుకొనవచ్చుననే ఆశతో, జపాన్ ప్రయత్నాలకు తగుమైన జాగ్రతలతో సహకరించారు.

ఇండొనీసియనులను విరివిగా సమకూర్చి సైనికశిక్షణనిచ్చారు. పట్టణాలలోను, పల్లెలలోను, పాఠశాలలలోను, ఫాక్టరీలలోను, చివరకు చిట్టడవులలోను, సర్వత్రా వందలకొలది ఇండొనీసియన్ యువకులనుచేర్చి వారికి తరిఫీదునిచ్చి, స్వదేశాన్ని కాపాడుకొనగల దిట్టలుగా వారిని తయారుచేసినారు. ఇవిగాక, వ్యవసాయకులకు, యువజనులకు, నావికులకు, ఉపాధ్యాయులకు, పోలీసులకుకూడా ప్రత్యేకమైన శిక్షణకేంద్రాలు నెలకొల్పబడినవి. ఇండొనీసియనులను శక్తివంతమైన ఒకనవ్యజాతిగా తయారుచేయ

వలెనని డా॥ సోకర్నో అనేకశిక్షణశాఖలను నెలకొల్పి ప్రజలకు అమోఘమైన తరిఫీదునిచ్చాడు.

వీటికితోడు - డా॥ సోకర్నో మరియొక ఘనకార్యాన్ని కూడా ఆచరించగలిగాడు. "గెరిల్లాయుద్ధదళాలను" కూడా అతడు తయారుచేయించాడు. వందలకొలది కర్షకులు రహస్యంగా కొండ గుహాలలోను, అరణ్యాలలోను రాత్రులప్పుడు సమావేశమై గెరిల్లా యుద్ధక్రమాన్ని బాగాఅభ్యసించారు. జపాన్‌తో ఏనాటికైనా యుద్ధంచేయకతప్పదని, తమదేశానికి సంపూర్ణస్వాతంత్ర్యాన్ని సంపాదించవలెనంటే ఇదిఅనివార్యమని డా॥ సోకర్నో ముందుగానే గ్రహించుకొని, అట్టిసన్నాహాలను వేర్వేరుగా చేయదొడగినాడు. డా॥ అమీర్ సరిఫుద్దీన్ అను గెరిల్లాయుద్ధప్రవీణుని నాయకత్వం క్రింద గ్రామగ్రామంలోను శక్తివంతమైన గెరిల్లా దళాలను సోకర్నో నిర్మింపగలిగాడు.

ఇక ప్రజలలో జాతీయతాప్రచారానికి కూడా డా॥ సోకర్నో మంచి ఏర్పాట్లుచేశాడు. శ్రీమతి హీరావతి అనునామె ఈ ప్రచారంలో నవ్యరీతులను ప్రవేశపెట్టింది. ట్రాములలోను, బస్సుల లోను, బహిరంగసమావేశాలలోను, క్లబ్బులలోను, పాఠశాలల్లోను యంత్రాలయాలలోను విరివిగా వాడుకొనుటకు జాతీయనినాదాలను సృష్టించి ఈమెఅఖండమైన ప్రచారాన్ని చేసింది. "మెర్డికా" అను పత్రికనుస్థాపించి - జాతీయప్రబోధం చేసిన మహ్మద్ దీన్‌ను ఈమె వివాహంచేసుకుని అతనితోపాటు ప్రజలలో స్వాతంత్ర్యేచ్ఛను ఉద్దీపింప జేసింది.

ఇండోనీసియాఅంతటా పుష్కలమైన జాతీయ సంరంభం వికసిస్తున్నది. దేశీయులందరిలోను ఐక్యతను సంఘటితపరచి, బ్రహ్మాండమైన పునర్నిర్మాణం కొనసాగిస్తూవున్న డా॥ సోకర్నోను చూచి జపాన్ యుద్ధనాయకులకు కన్నుకుట్టింది. తాము సోకర్నో ద్వారా వేటినైతే ఆశించారో అవి అనుకున్నంతగా లభించక పోవడమేగాక, తాముసమకూర్చిన అవకాశాల నన్నింటిని

సోకర్నో జాతీయస్వాతంత్ర్య నిర్మాణపు పంథాలో వినియోగించుకుంటూ వుండడం చూచి, జపాన్ మిలటరీ అధికారులు, అందుకు ప్రతిబంధకాలను అమలు జరపవలెనని ప్రయత్నించారు.

దేశంలో యువజనోద్యమ మొకటి అంకపాంకాలుగా విస్తరించింది. వారిలోవున్న "ఫాసిస్టు వ్యతిరేకభావాలను" అణిచి వేయాలని జపాన్ ప్రయత్నించి విఫలమయింది. జపాన్ వారు తాము అన్నిజాతులకంటె అధికులమనే భావంతో వారియెడ ప్రవర్తించసాగారు. దీనిఫలితంగా 1944 సంవత్సరంలో జపాన్ వ్యతిరేకోద్యమం దేశంలో బయలు దేరింది. ఈ సమయంలో ఇండోనీసియాలోని డచ్చి ప్రభుత్వానుకూలురగు కొందరు జపాన్‌పై కుట్రలు పన్నప్రయత్నించారు. డా॥ సోసిలో అనునతడు అట్టి కుట్రదారులకు నాయకుడని - జపాన్ అతణ్ణిపట్టి, మరిరెండువందల మంది అనుచరులతోసహా ఉరతీసింది. ఈవిధంగా దేశీయులను భయపెట్టి, నాయకులచే తమకు కావలసిన స్వాత్వాలను నెరవేర్చు కొనవలెనని జపాన్ మిలటరీ అధికారులు ప్రయత్నించారు. కాని అదిన్నీ నిష్ప్రయోజనంగానే పరిణమించింది. అందువలన 'సెంట్రల్ కౌన్సిల్' ను రద్దుచేయాలని జపాన్ ప్రయత్నించింది. కాని అది ఓపట్టాన వీలుకలుగలేదు. కానిచివరకు 1944 సంవత్సరాంతాన జపాన్ ఆపనిని పూర్తిచేసి తిరిగి ఇండోనీసియాలో తన సైనికపరి పాలనను నెలకొల్ప యత్నించింది.

కాని అది పూర్తికాకమునుపే జపాన్‌కు అంత్యఘడియలు సమీపించినవి.

1945 ఆగష్టు 6 వ తేదీని అమెరికన్ వైమానికులు జపాన్ లోని హిరోషిమా నగరంపై 'ఆటంబాంబు' ను విసిరినారు. క్షణాల వ్యవధిలో హిరోషిమానగరం భస్మీపటలం అయిపోయింది. 9 వ తేదీని, నాగసాకీనగరంపై మరియొక ఆటంబాంబుపడి - అదిన్నీ దగ్ధమై నామరూపాలు లేకుండా పోయింది.

జపాన్ ఈ బాంబు దెబ్బలకు మతిచెడి, అచేతనమైన స్థితిలో పడి, కర్తవ్యమూఢయైవున్న సమయంలో అటురష్యా జపానుపై యుద్ధాన్ని ప్రకటించి, మంచూరియా సరిహద్దుల్లో చొరబడి చకచకా ముందుకు చొచ్చుకొని పోసాగినది.

ఆటంబాంబు దెబ్బలకు, రష్యన్ సైన్యాల దండయాత్రలకు గురియై జపాన్ శక్తి విహ్వలయై పోయింది. చేయునదిలేక జపాన్ 1945 ఆగస్టు 15 వ తేదీని మిత్రరాజ్యాలకు శరణన్నది.

జపాన్ శరణాగతి అన్నవెంటనే డా॥ సోకర్నో వడివడిగా దేశ భవిష్యత్తును నిర్మించ నారంభించాడు విశుద్ధముగా తయారైవున్న ప్రజాసైన్యం జపానువారిపై తిరగబడింది. అనేక చిల్లర యుద్ధాలనుచేసి, జపాన్ సైనికులను ఖైదీలుగా పట్టుకొని వారి వద్దనున్న ఆయుధ బలమునంతను ఇండోనీసియన్ సైనికులు భుక్తంచేసికొన్నారు.

వెంటనే డా॥ సోకర్నో స్వాతంత్ర్య ప్రభుత్వాన్ని స్థాపించి ఇండోనీసియాపై సర్వాధికారాలను హస్తగతంచేసి కొన్నాడు.

# ఇండోనీసియన్ రిపబ్లిక్

1945 ఆగస్టు 17 తేదీని జపాన్ జితోస్మి అన్నది.

జపాన్ పతనమైన రెండురోజులకు డా॥ సోకర్నో 'ఇండోనీసియన్ రిపబ్లిక్' ప్రభుత్వాన్ని స్థాపించి ఇండోనీసియనులు సర్వ స్వతంత్రమైన ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని నెలకొల్పుకొన్నారని రేడియోద్వారా ప్రపంచానికి తెలియజేశాడు.

ఇండోనీసియన్ ప్రజల ఏకైక నాయకుడుగా డా॥ సోకర్నో 'ఇండోనీసియన్ రిపబ్లిక్'కు అధ్యక్షుడుగా సర్వాధికారాలను అందిపుచ్చుకున్నాడు. డా॥ సోకర్నోకు ఆదినుండి కుడిభుజమువలె పనిచేస్తూవుండిన డా॥ మహమ్మదు హట్టా ఇండోనీసియన్ రిపబ్లిక్ ప్రభుత్వానికి ఉపాధ్యక్షుడుగా నియుక్తుడైనాడు. పరిపాలనలో వివిధ శాఖలను నిర్వహించడానికిగాను పదిహేడుగురుగల ఒక మంత్రివర్గం వెంటనే నియమింపబడింది. ఇండోనీసియా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, అద్వితీయమగు త్యాగాలనుచేసిన ప్రముఖులు ఆమంత్రిమండలిలో వివిధశాఖలనుస్వీకరించారు. డా॥సోబార్జో విదేశాంగశాఖను, డా॥ అమీర్ షరీఫుద్దీన్ ప్రచారకశాఖను, హజర్ దేవన్తారా విద్యాశాఖను, డా॥ప్రింగోడిగోగృహశాఖకుఆధ్వర్యం వహించారు. హాజీఆగోస్ సాలిమ్ డా॥ సోబార్జోకు సలహాదారుగా నియోగింపబడినాడు. ప్రధానశాఖలను వివిధవర్గాల ప్రధాన నాయకులు స్వీకరించడంవలన ఇండోనీసియాలోని వివిధ పక్షాభిమానులందరికి డా॥ సోకర్నో ప్రభుత్వంపై విశ్వాసం కలిగింది.

జోకార్తా (బటేవియా) నగరంలో ఈ రిపబ్లిక్ ప్రభుత్వ కేంద్రపీఠం నెలకొల్పబడింది. జాతీయసైన్యాలు త్వరత్వరగా దేశమంతా అలుముకొనిపోయి, వివిధ ప్రదేశాలలోవున్న ప్రభుత్వ కార్యాలయాలన్నిటిని స్వాధీనం చేసుకొన్నాయి. పరదేశజులచే నిర్వహింపబడుతూవుండిన వివిధ పారిశ్రామిక కేంద్రాలనన్నిటిని జాతీయ ప్రభుత్వబలగాలు ఆక్రమించుకొని వాటిని జాతీయప్రభుత్వపరం చేసివేశాయి.

'శాంతి సంరక్షకదళం' అనుపేర ఒక సాయుధజాతీయ పోలీసుదళం నిర్మింపబడింది. వివిధదీవుల సన్నిటియందు శాంతిని నెలకొల్పుతూ భద్రతను చేకూర్చడమే ఈ దళం విద్యుక్తధర్మంగా నిర్ధరింపబడింది. ఇండోనీసియన్ జాతీయసైన్యం వివిధరంగాలలోని జపాన్ సైనికదళాలను ఎదిరించి వారిని నిరాయుధులనుచేసి, చేజి గొంటూ ఆయుధసామగ్రిని ప్రభుత్వవశం చేయదొడగినది.

'ఇండోనీసియన్ రిపబ్లిక్' సాధింపబడిన వెంటనే ఇండో నీసియా అంతటా బ్రహ్మాండమైన ఉత్సాహం పొంగులువారింది. సర్వపక్షాలవారు ప్రభుత్వంతో సహకరించగలమని సంభ్రమోత్సా హాలతో ప్రకటించారు. ఇదివరలో డచ్చిప్రభుత్వంక్రింద పనిచేసిన 'సివిల్' అధికారులందరూ నూతన ప్రభుత్వంపట్ల తమ విశ్వాసాన్ని ప్రకటిస్తూ సేవ చేయగలమని ప్రమాణాలుచేశారు. తుదకు డచ్చి ప్రజలుకూడా నూతన ప్రభుత్వానికి తమవిధేయతలను ప్రకటిం చారు. డచ్చివారిచే తొలగింపబడిన ఇండోనీసియన్ సైన్యం అంత వరకు జపాన్‌వారిచే చెరగొనబడివుండి, తదుపరి విముక్తమగనంగి రిపబ్లిక్ ప్రభుత్వానికి సేవచేయగలమని ప్రకటించింది. దేశంలోని వివిధ పారిశ్రామిక వేత్తలందరూ తమతమ పరిశ్రమలనన్నిటిని ప్రభుత్వ ప్రయోజనాలకొరకు అర్పించెదమని తెలియజేశారు. ఇట్లు ఇండోనీసియా నలుమూలలనుండి నూతన జాతీయప్రభుత్వానికి ప్రజాసహకారం తనంతటతానే వచ్చి ఆవరించింది.

అమెరికా సంయుక్తరాష్ట్రీముల ప్రభుత్వ విధానాన్ని పోలిన రిపబ్లిక్ రాజ్యాంగమొకటి ఇండోనీసియాభవిష్యద్రాంజ్యాం గంగా తయారుచేయబడింది. ఆప్రజారాజ్యాంగ స్వరూపం ఇది.

1. ఇండోనీసియా ఒకరిపబ్లిక్-లేక-ఫెడరేషన్

2. ప్రజాప్రతినిధులతో ఏర్పడినవారి అభిప్రాయాను గుణముగా నెలకొన్న 'మజిలీస్ పరమూస్ జావారతన్ రజత్'-వారు ఇండో నేసియాపై సర్వాధికారాలను కలిగివుంటారు. (దీనికే యం. పి. ఆర్ సుప్రీమ్ కౌన్సిల్ అని నామాంతరం)

3. ప్రజలు: ఇండోనీసియాలో ఆదినుండి పుట్టి పెరిగిన జాతుల వారు; న్యాయశాస్త్రరీత్యా ఇండోనీసియనులని ఆమోదింపబడిన ఇతర జాతులవారు. వీరికిమాత్రమే ఎన్నికలలో వోటింగుహక్కు వుంటుంది.

4. ప్రజలందరకు సమానమైన రాజకీయహక్కులు ఒసంగబడుతవి. వారు ప్రభుత్వం యెడల విశ్వాసం కలిగివుండాలి.

5. ప్రతివారు మానవకల్పితమైన ఏదోఒక వృత్తిచేసుకొనుటకు హక్కులు కలిగి వుంటారు.

6. వాక్సభా, భావస్వాతంత్ర్యాలు, పత్రికా స్వాతంత్ర్యము న్యాయశాస్త్ర సమ్మతమైనంతవరకు ఆమోదింపబడతాయి.

7. ప్రజాసేవయే పరమాత్మునిసేవ అను పరమాశయాన్ని లక్ష్యంగా కలిగిన విధానాలననుసరించి ప్రభుత్వ పరిపాలనా విధులు సృష్టించబడుతవి.

8. ఎవరికి ఇష్టమైన మతాన్ని వారు స్వీకరించడానికి సర్వహక్కులను ప్రభుత్వం కలుగజేస్తుంది.

9. ప్రతిపౌరుడు విద్యనార్జించు హక్కు కలిగివుంటాడు.

10. విద్యావిధానాలు శాసనరీత్యా నిర్మింపబడుతాయి.

11. ఇండోనీసియన్ జాతీయవిజ్ఞాన సంస్కృతులను పెంపొందించడానికి ప్రభుత్వం కృషిచేస్తుంది.

12. ఆర్థికవృత్తమంతా ప్రజలపరమై వుంటుంది. పరస్పర సహకారబద్ధమైన ఆర్థిక విధానమే అనుసరించబడుతుంది.

13. ప్రజావసరములగు ప్రధానపరిశ్రమలన్నీ జాతీయమొనర్పబడి ప్రభుత్వంచే నిర్వహింపబడతాయి.

14. భూమి, నీరు, ప్రకృతిసౌభాగ్యాలు ప్రభుత్వానికి చెందినవై వుంటాయి. ప్రజాప్రయోజనం కొరకు ప్రభుత్వమే వాటిని వినియోగిస్తుంది.

15. పేదపిల్లల్ని దిక్కులేని బిడ్డల్ని ప్రభుత్వం తీసుకొని పెంచుతుంది.

16. ఇండోనీసియా జాతీయపతాకం ఎరుపు, తెలుపు రంగులను కలిగివుంటుంది.

17. ప్రధానభాష ఇండోనేసియన్ భాష. 'ఇండోనేసియా-రాజ' అనునది జాతీయగీతం.

సూక్ష్మంగా ఇట్టి బృహదాశయాలను ఆధారశిలలుగా పెట్టుకొని సోకర్నో ప్రభృతులు ఇండోనేసియా ప్రజారాజ్యాంగాన్ని రచించారు. దానిని అమలుజరిపి ప్రజల ప్రేమాభిమానాలను సర్వ విధాలా ఆచికొన్నారు.

దేవునిలోవిశ్వాసము, జాతీయత, విశ్వసమానత్వము, ప్రజాస్వాతంత్ర్యాభిలాష, సాంఘికఔన్నత్యము - మొదలైన విశాల భావాలను ప్రజలలో పెంపొందించు విధానాలను ప్రవేశపెట్టాలనే ఈనూతన రాజ్యాంగపు ఉద్దేశ్యమైవుంది. ముఖ్యంగా గ్రామసీమలలో అనాదినుండి వస్తూవుండిన స్వయంపోష్య సిద్ధాంతాలు పునరుద్ధరింపబడినవి. ప్రతిఒక్క గ్రామము రిపబ్లిక్ వలె నిర్మాణమైనది.

రిపబ్లిక్ స్థాపన అయినవెంటనే జాతీయసమావేశం ఒకటి జరుపబడింది. ఆసమావేశానికి 150 మంది ప్రతినిధులు ఇండోనేసియా నలుమూలలనుండి అరుదెంచారు. 1945 అక్టోబరు 15, 16 తేదీలలో తిరిగి 'జాకార్తా' నగరంలో జాతీయవాదుల మహాసమావేశం బ్రహ్మాండంగాజరిగింది. వేలకొలదిఇండోనేసియనులు ఆసమావేశంలో పాల్గొని జాతీయజీవన సూత్రాన్ని అనుష్ఠించారు. మూడు పందల సంవత్సరాలుగా కలలుగంటూవున్న ఆస్వాతంత్ర్యం నేటికి స్థాపించుకొనగల్గినందుకు ప్రజాహృదయం ఆనందడోలికల్లో ఊగులాడిపోయింది.

ఆసమావేశంలో వివిధ ప్రతినిధుల సలహాలపై ఒకజాతీయ కేంద్రప్రభుత్వ సంఘంస్థాపించబడింది. ఇండోనేసియన్ ప్రజల స్వాతంత్ర్య, శాంతి, భద్రతల రక్షణనిమిత్తమై అప్రమత్తులై వుంటూ, ఎప్పుడేచర్యలను తీసుకొనడానికైనా, ఆసంఘానికి సర్వహక్కులు దత్తంచేయబడినవి.

ఇండోనేసియా జాతీయప్రభుత్వం ఆశయాలను వివరిస్తూ అధ్యక్షుడు డా॥ సోకర్నో ప్రపంచరాజ్యాలకు వెంటనే ఒకప్రక

టన చేశాడు. ప్రపంచప్రజారాజ్యాలన్నిటితోను ఇండొనీసియా స్నేహపూర్వకమైన సంబంధాలను నెరపుతుంది. మిత్రరాజ్యాలు పూనుకొన బోతూవున్న శాంతిస్థాపనా యత్నాలకు ఇండొనీసియా హృదయపూర్వకంగా సహకరిస్తుంది. ఇండొనీసియాలోని జపాన్ సైన్యాలను నిరాయుధుల చేయడానికి వస్తూవున్న మిత్రసైన్యాలకు ఇండొనీసియా సహాయపడుతుంది. జపాన్ చెరబట్టిన మిత్రదేశాల ప్రజలను విడుదలచేసి, వారివారిదేశాలకు వారినిపంపించివేయ డంలో ఇండొనీసియా తోడ్పడుతుంది. ప్రపంచశాంతిసభలో, తన కున్న సభ్యత్వాన్ని ఆర్జించి, భద్రప్రపంచ నిర్మాణంలో ఇండొనీ సియా తనపాత్రనుకూడా నిర్వహిస్తుంది. ఇందుకోసం, మిత్రసై న్యాలు, ఇండొనీసియాలో తమ కార్యక్రమాన్ని త్వరగాముగించు కొని ఇండొనీసియాను వదలివెళ్లిపోతాయని ఇండొనీసియన్ ప్రభుత్వం విశ్వసిస్తూవుంది...

ఈ విశాలసందేశం ప్రపంచమంతటా ప్రతిధ్వనులనీనింది... కాని - మిత్రరాజ్యాలనుండి ప్రోత్సాహకరమైన ప్రతిసందేశాలు మాత్రం వెలువడి వుండలేదు....!

1945 అక్టోబరు మాసంలో జాతీయమహాసమావేశం జరిగిన తరువాత కొత్తనిర్ణయాలప్రకారం డా॥ సుల్తాన్ షకీర్ ప్రధాన మంత్రిగా నూతనమంత్రివర్గం ఏర్పడవలసివుంది. కాగా అధ్యక్షుడు సోకర్నో మొదలననుసరించి డా॥ షకీర్ మంత్రివర్గనిర్మాణానికి పూనుకున్నాడు. దేశంలోని యువకవర్గాలన్నిటికి ప్రభుత్వంలో సముచితమైన స్థానమీయ వలెననే సంకల్పంతో డా॥ సోకర్నోను అధ్యక్షుడుగాను, డా॥ హట్టాను ఉపాధ్యక్షుడుగాను వుంచి, డా॥ షకీర్ పదిమందితోకూడిన నూతనమంత్రిమండలిని నిర్మించాడు. ప్రజావాంఛననుసరించి డా॥ సోకర్నో ఈనూతనమంత్రిమండలికి సర్వాధికారాలను అర్పించాడు.

ముప్ఫయిఆరు సంవత్సరాల వయస్సుగలయువకుడైనప్పటి కిని డా॥ షకీర్ ఇండొనీసియన్ యువజనులలో విశేషమైన పలుకుబడిని ఆర్జించివున్నాడు. స్వతః మితవాది అయినా సామ్య

వాద భావాలను ప్రచారంచేస్తూ వుంటాడు. డచ్చివిద్యావిధానంలో ఉన్నతవిద్యల నార్జించి, విద్యాసంఘానికి అధ్యక్షుడుగా పనిచేసి అతడు మంచి అనుభవాన్ని గడించివున్నాడు.

వివిధదేశ సంచారంచేసి, పండిత జవహరిలాల్ నెహ్రూతో మైత్రిని ఆర్జించిన, డా॥ హట్టాను అనుచరుడుగా డా॥ షకీర్ చిరకాలం పనిచేశాడు. అందువలన వైదేశిక రాజ్యాంగాలలో అతడు పరిణతమైన ప్రజ్ఞను సంపాదించాడు. అట్టిషకీర్ నాయకత్వంలో ఈ నూతనమంత్రివర్గం, ప్రగతిబాటలనుబట్టి ఇండోనీసియనులలో నవ్యభావ విలసత్వాన్ని పెంపొందిస్తూ, స్వాతంత్ర్యాన్ని స్థిరస్థాయి చేసుకుంటూ నడకసాగించ నారంభించింది.

ఇండోనీసియా జాతీయ ప్రజా ప్రభుత్వాన్నిచూచి, ఇండోనీసియాకు బద్ధవిరోధులగువారే హర్షించక తప్పినది కాదు.

"ధీవిశేష సంపన్నులు, విశాలాశయ ప్రపూరితులు, స్వాతంత్ర్యజోదులు అగు వారిచేతిలోనే ఇండోనీసియా జాతీయప్రభుత్వ మున్నది నేడు ... ఇది యదార్థంగా నేను చెబుతూవున్న మాట..." అన్నాడు డచ్చి లెఫ్టినెంట్ గవర్నరు జనరల్ డా॥ వాన్‌మూక్.

"ఔను అతనిని (డా॥ సోకర్నో) అతని మంత్రిమండలిని మేము గౌరవించవలసినదే వారిలో చాలామంది శక్తివంతులు, నిజాయితీ గలవారూను" అన్నాడు. డచ్చి వలసదేశాలమంత్రి డా॥ జోహాన్ లాగ్‌మన్.

డచ్చివారు మాత్రమేకాదు; ప్రపంచ ప్రజారాజ్యాభిమానులందరూ ఇండోనీసియన్ జాతీయప్రభుత్వాన్ని హర్షిస్తూ పెక్కుప్రకటనలు చేసివున్నారు.

డా॥ సోకర్నో అధ్యక్ష్యాన సుమారు రెండుమాసముల వ్యవధిలో నూతనరాజ్యాంగం దేశమంతటా అమలు పరుపబడింది; నూతన ప్రజాజీవనం ఆరంభమైంది. కాని ఆ ప్రజా ప్రభుత్వానికి తిరిగి సామ్రాజ్యవాదుల దృష్టిదోషం తగిలింది. మళ్లీ మహాసంగ్రామం అచిర కాలంలోనే ప్రపంచ ప్రజాదృష్టిని ఆకర్షించింది.

# ఇండోనీసియా స్వాతంత్ర్య సమరం

ఇండోనీసియా స్వాతంత్ర్యాన్ని స్థాపించుకున్నది.

కాని, ఇండోనీసియా జాతీయనాయకులకు స్వాతంత్ర్యాన్ని స్థాపించుకొనుట ఒకఎత్తు స్థాపించుకొనిన పిమ్మట ఆ స్వాతంత్ర్యాన్ని సంరక్షించుకొనడం ఒకఎత్తు అయిపోయింది.

ఇండోనీసియా స్వాతంత్ర్యాన్ని హరించి దానిని తిరిగి నోచుకోవలెనని డచ్చి సామ్రాజ్యవాదులు యుద్ధసమాప్తికొరకు వేచికొనివుండి, అవకాశంకోసం పొంచివున్నారు. బ్రిటిషు సామ్రాజ్యవాదులుకూడా డచ్చివారితో లాలూచీపడి, ఇండోనీసియా స్వాతంత్ర్యాన్ని హరించి, తద్వారా తమకుకూడా కొన్ని నూతన ప్రయోజనాలను ఆర్జించుకొనవలెనని ప్రయత్నించ సాగారు. సామ్రాజ్య దుర్మతుల దురూహాలకు చక్కని అవకాశాలే లభించాయి...!

జపాన్ శరణాగతి అనిన వెంటనే ప్రాచ్యఖండంలోని మిత్రరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు జనరల్ మాక్ ఆర్థర్‌కు, జపాన్ ప్రభుత్వాధికారులకు నడుమజరిగిన ఒడంబడిక ననుసరించి, ఇండోనీసియాలోని జపాన్ సైన్యాలను నిరాయుధులచేసి,వారిని స్వదేశానికి పంపివేయడము, ఇండోనీసియాలో జపాన్ ఖైదుచేయబడిన డచ్చి పౌరులను విడిపించి, యుద్ధఖైదీలను వారివారి దేశాలకు పంపడము మొదలైన కార్యకలాపమంతా బ్రిటన్ నిర్వహించవలసివున్నది.

ఇందుకు అనుగుణంగా ఆగ్నేయ ఆసియాకమాండ్ సర్వసేనాని లార్డు లూయీ మౌంట్‌బాటన్, సర్‌ఫిలిప్ క్రిస్టిసన్‌ను కొంతసైన్యమిచ్చి ఇండోనీసియాకు పంపించాడు. క్రిస్టిసన్‌రాకను ఎరిగి ఇండోనీసియన్ రిపబ్లిక్ ప్రభుత్వం 'మిత్రరాజ్యాల కార్యకలాపానికి సర్వసహాకారమూ నీయడానికి సిద్ధంగావున్నట్లు ప్రకటించింది. వెంటనే 1945 సెప్టెంబరు 29 వ తేదీని బ్రిటిష్‌సైన్యాలు ఇండోనీసియాలోని 'టాంజోంగ్-పెరియాక్' అను రేవుపట్టణం

వద్ద కాలూనినవి. ఇండోనీసియన్ రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ సోకర్నో 'బ్రిటిషు సైన్యాలకు సహాయపడవలసినదని' తన ప్రజలకు హెచ్చరికలు చేశాడు. ఫలితంగా ప్రజలు బ్రిటిష్ సైన్యాలకు మిక్కిలిగా తోడ్పడినారు. బ్రిటిష్ నౌకలనుండి సామానులను దించడానికి ఇండోనీసియన్ శ్రామికులు విరివిగావచ్చి, ఎట్టి ప్రతిఫలాన్ని తీసికోనకుండానే తమపనిని నిర్వర్తించారు. అటు 'సురబాయా' రేవుపట్టణం వద్ద దిగిన బ్రిటిష్ ఆక్రమణ సైన్యాలకుకూడా ఇండోనీసియనులు ఆహ్వానమందించి, సహకారమిచ్చారు.

'టాంజోంగ్-పెరియోర్' లో దిగిన వెంటనే బ్రిటిషు సేనాని సర్ క్రిస్టిసన్ ఒక ప్రకటనచేస్తూ 'తనకు దేశీయ రాజకీయాలతో ఎట్టిసంబంధమూ లేదని, మిత్రరాజ్యాల కార్యక్రమాన్ని నిర్వహించుకొని తాను తరలిపోతానని, తనతోపాటు ఇండొనీసియాలో వచ్చి సైన్యాలను దించనని, దేశీయ రాజకీయాలలో బ్రిటిషు సైన్యాలుగాని, భారతీయ సైన్యాలుగాని ఎట్టి జోక్యాన్ని కలిగించుకోనవని' ఇండోనీసియన్ రిపబ్లిక్ ప్రభుత్వానికి తెలియచేశాడు. అదే సమయంలో అటు లండన్‌లో ఒక ప్రకటనచేస్తూ బ్రిటిషుయుద్ధశాఖా కార్యదర్శి జాక్‌లాసన్ "...బ్రిటన్‌కు తనమిత్రరాజ్యాలతో వున్న సంబంధ బాంధవ్యాలనుబట్టి ఇండోచైనాలో ప్రవేశించినవారికోసము, ఇండొనీసియాలో వచ్చినవారికోసము బ్రిటన్ ఎట్టియుద్ధాలను చేయవలసిన అవసరం ఏమీలేదు." అని— బ్రిటన్ ఉద్దేశ్యాలను వివరించినాడు.

—ఈ రెండు ప్రకటనలను చూచి, ఇండొనీసియన్ జాతీయ నాయకులు బ్రిటిషు సైన్యాలకు ఇండొనీసియాలో సర్వవిధముల సహకరించ నారంభించారు. కాని, అచిరకాలంలోనే బ్రిటిషు సైన్యాలధోరణి నిజమైన రూపంలో ప్రత్యక్షం కానారంభించింది. "శాంతి భద్రతల సంరక్షణ" అనుపేరిట బ్రిటిషు సైన్యాలు "వచ్చి ప్రభుత్వం తన అధికారాలను తిరిగి స్వీకరించువరకు ఇండోనీసియాపై అధికారాన్ని వహించవలసి వుంటుంది..." అంటూ ప్రభుత్వ కార్యాలయాలను ఆక్రమించ నారంభించాయి.

ఇంతలో—ఆస్ట్రేలియాలో తలదాచుకుంటూవుండిన 'డచ్చి ఇండోనీసియా ప్రభుత్వాధికారి' లెఫ్టినెంట్ గవర్నర్ జనరల్ వాన్‌మూక్ కూడా ఇండోనీసియాలో సబల, సాధికారాలతో దిగినాడు. ఈ లోపుగా బ్రిటిషు సైన్యాలు ఇండోనీసియాలో డచ్చి ప్రభుత్వాధికార స్థాపనకు సర్వమూ సమాయత్తపరచి వున్నవి. వాన్‌మూక్ తన ప్రభుత్వాధికారాన్ని, బ్రిటిషు సైన్యాల రక్షణతో, పునః స్థాపించాడు.

బ్రిటిషు, డచ్చి సైన్యాధికారుల నడవడిని గమనించి ఇండోనీసియన్ రిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ సోకర్నో 'తన ప్రజల స్వాతంత్ర్యాన్ని గుర్తిస్తూ డచ్చి పభుత్వం వెంటనే ఒక ప్రకటన చేయవలెనని' వారిని కోరినాడు. కాని ఇందుకు డచ్చి ప్రభుత్వాధికారులు అంగీకరించలేదు. అంతేకాదు; డా॥ సోకర్నో 'క్విస్లింగ్' అనిఅతని ప్రభుత్వం అంటూ చెప్పబడుతూవున్నది దోపిడీగాళ్ళ తంతు అని, అట్టివానితో తాము ఎట్టిప్రమేయము పెట్టుకోనమని, డచ్చి అధికారులు ప్రకటించారు.

ఈ ప్రకటనపై ఇండోనీసియనులలో అసంతృప్తి పైకొన్నది. వెంటనే ఇరువర్గములమధ్య భీషణసంగ్రామం చెలరేగింది. యుద్ధ సమాప్తమైనదనుకొన్న ప్రపంచం తిరిగి ఇండోనీసియాలో యుద్ధం ప్రజ్వలించడాన్నిచూచి నివ్వెరపోయింది. ప్రపంచప్రజా స్వాతంత్ర్యాన్ని గౌరవించడమే తమ విద్యుక్తధర్మమని 'ఐక్యరాజ్యాలపరిషత్తు' ద్వారా ఉద్ఘాటించిన బ్రిటన్, ఇండోనీసియాలో ప్రజా స్వాతంత్ర్యాన్ని హరించడానికిగాను యుద్ధంచేస్తూవుండడాన్నిచూచి విస్మయమందినది. బ్రిటిషు, డచ్చిసామ్రాజ్యవాదుల కరాళదంష్ట్రలలో పడి నలిగిపోబోతూవున్న ఇండోనీసియన్ స్వతంత్ర్య ప్రభుత్వంపై సానుభూతి చూపుతూ, దానిని హృదయపూర్వకంగా ఆశీర్వదించింది...

పరిస్థితులు విషమిస్తూవుండడం కనిపెట్టి బ్రిటిషుసేనాని సర్-క్రిస్టిసన్ వెంటనే శాంతిని నెలకొల్పుమిషతో ఇండోనీసియన్

జాతీయనాయకులు, డచ్చిప్రభుత్వాధికారులు కలిసి సంప్రదించవలె నని ఒక సమావేశాన్ని ఏర్పరచారు. కాని డచ్చిఅధికారులు ఇండోనేసియన్ జాతీయనాయకులతో సరిగాసంప్రదించనొల్లక పోవడం వల్ల ఆ సమావేశం నిష్ఫలమైపోయింది. ఇండోనేసియన్ జాతీయ నాయకుల కోర్కెలను త్రోసిపుచ్చడమేగాక డచ్చిప్రభుత్వాధికారులు "1942 లో విల్‌హెల్మినారాణి చేసిన ప్రకటనప్రకారం జరుగవలసినదేగాని, అంతకుపైన దేనినీ ఆమోదించవీలులేద" ని ప్రకటించారు. యుద్ధాత్పూర్వం వుండిన డచ్చిప్రభుత్వాధికారులు తిరిగి యథాతథంగా ఏర్పడి, పిమ్మట ఇండోనేసియన్ రాజకీయాభ్యున్నతికి వీలగు చర్చలను తీసికొనవలసినదేనని వారు పట్టు పట్టారు.

సమాధానం కుదరకపోవడంవల్ల ఇండోనేసియన్ జాతీయ సైన్యాలు డచ్చిసైన్యాలపైతిరుగబడినవి. బ్రిటిషుసైన్యాలు డచ్చివారి రక్షణకొరకని ఇండోనేసియన్ ప్రజలపై ముమ్మరంగా బాంబులను వర్షింపనారంభించాయి. జావా నలుమూలలా సంక్షోభం పరిమితి మీరిపోయింది.

జావాలో బ్రిటిష్, డచ్చిఅధికారులు ప్రవేశించడంతోడనే 1946 జనవరి 5 వ తేదీని డా॥ సోకర్నో, తన అధ్యక్షపీఠాన్ని ప్రభుత్వకార్యాలయాన్ని బటేవియా నగరంనుండి మధ్యజావాలోని 'జోగ్గాకార్తా' నగరానికి మార్చివేశాడు. జోగ్గాకార్తానగరం ఇండోనేసియా జాతీయ చరిత్రలో ఒక మహోన్నతమైన విజ్ఞాన పీఠమై విలసిల్లివుంది. నేటివరకూ అదే ఇండోనేసియన్ రిపబ్లిక్ కేంద్రమైవుంది. కాని ఇండోనేసియా ప్రధానమంత్రి, తదితర మంత్రులుమాత్రం బటేవియాలోనే తమకార్యస్థానాన్ని వుంచుకొన్నారు. డచ్చిఅధికారులతో రాయబారాలను జరపడానికే ఈ ఏర్పాట్లుజరిగినవి.

బ్రిటిషు, డచ్చి సామ్రాజ్యవాదులిరువురు ఉమ్మడిగా ఇండోనేసియన్ స్వాతంత్ర్య ప్రభుత్వంపై జరుపుతూవున్న అత్యాచారా

లను ప్రపంచ ప్రజాహృదయమనే న్యాయపీఠం ముంగిట వుంచవలె ననే ఉద్దేశ్యంతో డా॥ సోకర్నో 'ఇండోనీసియన్ రిపబ్లిక్ రేడియో' ద్వారా మిత్రరాజ్యాలకు ఒక విజ్ఞప్తిచేశాడు. భారత జాతీయ కాంగ్రెసుకు ప్రత్యేకంగా విజ్ఞప్తిచేస్తూ సామ్రాజ్యవాదుల దుండగాలను ఎరుక పరిచాడు. పండిత జవహరిలాలు నెహ్రూ, మాదాంఛియాంగ్-కె-షేక్, మేజర్ జనరల్ కార్లోస్ రోములు, డా॥ హేర్బర్టుఇవాట్ ప్రభృతులను ఇండోనీసియాకువచ్చి, పరిస్థి తులను కండ్లారా వీక్షించి తీర్పుచెప్పమని, ఆహ్వానించాడు.

డా॥ సోకర్నో చేసిన విజ్ఞప్తి ప్రపంచమంతటా ప్రతిధ్వనించింది. కాని ప్రపంచ అగ్రరాజ్యాధినేతలు కిమ్మనలేదు.

అయితే డా॥ సోకర్నో వినతికి సద్యోఫలితాలుకూడా మరి కొన్ని తావులందు లభింపకపోలేదు. ఆస్ట్రేలియా నౌకాశ్రయాల నుండి ఇండోనీసియాకు బయలుదేరబోతూవున్న డచ్చి ఓడలలోనికి సామానును ఎగుమతిచేయమని, ఇండోనీసియా స్వాతంత్ర్యాన్ని హరిస్తూవున్న సైన్యాలకు ఆహారపదార్థాలను మోసుకొని పోతూ వున్న ఆ నౌకలలో తాముపనిచేయమని ఆస్ట్రేలియా ఓడకార్మికులు తమ అసమ్మతి తెలుపుతూ సమ్మెచేశారు. ఇట్లే వివిధ దేశాలలోని ఇండోనీసియన్ ఓడకార్మికులు తమ తీవ్ర ప్రతికూల భావాలను తెలియజేశారు.

పండిత జవహరిలాల్ నెహ్రూతో తనకున్న పూర్వమైత్రిని పురస్కరించుకొని ఇండోనీసియన్ ప్రభుత్వోపాధ్యక్షుడు డా॥ హట్టా, తిరిగి పండిత నెహ్రూకు విజ్ఞప్తిచేస్తూ "ఇండోనీసియాకు ఒకసారి రమ్మనమనికోరాడు; అతనిరాక ప్రపంచానికే ఒకమహత్తరమైన సేవకాగలదని, విన్నవించాడు. హట్టా ఆహ్వానాన్ని సంతోషపూర్వకంగా స్వీకరిస్తూ నెహ్రూపండితుడు మన ఇరువురి స్వాతంత్ర్యము ఒకవిధంగానే అగ్నిపరీక్షకులోనైవున్నది' అని ప్రత్యుత్తరమిచ్చాడు. ఇండోనీసియాకు పయనమైవెళ్ల నుత్సహించినాడు గాని, పండిత నెహ్రూకు బ్రిటిషుప్రభుత్వం 'పాస్‌పోర్టు' నిచ్చి, ప్రయాణ సౌకర్యాలను ఏర్పాటుచేయ నిరాకరించింది.

ప్రపంచప్రజా స్వాతంత్ర్యాభిమానులగు భారతీయులలో ఈ పైచర్యలు మిక్కిలి అసంతృప్తిని రేకెత్తించినవి. శతాబ్దులుగా పారతంత్ర్యములో క్రుగ్గి, అనేకత్యాగాలకృతంగా ఇండొనీసియనులు నిర్మించుకొన్న స్వాతంత్ర్యాన్ని హరించడానికి సామ్రాజ్య వాదులం చేస్తూవున్న ద్రోహపుయుద్ధాలలో భారతీయ సైనికులు ఉపకరణాలుగా వినియోగపడుతూవుండడాన్ని భారతప్రజలు చూస్తూ సహించలేకపోయారు. వెంటనేవారు ఇండొనీసియానుండి తమ సైన్యాలు ఉపసంహరింపబడవలెనను ఆందోళన నారంభించారు. ఆ ఆందోళన ఫలితంగా బయలుదేరిన విమర్శలకు జవాబిస్తూ బ్రిటిషు ప్రధాని క్లెమెంట్ అట్లీ "డచ్చి ప్రభుత్వంయెడల తమకు వున్న ధర్మాన్ని నిర్వర్తించడానికే బ్రిటిషు భారతీయ సైన్యాలు ఇండొనీసియాలోవున్నవని, ఇండోనీసియాలో డచ్ ప్రభుత్వం తిరిగి స్థాపింపబడు నంతవరకు అచటవున్న డచ్చిపౌరుల రక్షణభాధ్యతను బ్రిటన్ నిర్వహించవలసివున్నదని" ప్రకటించాడు. అట్లీ ప్రధాని చేసిన ప్రకటనవలన ఇండోనీసియాలోని పరిస్థితులు ఇంకా విషమ రూపాన్ని దాల్చినవి.

జపాన్ సైన్యాలను నిరాయుధులను చేయడానికేవచ్చి, ఇండోనీసియన్ రాజకీయాలలో చేయిచేసుకొనమని హామీనిచ్చి బ్రిటిషు ప్రభుత్వం, అడినమాట తప్పినందులకు ఇండోనీసియన్ స్వాతంత్ర్యవాదులు ఉగ్రులైనారు. ఇండోనీసియాలో అస్తమించిన డచ్చి సామ్రాజ్యప్రభుత్వానికి పునర్జన్మను కలిగించడానికే బ్రిటిషు సైన్యాలు ఇండోనీసియాకు వచ్చినవని తెలియగానే ఇండోనీసియనులు తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకొనడానికి గాను సంసిద్ధులైనారు.

ఇండోనేసియన్ జాతీయసైన్యానికి, బ్రిటిషు భారతీయసైన్యాలకు మధ్య హోరాహోరియుద్ధం ప్రారంభమైనది. బ్రిటిషు మిలటరీ ఉద్యోగిఅయిన బ్రిగేడియర్ మల్లబీని ఇండొనీసియనులు చంపివేశారు. ఇందుకు కినుకవహించి, బ్రిటిషుసైన్యాలు ఇండోనీసియనులపై ఉవ్వెత్తున విజృంభించినవి. విమానాలద్వారా ఇండొనీసి

యన్ జనపదాలపై బాంబులు వర్షించినవి. యుద్ధనౌకలద్వారా తీరపట్టణాలన్నీ దగ్ధపటలం చేయసాగినవి. బ్రిటిషు టాంకుదళాలు దేశంలో అడ్డబడి చేయరాని మారణహోమాన్ని చేసినవి. బ్రిటిషు సైన్యాలు పెద్దతరహా యుద్ధానికి దిగిన అదనుచూసుకొని ఇండోనేసియన్ సేనాని, 'ఓరోసోమె హార్జో' అంత్యసమరం సాగించడానికే సన్నద్ధమైనాడు. చరచర ఇండోనేసియన్ గెరిల్లా దళాలు సమీకరించ బడినవి. ఇరుకక్షుల మధ్య అవిరామమైన సమరంసాగనారంభించినది.

ఇటు యుద్ధంకొనగుతూవున్నట్లే అటు దేశంలో పాశ్చాత్యులపై ఇండోనేసియనులు 'సాంఘిక బహిష్కరణాస్త్రాన్ని' ప్రయోగించారు. తెల్లవారికి ఆహారపదార్థాలను అమ్మడానికి ఇండోనేసియన్ ప్రజలునిరాకరించడంతో పాశ్చాత్యులు పస్తులకు గురియైనారు. అంతటవారు బ్రిటన్‌కు మొరబెట్టుకొనడంతో వెంటనే బ్రిటన్‌నుండి 50,000 సైన్యము, ఆయుధసామాగ్రి, విమానాలు, టాంకులు, మొదలైనవాటిని హుటాహుటిగా బ్రిటిషుప్రభుత్వం ఇండోనేసియాకు పరుగెత్తించింది.

బ్రిటిషుసైన్యాలకు అదనపు ఆయుధబలాలువచ్చి చేరుకుంటూ వుండటంతో ఇండోనేసియన్ స్వాతంత్ర్యకాంక్షులకు సామ్రాజ్యవాదుల పన్నాగాలయెడ ఆగ్రహం ద్విగుణీకృతమైనది. బ్రిటిషుసైన్యాలను ఎదిర్చి, ఇండోనేసియన్ గెరిల్లాదళాలు, తమ స్వాతంత్ర్యాన్ని రక్షించుకొన నుద్యమించాయి.

దీనిపై కినుకజెంది బ్రిటిషుసైన్యాలు ఇండోనేసియన్ గ్రామాలపై దాడులుజరపనారంభించాయి. ఆదాడులఫలితంగాగ్రామాలకు గ్రామాలేనాశనమైపోయాయి. సస్యశ్యామలభరితములైన పొలాలు భస్మీపటలమైపోయాయి.

'బెకస్సీ' అనేగ్రామంపైబడి బ్రిటిషుసైన్యాలుచేసిన ఘోరదురంతాలను సభ్యతగల ఏమానవుడున్నూ వర్ణించలేడు. ముందుగా ఆగ్రామాన్ని బ్రిటిషుసైన్యాలు చుట్టుముట్టి ఇంటింటికి కిరసనాయిలు

పోసి తగులబెట్టాయి. ప్రాణరక్షణార్థమై పారిపోతూవున్న అమాయకులైనప్రజలను, స్త్రీలను, పిల్లలనుకూడా విచక్షణలేకుండా బాంబులతో కాల్చివేశాయి.

ఇట్లుసుమారు రెండుమాసములపాటు అవిరామసమరంచేసి బ్రిటిషుసైన్యాలు, బటేవియా, టాంగరాన్, బాన్‌డాన్‌గు నగరాలను ఆక్రమించి, అచట డచ్చిఅధికారులకు ఆశ్రయంకల్పించాయి. జపాన్ సైన్యాలను నిరాయుధులను చేయడానికైవచ్చిన బ్రిటిషు సైన్యాలు, ఆపనినిమాని, జపాన్ సైనికులను తమయుద్ధంలో ఉపయోగించుకున్నాయి.

ఇండోనేసియాలో బ్రిటిషు, డచ్చి సామ్రాజ్యవాదులు జరుపుతూవున్న అమానుష చర్యలను గురించి విచారించడానికిగాను ఒక సంఘాన్ని నియమించవలెనని న్యూయార్కు-నగరంలో సమకూడిన ఐక్యరాజ్యాల పరిషత్తులో సోవియటుప్రతినిధి ఒకతీర్మానాన్ని ప్రతిపాదించాడు. కాని, సామ్రాజ్యవాదులందరూచేరి ఆ తీర్మానాన్ని వ్యతిరేకించగా, అది వీగిపోయింది. ఐక్యరాజ్యాల పరిషత్తులో ఈ తీర్మానం వీగిపోయినప్పటికిని, ప్రపంచం కన్నుగప్పడానికి సామ్రాజ్యవాదులు, వెంటనే ఇండోనేసియా సమస్యాపరిష్కారం కోసం సంప్రదింపులు జరుప యత్నిస్తున్నామని ప్రకటించి ఆ నాటకాన్నికూడా ఆరంభించారు.

బ్రిటిషుమంత్రులు, డచ్చి ప్రభుత్వ మంత్రులు లండన్‌లో సమావేశమై కొన్ని రాజీప్రతిపాదనలను తయారుచేశారు. వాటివిషయమై ఇండోనేసియన్ ప్రతినిధులతో సంప్రదించడానికిగాను బ్రిటన్ తరఫున సర్ క్లార్కు-కెర్ డచ్చిప్రభుత్వం తరఫున వాన్‌మూక్ ఇరువురు బటేవియాకు చేరుకొని 1946 ఫిబ్రవరి, 10 వ తేదీని ఇండోనేసియారిపబ్లిక్ ప్రధాని డా॥ సుల్తాన్ షహీర్‌కు ఆసూచనలను అందజేశారు. కాని, ఇండోనేసియన్ ప్రభుత్వానికి ఆ ప్రతిపాదనలేవీ సంతృప్తిని కలిగించలేదు.

అంతట లండన్‌లో మళ్లీ సమాలోచనలు ప్రారంభమైనాయి. డచ్చి ప్రధాని షెర్మర్‌హోరన్, వాన్‌మూక్‌లు ఇరువురు, బ్రిటిషు ప్రభుత్వంతో ఆలోచనలు సాగించి, మరికొన్ని క్రొత్త ప్రతిపాదనలు తయారుచేసి ఇండోనీసియా ప్రధాని డా॥ షరీర్‌కు అందజేశారు.

డచ్చి ప్రభుత్వం చేసిన ఆ సూచనల సారాంశం ఇది. "ఇండోనీసియా రిపబ్లిక్‌ను డచ్చిప్రభుత్వం నామమాత్రంగా గుర్తిస్తుంది. ఆ రిపబ్లిక్ అధికారం ఒక్కజావాకు మాత్రమే చెందివుంటుంది. ఇండోనీసియాలోని తదితర ప్రాంతాలన్నీ డచ్చి ప్రభుత్వాధికారంలోనే వుంటాయి. అసలు ఇండోనీసియా రిపబ్లిక్ కూడా డచ్చి కామన్‌వెల్తులో ఒక భాగమై వుంటుంది.

'క్విస్లింగ్' లని దూషించిన వారినే ఇండోనీసియన్ జాతీయ నాయకులుగాను, 'వారిచే కావింపబడిన ఒకకుట్ర' అని ఈసడించిన ఇండోనీసియా రిపబ్లిక్‌ను స్వతంత్ర్య ప్రభుత్వంగాను, చివరకు గుర్తించక తప్పినదిగాదు. డచ్చిసామ్రాజ్య వాదులకు అయినా, ఈ సూచనలుకూడా ఇండోనీసియన్ జాతీయనాయకులకు ఆమోదకరాలు కాలేదు. అంతట ఇండోనీసియన్ నాయకులే 1946 జూన్ 30 వ తేదీని సమావేశమై తమ కోర్కెలను తెలియపరుస్తూ కొన్ని క్రొత్త సూచనలు చేశారు.

"ఇండోనీసియా అంతకూ సంపూర్ణస్వాతంత్ర్యాన్ని డచ్చి ప్రభుత్వం గుర్తించాలి. ప్రస్తుతం జావా, మధుర, సమత్రా దీవులలో రిపబ్లికు ప్రభుత్వం సంపూర్ణాధికారాన్ని కలిగివున్నది. మిగిలిన దీవులలోకూడా యుద్ధపరిస్థితులవల్ల రిపబ్లికు అధికారం ఏర్పడజాలకపోయినప్పటికిని, వెంటనే అచటకూడా ఇండోనీసియన్ రిపబ్లికు ప్రభుత్వాధికారాన్ని నెలకొల్పాలి. ఇండోనీసియా అనగా, డచ్చి పరిపాలనలో వెనుక వుండిన ఇండోనీసియా ఐవున్నది. అందులో మినహాయింపులు పనికిరావు. దీవులను విభజించి పాలించ

పలెననే మాయోపాయాలను సామ్రాజ్యవాదులు పన్నినప్పటికిని ఇండోనీసియనులు వాటిని ఆమోదించరు. ముందు ఈ సూచనలను ఆమోదించినట్లయితే తదితర విషయాలను గురించి ఉభయులము సంప్రదించుకొనవచ్చును" అని ఒక దీర్ఘమైన ప్రకటనచేస్తూ ఇండోనీసియన్ జాతీయనాయకులు డచ్చిప్రభుత్వాధికారులకు తెలియజేశారు.

కాని ఈకోర్కెలను డచ్చిప్రభుత్వంఅంగీకరించలేదు. కాగా ఇవన్నీ విఫలమైనవి.

ఇండోనీసియాలో సామ్రాజ్యవాదులు ఆడుతూవున్న ఈ కపటనాటకాన్నిచూచి ప్రపంచమంతా గర్హించింది. ముఖ్యంగా ఇండోనీసియా స్వాతంత్ర్యాన్ని హరిండడానికి భారతసైన్యాలను ఉపయోగించరాదని భారతదేశంలో జాతీయనాయకులు తిరిగి ఆందోళనచేశారు. అందువల్ల భారతీయసైన్యాలను ఇండోనీసియా నుండి ఉపసంహరించడానికి భారతప్రభుత్వం ఆమోదించింది.

దీనికితోడు అటుహాలెండులోకూడా ప్రజాభిప్రాయం డచ్చిప్రభుత్వవిధానానికి పూర్తి అసమ్మతిని ప్రదర్శించింది. ఇండోనీసియాతో ఎట్లయినా రాజీచేసుకొనవలెనని ప్రకటిస్తూ 1946 సప్టెంబరు 24 వ తేదీని హాలెండులో బ్రహ్మాండమైన సమ్మె జరిగింది. ప్రజలు అసమ్మతి ప్రదర్శనాలు చేశారు. జావాకు పంపబడబోతూ వున్న సైనికులుకూడా ఓడనెక్కమని సమ్మెజరిపారు. ప్రభుత్వం సమ్మెదారులపైకాల్పులుజరిపింది. కాని, ప్రజాభిప్రాయాన్ని మాత్రం మార్చలేకపోయింది.

సర్వత్రా ఇట్లు వ్యతిరేక శక్తులు సామ్రాజ్యవాదుల దుష్టచర్యలపై విజృంభించడంతో డచ్చిప్రభుత్వం తిరిగి ఇండోనీసియాతో 1946 అక్టోబరు 7 వ తేదీని సంప్రదింపుల నారంభించింది. ఫలితంగా అక్టోబరు 14 వ తేదీని యుద్ధవిరమణకు ఉభయవర్గాలు అంగీకరించినవి. వెంటనే ఇండోనీసియా అంతటా యుద్ధంవిరమింపబడింది.

యుద్ధవిరమణానంతరం ఇరుదేశాలమధ్య సంధి ఒడంబడికలను రచించుకోవడానికి గాను బటేవియానగరానికి చేరువలోవున్న లింగ జాటి అను గ్రామంలో ఉభయువర్గాలవారున్నూ, 1946 నవంబరు 15 వ తేదీన సమావేశమైనారు. ఇండోనీసియన్ రిపబ్లిక్ ప్రభుత్వపక్షాన ప్రధానమంత్రి డా॥ సుల్తాన్ షరీర్ డచ్చి ప్రభుత్వపక్షాన ప్రధాన మంత్రి డా॥ షర్మన్ హోరన్ - డచ్చి గవర్నర్ జనరల్ డా॥ వాన్ మూక్ బ్రిటిష్ రాయబారి లార్డ్ హిలిరియన్‌లు ఈ సంప్రదింపులలో పాల్గొన్నారు. సుమారు పదిరోజులపాటు దీర్ఘచర్చలు జరిగిన పిమ్మట ఒక ఒడంబడికను వారు తయారు చేయగలిగినారు.

'ఇండోనీసియా సంయుక్త రాష్ట్ర సమాఖ్య' నొకదానిని నిర్మించడానికి అంగీకరిస్తూ వారు ఆఒడంబడికను సృష్టించారు ఒడంబడిక లోని ముఖ్యాంశాలు ఇవి:

1 జావా, సుమత్రా, మదుర దీవులలో పరిపాలనా భాద్యతను నిర్వహిస్తూ వున్నది ఇండోనీసియా రిపబ్లిక్ ప్రభుత్వమేనని డచ్చి ప్రభుత్వంగుర్తిస్తూవుంది. మిత్రసేనలు, డచ్చిసేనలు ప్రస్తుతం ఆక్రమించి వున్న భూభాగాలను క్రమేపీ రిపబ్లిక్ ప్రభుత్వానికి పరస్పర సహాకారం ద్వారా వప్పజెప్ప వలసి వుంటుంది. ఇండోనీసియా సంయుక్త రాష్ట్ర ప్రభుత్వం ఏర్పడులోపుగా అనగా 1949 సంవత్సరంలోపుగా యీ వప్పగింతలు, పూర్తికావలసి వుంటుంది.

2 ఇండోనీసియా సంయుక్త రాష్ట్రాలను ఫెడరల్ పద్ధతిలో స్థాపించడానికి ఇరుప్రభుత్వాలున్నూ కృషిచేయువలెను.

(3) డచ్ తూర్పు ఇండియా దీవులన్నీ ఇండోనీసియాసంయుక్తరాష్ట్రాలలో చేరగలవు. అలా సంయుక్త రాష్ట్రాలలో చేరడానికి ఏప్రాంతప్రజలకైనా ఇష్టంలేక పోయినట్లయితే ప్రజాస్వామ్య పద్ధతిలో తమ అభిమతాన్ని ప్రకటించుకోవచ్చును. తదుపరి ఇండోనీసియన్ సంయుక్త రాష్ట్ర ప్రభుత్వంతోను, డచ్చి ప్రభుత్వంతోనూ

తమ తమ సంబంధాలను గురించి వేరుగా ఏర్పాటు చేసుకోనవచ్చును.

4 ఇండోనీసియా సంయుక్తరాష్ట్రాలలో ప్రస్తుతం రిపబ్లిక్ క్రిందవున్న దీవులు, బోర్నియో, తూర్పుద్వీపసంచయము చేరగలవు. కాని ఉత్తరోత్తరా ఈ దీవులు తమ ఇష్టంవచ్చిన విధానాన్ని అనుసరించవచ్చును. తమ రాజధాని నగరం ఎచ్చట వుండవలెనో వారే నిర్ణయించుకొనవలసివుంది.

5 ప్రజాస్వామ్యపద్ధతిలో ప్రతినిధులను ఎన్నుకొని రాజ్యాంగ పరిషత్తును ఏర్పాటుచేసి, తద్వారా ఇండోనీసియా సంయుక్తరాష్ట్రాలకు తగిన రాజ్యాంగాన్ని నిర్ణయించుకొనవలసివుంటుంది. ఈ సంయుక్తరాష్ట్రాలలో మున్ముందు చేరబోయె భూభాగాల ప్రతినిధులు కూడా రాజ్యాంగ పరిషత్తులో ఏవిధంగా పాల్గొనవలసి వున్నదీ ఉభయులు సంప్రదించుకొని నిర్ణయించుకొనవలసి వుంటుంది. దీని ద్వారా, ప్రస్తుతం రిపబ్లిక్ ప్రభుత్వాధికారంక్రిందలేని ప్రాంతాల వారుకూడా సంయుక్తరాష్ట్రాలలో చేరగల అవకాశం వుంటుంది.

6. పరస్పర క్షేమం నిమిత్తం హాలెండు, డచ్చి తూర్పుఇండియా దీవులు, సూరీనామ్, కురాకావ్ భాగాలన్నిటిని చేర్చి ఒక 'యూనియన్' గా స్థాపించు విషయములో డచ్చిప్రభుత్వమూ, ఇండోనీసియా రిపబ్లిక్ ప్రభుత్వము సహకారంతో పనిచేయాలి. వీరే ఫెడరేషన్ యూనియన్ ను స్థాపించవలసి వుంటుంది.

7. సమిష్టి క్షేమంకోసం - నెదర్లాండ్సు - ఇండోనీసియన్ సమాఖ్య తమ ఇష్టంవచ్చిన ప్రత్యేక సౌకర్యాలను, ఏర్పాట్లను చేసుకోవచ్చును. ఇందుకు ఉభయరాజ్యాల శాసనసభలున్నూ, పూనుకుంటాయి. విదేశవ్యవహారాలు, రక్షణ, ఆర్థికవ్యవహారాలు, వైజ్ఞానిక సంబంధాలు - మొదలైనవాటిలో పరస్పరమూ సహకరించుకొంటూ సమిష్టి నిర్ణయాలు జరుపవలసివుంటుంది.

8. నెదర్లాండ్సు - ఇండోనీసియన్ యూనియన్ కు డచ్ రాణీ

సర్వాధికారిణిగా వుంటుంది. సమిష్టి క్షేమానికి సంబంధించిన ఉత్తరువులు ఈమె పేరుతోనే ప్రకటితమవుతూ వుంటాయి.

9. నెదర్లాండ్సు ప్రభుత్వమూ, ఇండొనేసియా ప్రభుత్వమూ యూనియన్‌లో చేరిన తరువాత ఎవరిబాధ్యతలను వారు నిర్వహించడానికి, ఒకరి హక్కులను వేరొకరు గౌరవించటానికి కొన్ని మినహాయింపులు వుండాలి. ఉభయప్రాంతాల ప్రజలు సమానమైన పౌరసత్వాలను అనుభవించవచ్చును. ఇండొనేసియా తన ప్రత్యేక సైనికశాఖను ఏర్పరచుకొనువరకు నెదర్లాండ్సు ప్రభుత్వ సైన్యం ఏవిధంగా సహాయపడవలెననునది సంప్రదింపులపై తేల్చుకోవలసివుంటుంది.

10. ఇరువర్గములవారున్నూ కలిసి యూనియన్ శాసనాలను తయారుచేసుకోవాలి; ఉభయరాజ్యాల శాసనసభలున్నూ ఆమోదించిన వెంటనే ఆశాసనాలు అమలులోకి వస్తాయి.

11. ఇండొనేసియా సంయుక్తరాష్ట్రాల స్థాపనను 1949లోగా పూర్తిచేయడానికిగాను ఉభయ ప్రభుత్వములున్నూ కలిసి కృషి చేయాలి.

12 నెదర్లాండ్సు - ఇండొనేసియా యూనియన్ ఏర్పడగానే ఇండొనేసియా సంయుక్త రాష్ట్రాలకు ఐక్యరాజ్య సమితిలో సభ్యత్వాన్ని సంపాదించడానికి డచ్ ప్రభుత్వం పూనుకుంటుంది.

13. ఇండొనేసియనులు కానివారి ఆస్తిపాస్తులు ఎవరివి వారికి చెందడం అవసరమని ఇండొనేసియా రిపబ్లిక్ గుర్తించాలి.

14. ఈ ఒడంబడిక పూర్తికాగానే ఉభయదేశాలున్నూ తమ తమ ఆయుధ బలాలను తగ్గించివేయాలి. మిలిటరీ వ్యవహారాలలో పరస్పర సహకారం ఏవిధంగా వుండవలసినదీ సంప్రదింపుల ద్వారా నిర్ణయించుకోవలసి వుంటుంది.

బటేవియా నగరానికి సమీపంలోవున్న "లింగజాటి" గ్రామంలో సమావేశమై 1947 మార్చి 25 వ తేదీని, డచ్చి ప్రభుత్వ ప్రతినిధులు, ఇండోనేసియను ప్రభుత్వ ప్రతినిధులు, కలిసి తయారుచేసిన ఈ ఒడంబడికను, తమతమ ప్రభుత్వ శాసనసభలచే ఆమోదింపచేయడానికి అంగీకరించారు అందుకు అనుగుణంగా డచ్చి ప్రధాని షెరమర్ హారన్ హాలెండుకు ఇండోనేసియా ప్రధాని డా॥ షరీర్ రిపబ్లిక్ ప్రభుత్వ కేంద్రమైన "జొగ్గకర్తా" కు వెడలిపోయారు.

ఈ ఒడంబడికలోని షరతులను ఇరుదేశ ప్రభుత్వ నాయకులు సుమారు ఒక నెలరోజులపాటు సమీక్షించారు. చర్చలపైచర్చలు జరిగిన పిమ్మట ఇరువర్గనాయకులకు కూడా ఈ ఒడంబడికపై తృప్తికంటె అసంతృప్తే అధికంగా కలిగింది. డచ్చి ప్రభుత్వంలో ఒకింత పలుకుబడిగల సామ్రాజ్యవాదు లందరూ దీనిపై పెద్ద ఆందోళన లేవదీశారు ఇండోనేసియాకు స్వాతంత్ర్యం అనుదానిని ఒకపాటిగా ఆమోదిస్తూవున్న ఈ ఒడంబడిక ఆచరణలోనికి వచ్చినట్లయితే, ఇక డచ్చి ప్రజలకు, ముఖ్యంగా వాణిజ్యవర్గాలకు తీరని అపచారం జరుగుతుందని, తమ బ్రతుకు తెరువుకే తిలోదకాలను వదులుకోవలసి వుంటుందని, ముఖ్యంగా ప్రపంచ సామ్రాజ్య ప్రభుత్వాలదృష్టిలో ఇక డచ్చి ప్రభుత్వంచాలా, "చిన్నచూపు"కు పాల్పడి, పరువుప్రతిష్ఠలను కోల్పోతుందని - ఆసామ్రాజ్యవాద డచ్చి ప్రభువులు గోలపెట్టారు. అయినా ఏవోకొన్ని చిల్లర సంస్కరణలను మినహా వారు ఒడంబడికలో ప్రధాన సూత్రాలను వేటినీ మార్చలేకపోయారు.

ఇక ఇండోనేసియన్ జాతీయవాదుల దృష్టిలో ఈ ఒడంబడిక అంతగా ఆనలేదు. సుమారు సంవత్సరంపైనుంచి బ్రహ్మాండమైన పోరాటాన్ని నడిపి, రక్తబలిదానమిచ్చిన వానికి ఇది సరియైన ప్రతిఫలం కాదని వారు అతృప్తినొందారు. ఇందుకు తగిన కారణంకూడా లేకపోలేదు.

ఈ ఒడంబడికలోని ప్రధాన లోపమేమంటే డచ్చి ప్రభుత్వం

తో ఏలాంటి సంబంధబాంధవ్యాలు వుండకూడదని ఆశించే ఇండోనీసియను జాతీయ ఆశవాదులకు ఇది ఆశాభంగం కలుగజేస్తూవుంది. ఇండోనీసియను సంయుక్తరాష్ట్రాలు ఏర్పడినా అవి హాలెండు సామ్రాజ్య బంధాన్ని త్రెంచుకోలేదు. ఇక రాజ్యాంగపరిషత్తులో కూడా ఇట్టిలోపమే వున్నది. డచ్చి ప్రతినిధులు కూడా ఇండోనీసియను ప్రతినిధులతో సమానంగా పరిషత్తులోపాల్గొని రాజ్యాంగరచనలో ఇండోనీసియను ప్రజలఅభివృద్ధి సూచనలను నిరోధించవచ్చు. జావా, మదుర సుమత్రా దీవులను రిపబ్లిక్ ప్రభుత్వానికి వదలి, ఆ రిపబ్లిక్‌కు చుట్టూ వున్నదీవులయందు డచ్చి ప్రభుత్వాధికారం ఇంకా వుండడమంటే అది రిపబ్లిక్‌కు క్షేమప్రదం కాజాలదు. డచ్చివారు రిపబ్లిక్‌కు ఎట్టి మోసాలనైనా చేయగలుగుతారు— ఇట్టివే దేశీయ, రక్షణ, ఆర్థిక, సైనిక శాఖలన్నిటియందు పెక్కు దోషాలు వ్యక్తమవుతూ వున్నాయి. అందువలననే ఇండోనీసియను జాతీయనాయకులు అతృప్తినివెలిబుచ్చారు. కాని, డా॥ షరీర్ వంటి మితవాద నాయకుల ప్రోద్బలంవల్ల ఈ ఒడంబడికకు కొలది సవరణలను సూచించి, వారు ఆమోదించారు.

కాని, అసలు ఒడంబడికకు కొత్తసవరణలు ప్రతిపాదితం కావడంవల్ల—ఆ నూతన ఒడంబడికను తిరిగి డచ్ ప్రభుత్వము సవరించిన ఒడంబడికను ఇండోనీసియన్ ప్రభుత్వమూ ఆమోదించలేకపోయాయి. ఇందుపై తిరిగి చర్చలు, సమావేశాలు, సంప్రదింపులు—అంటూ రాయబారాల ఘట్టం, అంతూ దరీ లేకుండా కొనసాగజొచ్చింది.

పర్యవసానంగా నెలలు గడచిపోయినా పరిష్కృతమైనట్టుగా కనబడిన ఇండోనీసియా స్వాతంత్ర్య సమస్య అపరిష్కృతంగానే నిలిచిపోయింది. అసలు సమస్య అపరిష్కృతంగా అట్టే నిలిచివున్న అదనులో—అసలు సమస్యను భంగించే చిల్లర సమస్యలు వేలాదిగా పుట్టుకొంటాయి—చిల్లరసమస్యలతోపాటుతో ఇండోనీసియా స్వాతంత్ర్యానికే చిల్లులు పెట్టాలని డచ్ సామ్రాజ్యవాదులు హుటాహుటి తాపత్రయపడ నారంభించారు.

# "క్విట్ - ఆసియా"

సామ్రాజ్యవాదాన్ని గూర్చి ప్రాస్తూ ప్రసిద్ధ అమెరికన్ పత్రికా రచయిత లూయీఫిషర్ ఒకచోట యిలా అన్నాడు. "—సామ్రాజ్యవాదం కుమ్మరిపురుగు లాంటిది. లోలోపల ప్రవేశిస్తూపోతూ అది ఇల్లు గుల్ల చేస్తుంది. అల్లాగే సామ్రాజ్యవాది నీతులు, సూత్రాలు వల్లిస్తూ, దాసదేశాన్ని ఉద్ధరించడానికే తాను జన్మించినట్లు ప్రకటిస్తూ, ఆ ఉద్ధరణకలాపంలో తాను మోస్తూవున్న భారాన్ని గూర్చి గోరంతలు కొండంతలుగా వర్ణిస్తూ-ప్రజలను, ప్రపంచాన్ని కూడా కనుగప్పజూస్తాడు. ఈ తాపత్రయ్యంలో అతడు భాషకు వెనుకాడడు, అకార్యాచరణలకు జంకడు..."

—సూక్ష్మంలో సామ్రాజ్యవాది లక్షణాన్ని ఫిషర్ మహాశయుడు ఇలా వర్ణించాడు. అట్టి సామ్రాజ్యవాదులలో ఒకడైన డచ్ వాని గుణగణాలను గూర్చి మరో అమెరికన్ వాణిజ్యప్రముఖుడు ఇలా అన్నాడు: "...నమ్మకద్రోహం చెయ్యడంలో డచ్ వానిని మించినవాడు ఈ ప్రపంచంలో వేరొకడుండడు. కత్తిచూపించి బెదరించినంతకాలం డచ్ వాడు నీకుదాసోహమంటాడు. కొంచెం మెత్తతనం చూపించావా, అతడు నీ తలపై కెక్కి కూర్చుంటాడు..."

—ఇండొనీసియా స్వాతంత్ర్యసమస్య సందర్భములో డచ్ సామ్రాజ్యవాదుల ప్రవర్తనను పరికించినట్లయితే ఈ పైన ఉదాహృతులైన రెండుపలుకులు అక్షరాలా అనువర్తించి ఉన్నట్లు విదితమవుతుంది.

ఇండొనీసియా ఒడంబడికను ఆమోదించడానికి ఉభయ ప్రభుత్వాలు ఇంకా సమాలోచనలు జరుపుతూవున్న అవకాశాన్ని పురస్కరించుకొని-అసలు ఒడంబడికనే భగ్నం చేయాలని డచ్ ప్రభుత్వాధికారులు ప్రయత్నాల నారంభించారు.

ఇండోనీసియాను గురించి హాలెండులోను, తద్వారా ఇతర దేశాలలోను విరుద్ధభావం కలగడానికని - 'ఇండోనీసియా రిపబ్లిక్ ప్రభుత్వంలో ఐక్యభావం లేదని, నాయకులమధ్య విభేదాలు బాగా హెచ్చు పెరిగివున్నాయని, వారు తమ దేశాన్ని పరిపాలించుకొనే సమర్థత కలిగినవారు కూడ కాదని, యుద్ధ విరామపు సంధి జరిగినా వారా సూత్రాలను ఉల్లంఘించి చిలిపియుద్ధాలను చేస్తున్నారని - అందువలన అసలు ఒడంబడిక పునః పరిశీలన చేయవలసి వచ్చిందని' డచ్ సామ్రాజ్యవాదులు ఒక పెద్ద దుష్ప్రచారాన్ని ఆరంభించారు.

ఇతర దేశాలలో ఈ విధమైన ప్రచారాన్ని ప్రారంభించి- ఇటు యిండోనీసియాలోకూడా వేరొక విధేన ప్రచారాన్ని సాగించడానికిగాను వారు డా॥ వాన్‌మూక్‌కు ఆదేశమిచ్చారు. స్వతః కరడుగట్టిన సామ్రాజ్యవాది వాన్‌మూక్ ఇందుకు నడుముబిగించి- ఇండోనీసియా అంతటా సంచార మారంభించాడు. ఇండోనీసియనులలో అభిప్రాయ భేదాలనెక్కించి రిపబ్లిక్ ప్రభుత్వంపై తిరుగుబాట్లను ఇతడు ప్రోత్సహిస్తున్నాడు, దక్షిణ సెలిబస్ దీవికి చెందిన 'మకస్సార్'లోని మాలినో' అను గ్రామంలో ఇటీవల ఒకసమావేశాన్ని ఏర్పరచి, కొందరు స్వార్థపరులగు ఇండోనీసియనులచే ఒక ప్రకటన చేయించాడు ఇండోనీసియా రిపబ్లిక్‌లో లేని యితరదీవులన్ని ఒకసమాఖ్యక్రిందకు వచ్చి, ఇండోనీసియను రిపబ్లిక్‌లో స్థానాలను సంపాదిస్తాయని ఆ ప్రకటనలోని సారాంశం. అంటే డచ్చి అనుకూలురు రిపబ్లిక్ ప్రభుత్వంలో స్థానాలుసంపాదించి దానిని దుర్బలపరచడానికి ప్రయత్నిస్తారన్నమాట.

ఇదిగాక, జావా, సుమత్రా, మదురదీవులలో కూడా డా॥ వాన్‌మూక్ కొందరిని రెచ్చగొట్టి స్వాతంత్ర్యోద్యమాలను లేవదీస్తున్నాడు. పశ్చిమజావాలో ఒక రాష్ట్రం రిపబ్లికు నుండి విడిపోవాలని ఆందోళన లేవదీసింది. ఆభాగంలో 'సుండా' జాతీయులు ఎక్కువగావున్నారు. వారిజనాభా 12,00,000. వారినాగరికత విజ్ఞానాలు ప్రత్యేకమైనవి. తమఅభ్యుదయంకోసం వారు రిపబ్లిక్‌నుండి విడిపోయి

ప్రత్యేక పరిపాలనను ఏర్పరచుకొ నుత్సహిస్తున్నారు." అంటూ "పాసోండన్ పార్టీ" (స్వాతంత్ర్యపక్షం) అనే పేరతో ఒక పక్షంబయలుదేరి ఆందోళన చేయనారంభించింది దీనిని డా॥ వాన్ మూక్ బహిరంగంగానే బలపరుస్తూ వున్నాడు ఇంతేకాదు, ఇండొనీసియా సంయుక్తరాష్ట్రాలలో చేరని "బోర్నియో" లోకూడా ఒక స్వాతంత్ర్య ప్రభుత్వాన్ని వాన్ మూక్ నెలకొల్పాడు. పొంటనాకో సుల్తాను హమీద్ అనునతడు ఆప్రభుత్వానికి గవర్నరుజనరల్ గా నియమింపబడ్డాడు ఇట్లే- ఇతర దీవులందుకూడ మరికొన్ని విభజనోద్యమాలు, స్వాతంత్ర్య విప్లవాలు పొడసూపబోతూ వున్నవి.

ఇండొనీసియా అంతటా ఇట్టివిభజనోద్యమాలను లేవనెత్తి రిపబ్లిక్ ప్రభుత్వాన్ని దుర్బలపరచాలని, రిపబ్లిక్ స్వాతంత్ర్యాన్ని ఒక శాశ్వతమైన అంతఃకలహాకలుషితం చేయవలెనని డచ్ సామ్రాజ్యవాదులు పలువిధములైన ఎత్తులు వేస్తూవున్నారు.

ఒకవైపున విభేదాలను, విభజనోద్యమాలను రెచ్చగొట్టడమేగాక - వేరొకవైపున డచ్ వారు సైనికముగా కూడా మరికొన్ని ద్రోహాలను చేస్తున్నారు ఒడంబడిక ప్రకారం - ఇరు వర్గాల వారు సైన్యాన్ని పరిమితం చేయవలసివున్నది. అంతేకాక డచ్ వారు తమ సైన్యాలను ఇండొనిసియానుండి ఉపసంహరించవలసి వున్నది. అయినా ఈ సూత్రాన్ని ఉల్లంఘించి - డచ్ వారు అదనపు సైన్యాలను ఇండొనీసియాకు చేరవేస్తున్నారు. ఈ విధంగా దిగుమతి అయిన డచ్ సేన ఇండొసియాలో సుమారు రెండులక్షలవరకు చేరుకొన్నవి.

ఇట్లు తమసైన్యాలను చేర్చుకొనడంలో డచ్చి వారుఒంటరిగా వ్యవహరించడంలేదు. అట్లుఒంటరిగా చేయగల సామర్థ్యమున్న డచ్చి వారికిలేదు. తోడిసామ్రాజ్యవాదులైన అమెరికా బ్రిటనుల తోడ్పాటుతోనే ఈ పనిని వారుధారాళంగా చేయగలుగుతున్నారు. ఇండొనీసియానుండి బ్రిటిష్ సైన్యాలు తొలగిపోయినవని చెప్పడం నామమాత్రమైనది తొలగి పోతూపోతూ, బ్రిటిష్ సైనికాధికారులు తమ

ఆయుధ సంపత్తి నంతనూ కూడ డచ్చి సైన్యాలకు వాయిన మిచ్చినవి. ఇంతే కాక ప్రత్యేకంగా రెండువందలమంది బ్రిటిష్ మిలటరీ నిపుణులు డచ్చి సేనలను తరీఫీదు చేసి ఇండోనీసియాకు పంపుతూవున్నారు. బ్రిటను చేస్తున్న ఈ సైనికసహాయానికి తోడుగా డచ్చి వారికి అమెరికా కూడా ఆర్థికసహాయం చేస్తూవుంది. ఇండోనీసియా పునర్నిర్మాణానికి అప్పు కావలెననే డచ్చి ప్రభుత్వపు కోర్కెను అమెరికా అంగీకరించింది. పుష్కలంగా సహజసంపదలుగల ఇండోనీసియా తమ ఆర్థిక సామ్రాజ్యపు బాహుబంధంలోనికి అప్రయత్నంగా వస్తూవున్నందుకు అమెరికా ఆర్థిక సామ్రాజ్యతత్వం ఉప్పొంగి గంతులు వేస్తూవుంది. అమెరికా ప్రభుత్వంతరఫున కొంతమంది వణిక్ ప్రముఖులు ఇండోనీసియాను వేంచేసి స్థావరాలను చిక్కబట్టుకున్నారు.

—ఇండోనీసియా విషయంలో డచ్చి సామ్రాజ్యవాదుల పోకడలు చిత్రవిచిత్రమైన పుంతల పడుతూవున్నాయి. ఇండోనీసియాను స్వయంగా పాలించగల తాహతు డచ్చివారికి నిండుకున్నది; అట్లని, ఇండోనీసియాను ఇండోనీసియనులకు వదలివేయటానికిన్ని వారికి మనస్సు ఒప్పటంలేదు. అందువల్ల ఇతర సామ్రాజ్యవాదులను అచట ప్రవేశపెడితే, వారితోడ్పాటుతో, తామున్ను కొంత అధికారాన్ని సంపాదించవచ్చుననే నీచకృత్యానికి డచ్చి సామ్రాజ్యవాదులు పాల్పడుతూవున్నారు. డచ్చివారి అసమర్థపు బ్రతుకును అవకాశంగా తీసుకొని, బ్రిటను అమెరికాలు ఇండోనీసియాలో ప్రవేశించినవి. డచ్చివారి పేరుతో ఈ నూతన సామ్రాజ్యవాదాలు, ఇక ఇండోనీసియాకు ఆర్థిక, అస్వాతంత్ర్య బంధాలు బిగించవలెనని తాపత్రయపడుతున్నాయి.—

ఇండోనీసియాతో జరిగిన ఒడంబడికను ఏవిధంగానైనా భగ్నంచేయవలెనను తలంపుతో డచ్ సామ్రాజ్యవాదులు ఎన్ని కుట్రాలోచనలను చేయ వీలవునో అన్నీ చేస్తున్నారు. తోడి దొంగలుగావచ్చిన బ్రిటీష్ అమెరికన్ సామ్రాజ్యవాదుల మద్దతు చూచుకొని ఇండోనీసియన్ల స్వాతంత్ర్యంపై దురాక్రమణచేయవలెనని కూడా డచ్ సామ్రాజ్యవాదులు ఉద్యమిస్తువున్నారు.

ఈ ఉద్యమానికి ఉపకరణంగా వారు ఒక కొత్త పథకాన్ని ప్రవేశ పెట్టారు. 1949 సంవత్సరంలో స్థాపించనున్న 'ఇండోనీసియా సంయుక్త రాష్ట్రాల' ప్రభుత్వానికి ముందుగా - ఆ కాగ్యకలాపాన్ని అంతనూ దిగ్విజయంగా నడుపగల ఒక కేంద్ర ఫెడరల్ ప్రభుత్వాన్ని స్థాపించవలెనని వారు సూచించారు. ఈ తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వంలో విదేశాంగవ్యవహార, సైనిక, పోలీసుశాఖలన్నీ డచ్ వారిచేతులలో వుంటవి. ఇందుకు పూర్తిగా రిపబ్లిక్ నాయకులు తోడ్పడవలసియుంటుంది వారు ఇందుకుసహాయ నిరాకరణం చేయదల్చినట్లయితే - అందుకు ప్రతిగా తాము చేయదలచుకున్నదేదో చేసితీరవలెనని డచ్చి ప్రభుత్వాధికారులు రిపబ్లిక్ ప్రభుత్వానికి స్పష్టంగా తెలియజేశారు. ఇందుకు రిపబ్లిక్ ప్రభుత్వ ప్రధాని డా॥ షరీర్, కొన్ని సూచనలను చేస్తూ, తాత్కాలిక ఫెడరల్ ప్రభుత్వస్థాపనకు అంగీకరించాడు. అందుపై డచ్చిఅధికారులు ఇండోనీసియన్ ప్రభుత్వానికి ఇంకనూ కొత్తచిక్కులు కలుగజేయవలెనని మార్గోపాయాలను పన్నుతూవున్నారు.

ఈధోరణినంతను తిలకించినట్లయితే- వెనుకటి "లింగజాటి ఒడంబడిక"న్న నీటిమీదివ్రాతగా పరిణమింపజేయాలనిఇండోనీసియాను ఎట్లయినా డచ్చి సామ్రాజ్యస్థమైన వలసదేశంగా వుంచుకోవడానికి డచ్చివారు తాపత్రయపడుతున్నారని వ్యక్తమవుతూవున్నదని - ప్రాచ్యఖండరాజకీయ పరిశీలకులు ఊహిస్తూవున్నారు. అసలు భీషణమైన అంతిమసంగ్రామం జరిగితేనేగాని ఇండోనీసియా స్వాతంత్ర్యసమస్య పరిష్కారంకాదని కూడావారు చెబుతూవున్నారు.—

ఈ సత్యాన్నే వెల్లడిస్తూ-ఇండోనీసియా రిపబ్లిక ప్రభుత్వ సమాచార శాఖకుచెందిన అనధికార డచ్చి భాషాపత్రిక 'న్యూవాన్ బ్లాడ్'- సామ్రాజ్యవాదుల కలిసికట్టుగా చేస్తూవున్న కుట్రల నన్నిటినీ పీడిత ప్రజలయెదుట పెట్టింది. డచ్చి సామ్రాజ్యవాదులకు తోడుగా బ్రిటిషు అమెరికను సామ్రాజ్యవాదులుకూడా ఇండోనీసియాలో ప్రవేశించి ఆచరిస్తూవున్న ఘోరాలను ఆపత్రిక తీవ్రంగా ఖండించింది

అంతేకాదు-ప్రాచ్యఖండంనుంచి పాశ్చిమాత్యజాతులు వెంటనే నిష్క్రమించాలనికూడా ఆపత్రిక చేయెత్తి చెప్పింది.

'న్యూవాప్ బ్లాడ్' అనే ఈ ఇండోనీసియను పత్రిక వ్రాతలను బలపరుస్తూ ప్రశిద్ధివహించిన 'న్యూయార్క్-హెరాల్డుట్రిబ్యూను' అనే అమెరికను పత్రిక (46-మే-2) ఇలాఉద్ఘాటించింది: "ఆసియాఖండమంతటా రాజకీయస్వాతంత్రోద్యమాలు ఉవ్వెత్తున పొంగుతున్నవి. ప్రాచ్యప్రజలను రక్షించటానికి అవతరించిన దైవాంశసంభూతుడవని తెల్లవాడు భావించేరోజులు గతించిపోయాయి. అతడు సాధారణమైన వుడనని అనుకొని ప్రవర్తిస్తేనే ఇక ప్రాచ్యఖండంలో బ్రతికి బట్టకట్ట గలుగుతాడు . . ఇండోనీసియాలో డచ్చిసామ్రాజ్యవాదులకు ఇంకా జ్ఞానోదయమైనట్లులేదు. ఎవరోకొందరు అనామకులగు స్వార్థపరులను చేరదీసి వారికుట్రలతో రిపబ్లికు ప్రభుత్వస్వాతంత్ర్యాన్ని హరించటానికి డచ్చివారు యింకా ప్రయత్నిస్తున్నారంటే - వారిగోయ్యి వారే త్రవ్వుకుంటున్నారన్నమాట. పరిస్థితులను కూలంకషంగా పరిశీలించి చూచినట్లయితే-అసలు ప్రాచ్యఖండంనుండి పాశ్చాత్యులు వెంటనే తరలిపోవడం చాలా మంచిదని తోస్తూవుంది. యథార్థపరిస్థితులను తెలుసుకొని సామ్రాజ్యవాదులు తమంతటతాము తరలిపోకపోయినట్లయితే - విప్లవశక్తులచేవారు తరిమి వేయబడటంతథ్యం . . ”

అమెరికన్ పత్రికలేకాదు; యావత్తు ప్రాచ్య ఖండ పీడిత ప్రజలు నేడు ముక్తకంఠంతో ఎలుగెత్తి చెపుతూ వున్నదికూడా ఇదే— "క్విట్-ఆసియా"

ప్రాచ్య ఖండంపై అధికారాన్ని చెలాయించడానికి పాశ్చిమాత్యజాతులకు ఎట్టి హక్కులున్నూ లేవు చరిత్ర దృష్ట్యామాత్రమే కాక - ఈనాటి పరిస్థితులుకూడా ఈ సత్యాన్నే ఉద్ఘాటిస్తూవున్నాయి. మోసపుటెత్తులతో ప్రవేశించి, కుట్రలతో శక్తినికూర్చుకొని, పశుబలంతో ప్రజలను, ప్రభుత్వాలను వంచించి - ప్రాచ్య ఖండంలోని వివిధదేశాలను పాశ్చాత్యులు ఆక్రమించుకున్నారు. నేటికి మూడు శతాబ్దులుగా ప్రాచ్యప్రజల రక్తమాంసాలపై పాశ్చాత్యులు జీవిస్తూవున్నారు. ఈ ప్రాశ్చాత్యుల అవినీతి కార్యకలాపంతో-ధర్మ

క్షేత్రాలైన ప్రాచ్యభూములు జీర్ణశిథిలాలు కావడంతప్ప అన్యప్రయోజనం సిద్ధించి వుండలేదు.

ప్రాచ్యఖండం నేడు స్వాతంత్ర్యభావ పులకితమై వుంది. ప్రపంచ ప్రజా స్వాతంత్ర్యాశయాన్ని ప్రాచ్యప్రజలే ప్రపంచ ప్రజలకు ఉపదేశిస్తున్నారు. కాని ఇట్టి ఆశయాలనే ఏకరవు పెడుతూ పాశ్చాత్య సామ్రాజ్యవాదులు యుద్ధాలపై యుద్ధాలను తెచ్చిపెడుతున్నారు. మానవసభ్యతను రక్షించడానికే అనిచెబుతూ వారు మానవజాతిని మారణహోమానికి ఎఱచేస్తూవున్నారు. ఈరాక్షసకృత్యాల ద్వారా వారు ప్రపంచానికే బరువైపోయారు; అందునా ప్రాచ్యఖండానికి ఈ అప్రాచ్యులభారం మరీ అపరిమితమైపోయింది.

ఈభారంనుండి ప్రాచ్యఖండం బయటపడవలెనంటే- ప్రాచ్యఖండమునుండి పాశ్చాత్య సామ్రాజ్యవాదుల పీడావిముక్తి కావాలి. ఇది అవశ్యముజరగాలి ఇదిజరిగిననాడే ప్రాచ్యఖండానికి శాంతి. పాశ్చాత్యులకున్నూ విశ్రాంతి. అట్టిశాంతి, విశ్రాంతులను వాంఛించియే ప్రాచ్యప్రజలు నేడు పాశ్చాత్యుల నుద్దేశించి చెపుతూవున్నారు- "క్విట్ ఆసియా" అని...!



# అఖిల ఆసియా

**ఆదిమాత ఆసియామాత.**

అది పురుషుణ్ణికన్నది. అది విజ్ఞానజ్యోతిని వెల్లారించింది. అది కావ్యాన్ని ప్రభవించింది. అఖిలదిక్కులకు తనపుత్రులను పంపించి భూమండలఖండాలలో మానవసంఘ కల్పనచేసింది. - అట్టి ఆదిమాత - ప్రాచ్యఖండజనని ప్రాక్తన వైభవం అతులము, అపారము, అనంతమువై ఒప్పారినది. ఆనాటి విజ్ఞానవాణి యుగ యుగములనుండి జగ జగములవరకు అనంతకాలగర్భాన అవ్యాహతమయమై ఆలాపిస్తూనే వుండగల అన్ని ఖండాలలోను ఆసియాఖండము పెద్దది!

సుమారు 7000 మైళ్లు పొడుగు 6000 మైళ్లు వెడల్పు గల - అవగా - 172 లక్షల చదరపు మైళ్లు విస్తీర్ణంగలిగిన బ్రహ్మాండమైన ఖండమిది. —

11,170 లక్షల జనాభా. ఐదుఖండాల జనాభాలోను సగాని కంటె ఎక్కువకలిగిన మానవప్రపంచ మీఖండం-

పాడిపంటలకు కామధేనువు, కల్పతరువూను. భూగర్భసంపత్తికి అంతులేని ఒక ఖని —

మతవిజ్ఞానాలకు పుట్టినిల్లు. కళాసంపదలకు ఆటపట్టు....

ఆదిభాష సంస్కృతమైనప్పటికిని, సుమారు పదిహేనువందల భాషలకు నెలవు...

భూగోళంలో మూడవవంతు ఆసియాఖండం ఆంక్రమించుకొని వున్నది. —

హిందూ మహాసముద్ర, శాంతి మహాసముద్ర, ఉత్తర మహాసముద్ర పరివేష్టితమైన ఈ ఆదిఖండం - ప్రపంచంలో మరేజాతి కంటె, ఎచటి కళా సంస్కృతులకంటెకూడా అధికమైన, అధికతరమైన స్థానాన్ని పొందిన ఈప్రాచ్యఖండం నేడు - విధివశాన - పాశ్చాత్యజాతుల ప్రాబల్యానికి చిక్కి శీర్ణశిథిలమై పోయింది. ఈ ప్రాచ్యభూముల చరిత్రలో, సుమారు మూడు శతాబ్దుల దీర్ఘకాలావధిలో, చూస్తూవుండగానే స్వగృహాలు దొంగలు దోచుకున్న చందమైనవి. విజ్ఞానినిలయం అజ్ఞాన వలయంలో చిక్కుకున్నది. అన్నపూర్ణ యింటిలోనే అన్నం కరువై పోయింది. సరస్వతి తాండవించిన చోటనే అక్షరతత్వం అదృశ్యమైపోయింది. కుబేరుని కోటలోనే కటిక దారిద్ర్యం తాండవించినది. స్వాతంత్ర్య సీమలోనే అస్వాతంత్ర్యము, ఆపైన అప్రాచ్యుల అధికార ప్రాబల్యము అవతరించినవి. ఏదో శాపగ్రస్తమైనట్లు ఆదిమాత నేడు అథోగతికి లోనయి పోయింది. —

మధ్యప్రాచ్యంలో బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ జాతులు రాజ్యం చేసుకున్నాయి. భారతభూమిలో ఆంగ్లేయులు పీఠం వేసు

క్నున్నారు ఇండోనేషియాలో డచ్ జాతీయులు రక్తతృష్ణ తీర్చుకుంటు న్నారు. ఇండో చైనాలో ఫ్రెంచిజాతి కొల్లగొట్టుకుంటున్నది చైనా రిపబ్లిక్ భూమిలో ఆంగ్ల, అమెరికన్ అర్థపిశాచి వికటాట్టహాసం చేస్తున్నది ఫిలిప్పయినులలో అమెరికా డాలర్ సామ్రాజ్యం రింగ్న మోగిపోతున్నది

ఆసియా దేశాలలో టర్కీ, ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్. అరేబియా టిబెట్, సయాం, చైనాలు మాత్రమే నేడు స్వతంత్ర దేశాలుగా చెప్ప బడుతూ వున్న ప్పటికిని ఈదేశా లన్నిటియందు పాశ్చాత్య సామ్రా జ్యవాద ప్రభంజనుడు ఓడు గాలివిసురుతూనే వున్నాడు; గాలిదుమా రాలను రేపుతూనేవున్నాడు. ఏదోవిధంగా ప్రతిదేశము ఒక్కొక్క దాసదేశమైపోయింది. ఆర్థిక, సాంఘిక, రాజకీయ పారతంత్ర్యాలు ఆసియా దేశాలను ఆవహించి సల్లార్చుతున్నవి

ఈవల్లటిచేపులలో అప్పుడప్పుడు కొన్ని స్వాతంత్ర్య ప్రబోధ జ్యోతులు పాశ్చాత్యప్రజల దృష్టులలోపడి మెరిసిపోయినవి. సోవియ ట్, రష్యావిప్లవము, టర్కీవిప్లవము, చైనావిప్లవము, భారతదేశపు అహింసావిప్లవము పొందలేనివి ఆసియావాసులను చైతన్య భావప్ర భాసితుల నొనర్చినవి. మార్క్సు, కెమాల్ పాషా, జగ్లుల్ పాషా, సన్ యట్ సేన్, మహాత్మాగాంధీ, మొదలగు మహాపురుషులు ఆసియా ప్రజల ఆశాస్వరూపులై బ్రహ్మాండమైన పరివర్తనను కొనితెచ్చారు.

"ఆసియా ఆసియావాసులకే" అను ఒక మహిలాకాంక్ష ఈనా డు ప్రాచ్యఖండప్రజలను ఉత్సాగ్నులను చేస్తూవుంది. వివిధ ఆసియా జాతుల వారందరు ఒండొరులతో సహకరించి పరస్పర సౌభాగ్యాన్ని సంపాదించుకొంటూ ప్రగతిగాములు కావాలని ఆశిస్తూవున్నారు. ఇట్టి ఆశయప్రభవానికి భారతభూమి పుట్టినిల్లుకావడం భారతదేశపు భాగ్యం. 1947 మార్చి మాసంలో పండిత జవహరిలాల్ నెహ్రూ అధ్వర్యాన భారత రాజధానీ నగరమైన హస్తినాపురంలో "అఖిల ఆసియా దేశాల పరిషత్తు" సమావేశమై ప్రపంచానికి శాంతిసందేశ మిచ్చింది. ప్రాచ్యఖండములో విస్మృతమైన బౌద్ధమత వారసుడు మహా త్మాగాంధి, అపరబుద్ధుడో యనునట్లు ఆమహాసభకు అమృత సందేశ మిచ్చినాడు.

స్వాతంత్ర్యభావాలతో స్పదించి, విశ్వసోదర భావముతో ఉద్రిక్తులైవున్న అఖిల ఆసియా మహాసభ ప్రతినిధులు ప్రాచ్యఖండానికి ఒక అమరజీవికను, యావత్ ప్రపంచానికి ఒక శాంతి సందేశాన్ని ప్రసాదించడానికి ఇక ప్రయత్నించ వలసి వున్నది. అందులోను ఈనాటి కల్లోల ప్రపంచాన్ని శాంతి ప్రపంచంగా మార్చి వేయవలెనంటే - ఆసియాఖండమే అందుకు పూనుకొన వలసియున్నది. "శాంతిఖండము" అనివినుతికెక్కిన ఆసియాఖండమే 'శాంతి'ని పునస్థాపించ వలసివున్నది. ఇది ఏ ఇతర ఖండంచేతనూ సాధ్య పడునది కాదు.

ఆధ్యాత్మిక శక్తిసంపదలకు వైదొలగి - భౌతిక శాస్త్రసాధనలను వరించిన పాశ్చాత్యజాతులకు 'శాంతి'స్థాపన జలవికాసపని - అందులోను భౌతిక శాస్త్రపు కంటు పొగంముట్టివున్న ఈనాటి పరిస్థితులలో రాక్షస శక్త్యుపాసులగు పాశ్చాత్యజాతులకు 'శాంతి' అనునది ఒక గగనకుసుమం; స్వప్నగత వృత్తాంతం...

ఇది పరమాణు యుగం పరమాణుశక్తిని చేతబట్టి మారణ యంత్రసాధనలో అమెరికా అగ్రస్థానం వహించివుంది. సామ్రాజ్యవాదులగు బ్రిటిష్, ఫ్రెంచి, డచ్, పైశాచికశక్తులకు అమెరికా అణుశక్తి, ధనశక్తి తోడైవున్నది. అగ్నికి గాలి తోడైనట్లు ఈ వివిధశక్తులన్ని చేతులుకలిపి ప్రపంచాన్ని అంతను తమ ప్రాబల్యంలో బంధించ యత్నిస్తూవున్నాయి

మారణయంత్రశక్తిదే నేడు మహీపతిత్వం వివున్నది. ఆ యంత్రశక్తిని పెంపొందించుకొనడానికే పాశ్చాత్యదేశాలు పోటాపోటీలు పడుతున్నవి అలా పెంపొందించుకొనడం ద్వారానే ప్రపంచంలో 'శాంతి'ని స్థాపించగలమని అభిభ్రమపడుతున్నవి. అభ్రమతోనే గడచిన ఒక్క తరంలోను రెండు భయంకరయుద్ధాలను అవి తెచ్చిపెట్టినవి. యంత్రశక్తి అమరముకావచ్చు; కాని దానిని ఉపాసించడంలో విశేషధీశక్తిని ప్రదర్శించిన పాశ్చాత్యజాతులు దానికే బలి అయిపోతున్నవి. తమతోపాటు ప్రపంచాన్నికూడా బలిచేస్తు

న్నవి. స్వార్థపూరితమైన ఈ పాశ్చాత్య నాయకత్వములో ఐరోపా ఖండమేగాక ఆసియా ఖండంకూడా అశాంతికి నెలవైపోయింది

వెనుకటివలె ఏ ఖండానికి ఆఖండం వేరు విడివడివుండలేదు. యంత్రశక్తి వృద్ధిచెందుతూ వున్నకొలది ఖండ ఖండాలమధ్యనున్న దూరం అపరిమితమై పోతున్నది అయితే ఖండ ఖండాలమధ్య సన్నిహితత్వాన్ని, ప్రేమాభిమానాలను పెంపొందించడానికి బదులుగా- ఇది ఒక శాశ్వతమైన శోషణగా పరిణమించింది. వివిధ ఖండజాల మధ్య "సోదరతత్వం" అనేది ఒక ఆశయంమాత్రంగానే నిల్చిపోయింది. ఈతత్వానికి వాస్తవికరూపకల్పన చేయడంలో పాశ్చాత్య నాయకత్వం సంకుచితంగా ప్రవర్తించి ప్రపంచాన్ని మోసంచేసింది. దాని విషఫలితమే: ఒక దేశంపై వేరొక దేశంబడి కొల్లగొట్టుకోవడం...!

కాగా - పాశ్చాత్య నాయకత్వం దేనినైతే సాధించజాలకపోయిందో - అది "అఖిల ఆసియా"వలననే సాధితం కావలసియున్నది. యుగ యుగములనుండి ప్రాచ్యఖండపు పరివర్తనం 'శాంతి' ప్రధానమైనది. శాంతి ప్రధానమైన ఆసియాఖండమే తిరిగి నాయకత్వం వహించి ప్రపంచంలో శాంతి సంస్థాపనచేయాలి. పాశ్చాత్య ప్రవృత్తిలోని అసుర తత్వాన్ని నశింపజేసి ప్రాచ్యఖండ ప్రేమతత్వాన్ని ప్రతిష్ఠించవలసివున్నది ఇది జరిగిననాడుగాని 'ఏకప్రపంచ' ఆశయం సఫలతనొందదు.

శాంతి ఆతురులైన ప్రపంచ పీడితప్రజలు 'ఆసియా' నాయకత్వంకోసం ఎదురుతెన్నులు చూస్తున్నారు. ఆసియా ఖండమే అనుగ్రహించవలసివున్నది.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

(సమాప్తి 30, జూన్, 1957)